శ్రీరస్తు.

# —చింతామణి విషయ పరిశోధనము—

## సానుబంధము.

ఇది

ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలాంధ్రోపాధ్యాయుఁడగు

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిచే

రచింపఁబడి ప్రకటింపఁబడినది.



SECOND EDITION 1000.
(REVISED.)

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1937.

 [*Price Re.* 1-2-0.

శ్రీరస్తు.

# —చింతామణి విషయ పరిశోధనము—

## సానుబంధము.

ఇది

ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలాంధ్రోపాధ్యాయుండగు

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిచే

రచింపఁబడి ప్రకటింపఁబడినది.



SECOND EDITION 1000.
(REVISED.)

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

1937.

 [Price Re. 1-2-0.

# చింతామణి విషయపరిశోధన ద్వితీయానుబంధము.

(౧౯౧౭) బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రులు [illegible] నా రచించిన చింతామణి విషయపరిశోధనములోని -౨౯- విషయములను విమర్శించి ప్రచురించిన వ్యాసమును [illegible]తామణి విషయపరిశోధన ద్వితీయ ముద్రణానంతరమున [illegible]రసంవత్స రాశ్వయుజ కార్తిక భారతులలోఁ జూచితిని. [illegible]కారణమున ద్వితీయ ముద్రణములోని యనుబంధమున [illegible]వ్యది చేర్పఁబడఁజాలదయ్యెను.

మునిత్రయ సమ్మతములును నియమములకు లోఁగిన సంస్కృతభాషయే యా కాలమున సర్వజన వ్యవహారభాషగ [illegible]నుండెనను నభిప్రాయము సుబ్రహ్మణ్యశాస్త్రులుగారి వ్యాస[illegible]లోఁ బాలభాగము నాక్రమించియున్నది. ఈ యభిప్రాయ[illegible]ను నేనే కాక భాషాశాస్త్రజ్ఞు లెవ్వరును సమ్మతింపఁజాలరని [illegible]నమ్మెదము. జనసామాన్యవ్యవహారభాష—బజారుభాష—[illegible]వ్యాకరణసమ్మతమును గ్రాంథికమును నై యుండుట యే కాల[illegible]మునను నే దేశమునందును నశ్రుతచరము.

“[illegible]” అను పాణినిసూత్రపు భాష్యము[illegible]ని సూత వ్యాకరణ సంవాదము “[illegible]తుపుపశు ‘స్థ’ [illegible]మ నాదేశము నిత్యమా? [illegible] భాషితమా” అను [illegible] [illegible] సూతుఁడు [illegible] వ్యాకరణ[illegible]

శిష్టుఁడే - కాని సామాన్య జనుఁడు కాఁడు. అ ట్లంగీకరింప నిచో నిఁక నప్పటి కాలపు జనసామాన్యమెల్ల - బజారుజనము సైతము వ్యాకరణ శాస్త్రవైదుష్యము గల్గియుండెడిదని, యసంభవశంక లేక చెప్పవలసివచ్చునుగదా!

పయిరీతినె ప్రాచ్యోదీచ్యాది శబ్దములచే దేశాంతరజనులను స్పృశించు భాష్యపంక్తులు సైత మయ్యా దేశములలోని శిష్టులనే స్పృశించుచున్నవని గ్రహింపవలెను.

ఇఁక నప్పటి సర్వజన వ్యవహార భాష సంస్కరింపఁబడి శిష్టులచే వాడుకొనఁబడెడిదందురా? వివాదమే లేదు. వేద భాషయుఁ గావ్యభాషయు శిష్టజన వ్యవహారభాషయు వ్యావహారికభాషనుండి యేర్పడినవేయని నేఁజూపిన యార్యభాషా వంశవృక్షమువలన (చింతా. పరిశో. ౭౬ విష) స్పష్టపడుచునే యున్నది.

ఇంతకును సుబ్రహ్మణ్యశాస్త్రులుగా రంత విపులముగా విమర్శించిన యీ విషయము—మునిత్రయసమ్మత సంస్కృత మేకాలమందును సర్వజనవ్యవహార భాషగ నుండియుండ లేదను విషయము—నా వ్రాసినది కాదు. ఆవాక్యములు శ్రీమాన్ పరవస్తు వేంకటరామానుజస్వామి ఆచార్యులుగారి వ్యాసమునుండి యుద్ధరింపఁబడినవై యున్నవి. (చింతా. పరిశో. ౭౫ విష) ఆ వాక్యము లుద్ధరణచిహ్నముల నడుమనుండుటను శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు సరిగఁ జూచికొని యుండలేదు కాఁబోలును! జనసామాన్యభాషను సంస్కరించిన శిష్టవ్యవహార భాష

యను వేఱొక భాష యాకాలమున నుండెడిదనెడి నాయభిప్రా యముగల పాశ్చాత్య పండితాదుల యభిప్రాయములను ప్రద ర్శించుటకయి వారి వ్యాసములోని యాపంక్తు లుద్ధరింపఁబడి నవి. (చింతా. శ్లో-౭౫ విమ).

ఇంక నాగ్రంథమును విమర్శించిన శాస్త్రులుగారి వ్యాస విషయము 'ఆకాలమున జనసామాన్య వ్యవహార భాషకంటె వేఱుగ శిష్టవ్యవహారభాషయను వేఱొకటి యుండెడిదా' అను నది మాత్రమే. జనసామాన్యభాషకును గ్రాంథిక భాషకును నడుమ శిష్టవ్యవహార భాషయొకటి యుండుట సకలభాషలం దును ననుభవ సిద్ధ విషయము. విశేషమేమనఁగా నట్టి వైదిక కార్యోపయోగి సంస్కృత శిష్టవ్యవహార భాషకు వ్యాకరణము గలదు. నేఁటి యాంధ్రశిష్టజన వ్యవహారభాషకు వ్యాకరణ సంస్కారము లేదు.

అట్టి వ్యాకరణ సంస్కారము చేయుట యావశ్యక మనియే నేఁటి విమర్శకులు పెక్కురు పెనఁగులాడుచున్నారు. మఱొక విశేషమేమనఁగా నేఁటి యాంధ్రకావ్యభాషకు వ్యాక రణ సంస్కారముగలదు. నాఁటి సంస్కృతకావ్యభాషకు వ్యాక రణము సాకల్యముగ రచింపఁబడి యుండలేదు. ఆకాలపువారు ధర్మపరతంత్రులు! నేఁటివారు రసపరతంత్రులు!

పాణినీయము కావ్యభాషను మూలముగాఁ జేసికొని రచింపఁబడినదికాదనియు నక్కారణమున నట్టి వ్యాకరణము కావ్యప్రయుక్త రూపవిమర్శనవిషయమున సాకల్యముగ నుప

చరింపదనియు నల్లగుటంజేసి కావ్యభాషా స్వరూప జిజ్ఞాసువుల కయ్యది సాకల్యముగ నుపదేశకమము కాదనియు నాయభిప్రాయము. పాణినీయమునకు ముందటి వనఁదగు కావ్యములున్న ట్లీవఱ కెవ్వరును నుదాహరించియుండలేదు. పాణినీయమునకుఁ దర్వాతి కావ్యములలోని ప్రయోగశతములు పాణినీయమునకు లొంగి యుండలేదనియుఁ బాణినీయ సాధ్యములగు పరిష్కృతరూపములు కావ్యములలో వాడఁబడి యుండలేదనియు ననేకోదాహరణప్రదర్శనపూర్వకముగా నేను విశదపఱిచియే యున్నాను. (చింతా. పరి. 80-92 విష. అందును 81-88-90-92 విషయములు ప్రధానములు) కాఁగా వ్యాకరణమన్నది ప్రయుక్త శబ్దాన్వాఖ్యాన మాత్రమె యనక తీరమింజేసి భాష్యాదివాక్యములనుబట్టి పాణినీయమునకు మూలమనఁదగు శిష్టవ్యవహారభాషయొకటి యుండెడిదని యంగీకరించుటయు క్తమైయున్నది.

ఇంక భారత రామాయణాదులలోని ప్రయోగములను బాణినీయము సాధించుచుండుటంజేసి యది తదనుశాసకమనఁదగునని సుబ్రహ్మణ్యశాస్త్రిలుగా రభిప్రాయపడుచున్నారు. భారత రామాయణాది గ్రాంథిక భాషకును, బాణినీయమునకు మూలమనఁదగు శిష్టవ్యవహారభాషకును గొంతసాన్నిధ్యముండుటంజేసి యట్టిగ్రాంథిక భాషలోని పెక్కుప్రయోగములు పాణినీయముచే సాధ్యమయినంతమాత్రమునఁ బాణినీయమున కట్టి గ్రాంథికభాష మూలమనికాని, పాణినీయము తదనుశాసకమనికాని స్థిరపడనేరదు. భారత రామాయణాదులలోని పరిష్కృతములగు ప్రయోగములు పాణినీయ సమ్మత

కాకుండుటచేతను పాణినీయ సాధ్యములగు పేపుతి త్రీయి
తి' మున్నగువానివంటి యనేక రూపములు రామాయ
లో లేకుండుటచేతను పాణినీయమునకును భారత
యణాది భాషకును నట్టి సంబంధమున్నదనెడు వాదము
కెరదు.

"ప్రయుక్తానామే వేద మన్వాఖ్యానమ్" అను సిద్ధాం
ొప్పున నేవేని ప్రయోగములకు వ్యాకరణ మన్వాఖ్యాన
తీరదుగదా. అట్టియెడల భారత రామాయణాది గ్రంథ
భాషకే పాణినీయ మన్వాఖ్యానమని యంగీకరించునపు
గ్రంథములలోని ప్రయోగముల నయ్యది యన్వాఖ్యానతి
ంగా సంబంధించి యుండవలయును. పాణినీయ మట్టి
ముల నెంతవఱకు సంబంధించి యున్నదో యరయుఁడు.

"తపశ్చరతి తపస్యతి. కథం-తపస్యతే లోకజిగీషుర గ్నేః"
పాత్త్వాద్భవిష్యతి" (మహాభాష్యము - 3 అధ్యా 1 పాద
ఆ. 15 సూత్రభాష్యము). ఇట్టి భాష్యఫక్కి నరయు
భారత రామాయణాది గ్రంథ ప్రయోగములు పాణి
మునకు ... ంగనపు డసాధువు లనుటకుఁ బర్యాయముగా
పములనుటయు నింకను ఋషులననోపని కవుల ప్రయోగ
సాధువులనుటయుఁ ('చింతా, పరిశో-౭౯ విషయ) పాణి
సంప్రదాయమే యున్నదని విశదముకాక మానదు.

చిత్రము:—పయిప్రయోగమును మఱికొన్ని ప్రయో

గములను జూపియే సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారు "అనియు (నిట్లు) రామాయణ భారత భాగవతాదులలోని ప్రయోగము లెన్నెన్నియో భాష్యమున సాధింపఁబడి యున్నవి. ఇట్టి ప్రయోగసాధనమే పాణినీయము కావ్యభాషానుశాసకమని వేనోళ్ళ నుద్ఘోషించుచున్నది" అని యిట్లు విపులముగా వ్రాసిరి. పైనిజూపిన భాష్యములోని భారత రామాయణాది ప్రయోగ సాధనపక్కి నరయునపుడు పాణినీయము భారత రామాయణాది ప్రయోగానుశాసకము కాదను విపరీత నిశ్చయము కల్గక మానదుగదా. ఇట్టి భాష్యపద్ధతి ననుసరించియే యర్వాచీన వ్యాఖ్యాతలు కావ్యములలోని యపాణినీయ ప్రయోగములను "కవీనాం నిరంకుశత్వాత్సాధుః" "మహాకవి ప్రయోగత్వాత్సోఢవ్యః" అను రీతిని సాధింపఁ గడంగిరి. ఇట్టివి శబ్దతా సాధనములా? అపశబ్దతా నిరూపణములా?

పయిసందర్భమునుబట్టి పాణినీయము కావ్యభాషను గాకున్నను భారత రామాయణాది ప్రాచీన గ్రాంథిక భాష నైన మూలముగాఁ జేసికొని రచింపఁబడినది కాదనియు 'శిష్టాశ్శబ్దేషు ప్రమాణమ్" (చింతా. పరిశో ౭౬) "యాజ్ఞే కర్మణి స నియమోఽన్యత్రానియమః" (చింతా. పరిశో. ౭౯- విషయ) మున్నగు భాష్య పంక్తులచొప్పున వైదిక కర్మాద్యుపయోగి శిష్ట వ్యవహార భాషనే మూలముగాఁ జేసికొని రచింపఁ బడినదనియుఁ జెప్పుటకు విప్రతిపత్తి యుండరాదుగదా.

ఇట్లు పాణినీయము వైదిక కర్మోపయోగి శిష్టవ్యవహార భాషామాత్ర మూలకమని గ్రహింపఁజాలక యర్వాచీన

వై యాకరణులవలెనే భ్రమించినవాఁడగుటంజేసియేగదా తంత్రవార్తికకారుఁడగు కుమారిలభట్టు పురాణేతిహాసాదులలోను-నాహితాగ్నుల నిత్యవ్యవహారభాషలోను పాణినీయము చొప్పున ననంతములగు నపశబ్దములు గలవని యీ క్రిందిరీతిని జర్చించి యేమేమో ప్రసంగించినవాఁడయ్యెను.

శ్లో. కల్పసూత్రస్మృతి గ్రంథ । మీమాంసాగృహ్య కారిణః । శిష్టా దృష్టాః ప్రయుంజానా । అపశబ్దానేకశః॥ ... అంతోనాస్త్యపశబ్దానా । మితిహాసపురాణయోః। ... సూత్రవార్తిక భాష్యేషు । దృశ్యతే చాపశబ్దనమ్..." "నచాహితాగ్నిసహస్రైక స్త్వదభిమతసాధుశబ్దైరేవ వ్యవహారమాణో దృశ్యతే" (౧-3-౮ సూత్రపుశాబరభాష్యపువ్యాఖ్య. తంత్రవార్తికము. ౨౫౯ పుట)

ఇంక మహాకావ్యకర్తలగు కాళిదాసాది మహాకవులు భ్రమ ప్రమాదాదులచే వందలకొలఁదిగ (అపాణినీయములగుటచే) నసాధు శబ్దములను బ్రయోగించి యుండిరని కాని యట్టి మహాకవిప్రయుక్తరూపాదులను మనము ప్రయోగింపరాదనికాని యెవ్వరును దలంపఁజాలరుగదా. అక్కారణమున "కవిప్రయోగములైనను నెంతవఱకు శాస్త్రానుగృహీతములగునో యంతవఱకే ప్రమాణభూతములగుననియు నెప్పుడయ్యవి శాస్త్రముననుసరించి యుండవో యప్పుడయ్యవి ప్రమాణములే కావనియు మనము నిర్ణయింపవచ్చునుగదా" అనెడి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారి సిద్ధాంతము నెవ్వరును సమ్మ

తింపఁజాలరుగదా. ఇట్టి స్థితిలో నట్టి మహాకావ్యములను సాక ల్యముగ మూలముఁ జేసికొని సంపూర్ణమగు మహాకావ్యభాషా స్వరూప ప్రదర్శనోపయోగి సంస్కృతవ్యాకరణపురచన మావ శ్యకమై యున్నదని నా చెప్పుటలో శాస్త్రులుగా రనుకొనినట్లు లోకమేల యాశ్చర్యపడవలసియున్నదో తెలియకున్నది. అపాణినీయ ప్రయోగము లనేకములకుఁ గాశికాకారుఁడును వామనుఁడు (కావ్యాలంకారసూత్రవృత్తిలో) మున్నగువారును నెందఱో సాధుత్వాంగీకారముతో సూత్రించి యుండలేదా? అట్టిపనియే పూర్ణముగ ననఁగా మఱింత విశాలముగా జరుపుట యావశ్యకమని మాత్రమేగదా నాచెప్పినమాట! ఈమాత్ర మున కంతగా వింతగొననేల?

ఇఁక వైదికకర్మాదులలో నుపయోగించు సంస్కృత భాష "ఏకొలఁదిగనో" యుండుననియు నద్దానికయి పాణి నీయమువంటి విపులవ్యాకరణము రచింపఁబడునా యనియు నేఁటికాలపు సంస్కృతభాషావ్యవహార వైరళ్యమునుబట్టి శంకిం చుటసరికాదు. అట్లు వైదిక కర్మోపయోగులు కాని దాశరథి దుర్యోధనాది శబ్దసాధన మేల చేయఁబడుననియును శంకింపఁ జనదు. అట్టి వైదికకర్మాదులలో ననేకులుకూడి యనేక విష యములందుఁ జేసెడి వివిధప్రసంగములలో నేయే శబ్దములు వాడఁబడెడివో శాస్త్రులుగా రెట్లు నిరూపింపఁజాలుదురు?

మఱియు శిష్టవ్యవహారస్థ శబ్దములను సాధించు సూత్ర ములచే ననంతములగు కృతకశబ్దము లవతరించుననియు నట్టివి యప్రయుక్తతా దోషదూషితములై యసాధువు లగుచున్న

వనియు భాష్యకారుఁ డప్రయుక్తతాంగీకారోపన్యాసముచే విశదీకరించి యప్రయుక్తతానిశ్చయము చేయునప్పుడు శబ్ద ప్రయోగవిషయ మెంతగలదో యంతటిని బరిశీలింపకయే యట్టి నిశ్చయముఁ జేయరాదని చెప్పెను. అట్టిసందర్భమునుబట్టి (చింతామణి విషయపరిశోధనము ౮౩ విషయము) శాస్త్రులుగారు "కావ్యేతిహాస పురాణాది సకల వాఙ్మయమునకును పాణినీయ మనుశాసకమేయని మహాభాష్యకర్త కంఠోక్తముగా మనకు విశదపఱచియున్నాఁడు" అని వ్రాయుట మిక్కిలి వింతగా నున్నది. ఆ భాష్యకర్తచూపిన శబ్దప్రయోగ విషయములో గావ్యము లన్న మాటయేలేదు.

ఇంక "పురాణభాష కావ్యభాష"... అనుకీతి నున్న యనేకభాషలకుఁ బ్రత్యేక వ్యాకరణమసంగత మనెడి శాస్త్రులు గారి యనుపపత్తికి, శిష్టలోకభాషకును వైదికభాషకును వేర్వే ఱుగ లక్షణరచనముచేసిన పాణిని మునియే సమాధానము చెప్పికొనవలసియుండును. ఆయాభాషలకుఁ బ్రత్యేకముగ లక్షణ ములను జూపవలసినంతటి భేదము కన్పట్టినప్పుడు వానికిఁ బ్రత్యేక వ్యాకరణములను రచించుటలో ననుపపత్తి యేమున్నది?

ఇఁక భాష్యకర్త పేర్కొన్న యితిహాస పురాణాదు లైనను పాణినీయమునకు మూలమైయున్న యెడల పాణినీయు లెట్లు వానిలోని ప్రయోగములను ఛాందసములనియు నసా ధువులనియు నిరసింపఁగల్గుదురు? వేయేల! వేదములోని ప్రయోగములు పాణినీయమునకు లొంగనప్పు డట్టి వానిని పాణినీయు లపశబ్దములనికాని ఛాందసములని కాని చెప్పక

వానికేఁ బరమప్రామాణ్యము నంగీకరించి యుండ లేదా? అట్లే శిష్టవ్యవహారములోని యేవేని శబ్దములు పాణినీయమునకు లొంగనపు డవి యథాప్రయుక్తముగ సాధువులనియే కదా "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను సూత్రముచేఁ బాణిని ముని యుపదేశించి యుండెను.

ఇంక వైదికకార్యోపయోగి శిష్టవ్యవహారేతరలోక సామాన్య వ్యవహారములోని శబ్దములవలెనే యితిహాస పురాణాదులలోని శబ్దములును సాకల్యముగాఁ బాణినీయసమ్మతములు కామింజేసి వానిలోని శబ్దములను గొన్నిటి నసాధువులనియు నార్షములనియు భాష్యకర్త నిరసించుటలో ననుపపత్తియుండ నేరదు. అట్లయినను నేఁటి బజారుభాషలోవలెనే వైదికకార్యోపయోగి శిష్టవ్యవహారేతర భాషయందును సుశబ్దము లనేకము లుండవచ్చునుగాన 'ఒకశబ్దము ప్రయుక్తమా? అప్రయుక్తమా? యనఁగాఁ గృతకమా?' యను వివాదము కల్గునపుడు పురాణేతిహాసాదుల భాషతోపాటు శిష్టజన నిత్యవ్యవహారస్థ భాషనుసైతము పరిశీలింపవలసియుండునని భాష్యకర్త చెప్పుట సంభవించెను. కావుననే "సప్తద్వీపా వసుమతీ త్రయో లోకాః......" అని యాతఁడు శబ్దప్రయోగవిషయమును జూపినవాఁ డయ్యెను. అంతమాత్రమున నాతఁ డచటఁ బేర్కొనిన వానికెల్ల నాతఁడు సాకల్యముగాఁ బ్రామాణ్యము నంగీకరించె నని చెప్పరాదుగదా.

ఇంకఁ బాణినీయము కృతకశబ్దములను సాధించునాయని సందేహింపనక్కఱలేదు. వ్యాకరణమాత్రమున కట్టియతిచార

ముండితీరును. ఆ విషయము పాఠక మహాశయుల హృదయ ములకు విశదపడుటకయి యిట దిఙ్మాత్రముగ నట్టికృతక శబ్ద వైఖరి నుదాహరించుచున్నాను.

"మేకాధీశో మేకాధీశా మేకాధీశా"

వ్యా. హే మేకా, మేకా మేకావంశః, తస్యాః అః భూష ణం తస్య సంబుద్ధి స్తథోక్త హే మేకావంశ భూషణ, హే మే మా లక్ష్మీః అస్యా స్తీతిమః మహారాజః - వ్యా. అర్శ ఆదిభ్యోఽ జితి అచ్. మస్యాపత్యం మిః. వ్యా. అతఇఞితిఇఞ్. తస్యసం బుద్ధిః, మే=మహారాజపుత్ర, హే మే, మా=మానం ప్రమాణం, ఛా అగ్రితః యస్యతస్య సంబుద్ధిః తథోక్త ప్రమాణపురస్సర-ని- మా స్త్రీ మానే మృతౌ వేళా మేధా శ్రీ మధ్యమాంతృషు. ఇకారః ఫణిరత్నాద్రివ్యాగ్రితో ఽర్థ గుణార్థ యోరితిచ రత్న మాలా......"(మేకాధీశాశబ్దార్థ శతకోటి 12 పుట.)

ఇట్లు విన్నవించు,

విశాఖ పట్టణము, 1-2-1939.

సుజన విధేయుడు,

వఝల చినసీతారామస్వామి శాస్త్రి.

# గురుదేవతా స్తుతి.

---

శ్లో. సుధియా పరిపూత మానసా
కలయేఽహం జగతః ప్రియంకరౌ
పితరౌ మమ వేంకటాంబికా
ముఖలింగేశ్వరజంపతీ హృది.

శ్లో. పితామహభ్రాతృసుతం స్వవిద్యా
గురుం చ చింతామణి సత్సమాఖ్యమ్
శ్రీవత్సగోత్రోద్ధరణ ప్రశస్తిం
నమామి నారాయణ సత్యవీంద్రమ్.

(మొదటిశ్లోకమున మాతాపితృపరముగాను పార్వతీపరమేశ్వరపరముగాను నర్థద్వయము నెన్నునది. రెండవశ్లోకమున గురువులగు నారాయణపండితులపక్షముగాను విష్ణుపక్షముగాను నర్థద్వయము నెన్ననగును. "భ్రాతృజాయామ్" అను కాళిదాస ప్రయోగముచేత భ్రాతృసుతశబ్దసమాసము సప్రమాణ మగుచున్నది.)

[ముద్రాపకులయొద్ద 'ఴ' అను లిపులు లేనందున నీ గ్రంథమున దానిచోట వాడుకచొప్పున తమిళము మున్నగు చోటులందు ళకారము కూర్పఁబడెను.]

---

# విషయసూచిక.



## I

విషయసంఖ్య.

విషయసంఖ్య

విషయసంఖ్య.

II

## III

విషయసంఖ్య.

## —అనుబంధము—



విషయసంఖ్య.



---

# అనుబంధము.



(౧౩౯) విచక్షణులారా,

ఆంధ్రశబ్దచింతామణి విషయపరిశోధనమునకుఁ బునర్ముద్రణావశ్యకతను గలిగించిన పాఠకమహాశయ లోకమునకు నేను గృతజ్ఞుఁడను. శ్రీమన్మద్రపురీ విశ్వవిద్యాలయాంధ్రపఠనీయ గ్రంథనిర్ణాయకసభవారును, నాంధ్రవిశ్వకళాపరిషదాంధ్రపఠనీయగ్రంథనిర్ణాయకసభవారును వరుసగా విద్వత్కక్ష్యల వారికిని నుభయభాషాప్రవీణ కక్ష్యలవారికిని నాంధ్రశబ్దచింతామణితోపాటుగ నీగ్రంథమును బఠనీయముగ నేర్పఱుచుచు నా భాషాసేవకుఁ బ్రోత్సాహ మొసంగుచున్నందులకై వారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను. మఱియు నేతద్గ్రంథము నీ క్రిందిరీతిని సంభావించిన శ్రీ మద్రపురీ విశ్వవిద్యాలయాంధ్రపఠనీయగ్రంథనిర్ణాయకసభవారి యాంధ్రభారతీసేవక ప్రోత్సాహప్రదానపురస్సర భాషావాఙ్మయపరిపోషణతత్పరతా సౌశీల్యమెంతయుఁ బ్రశంసనీయమగుచు మా మకీన కృతజ్ఞతాపూర్వక నమస్కారసహస్రార్పణాపాత్ర మగుచున్నది.

"Proceedings of the Meeting of the Board of Studies in Telugu, held on Tuesday the 26th, Wednesday the 27th and Thursday, the 28th July 1932, at the Senate House, Madras.

* * * * * *

"The Board desires to place on record its opinion that 'Chintamani Vishaya Parisodhna' by Mr. V. China Sitarama Sastrulu is a scholarly work of great merit, conceived on original lines not hitherto attempted and that the author has rendered great service to the Telugu Language by the publication of the same".

(౧౪౦) ఆంధ్రశబ్దచింతామణి విధానమున నడచి నిగూఢములై యుండిన యాంధ్రవ్యాకరణసిద్ధాంతరత్నము లనేకములు నా యీ గ్రంథమున నిక్షేపించునపు డివి పండిత విమర్శక పాఠక సమాజాదరణపాత్రములగు నా యని యుత్కంఠించువాఁడను. కాని యీ నా గ్రంథము ప్రచురింపఁబడిన (1931 క్రీ. శ.) వెనుకఁ బ్రచురింపఁబడిన (1932 క్రీ. శ.) యాంధ్రసాహిత్య పరిషత్తువారి బాలసరస్వతీయపీఠిక మున్నగువానిలో నట్టినాసిద్ధాంతములే స్వసిద్ధాంతములుగ ననుగ్రహింపఁబడుటంజేసి యట్టి నా యుత్కంఠ చాలవఱకుఁ దీరినదనవచ్చును.

కొందఱు విమర్శకసమాజము లీ గ్రంథమునందలి కొన్ని సిద్ధాంతముల విషయమునఁ గొన్ని యనుపపత్తులను జూపుచు లేఖాముఖమునను బత్రికాదిముఖమునను బరీక్షాప్రశ్నముల రూపమునను దమతమ యభిప్రాయములను వెల్లడించిరి. వానిలోఁ బెక్కిటికి నా యీ గ్రంథమునందె సముత్తరములు వెలయుచుండుటంజేసి యట్టివానికి మరలఁ బ్రత్యేకించి సమాధానములను వ్రాయ నేలయని యుపేక్షించుచు వచ్చితిని. కాని కొన్ని విషయములందలి సమాధానములు చాలవని తోఁచినపుడుమాత్రము సదుత్తరముల నిచ్చుటయుఁ గలదు. అట్టివిషయముల సారమును, మఱికొన్ని నూతనాంశములను నీ యనుబంధమునఁ బొందుపఱుచుచున్నాను.

(౧౪౧) (ప్రశ్నము) "ద్రుతము నకారవ్యంజనరూపమాత్రమె యగునపుడు 'జడిగొన్ కోర్కులు' మున్నగు ప్రయోగము లెట్లు సాధువులు కాఁగలవు ఆవయవిక నకారమును ద్రుతమె యందురుగదా."

(భావసంవత్సర చైత్ర వైశాఖ పరిషత్పత్రిక.)

(ఉత్తరము) "వినాద్వితీయః స్యా దస్మ దాత్మనోః స్వ స్తదోరపి ।
నో రన్యస్యాపి సర్వంస్యా, ద్బహుళం సత్ప్రయోగతః" అను నథర్వణ కారిక "నేను, తాను శబ్దములు ప్రథమాంతములయినను వానితుది 'ను' అనునది కుతిని జెంది నకారరూపమందినపు డయ్యది ద్రుతమగుచు ద్రుతకార్యముల

నొదవించును. ఇట్లే యితరమయిన శబ్దావయవ 'ను' వర్ణసంక్షేపన కారము
సైతము బాహుళికముగా ద్రుతకార్యముల నొదవించును" అని చెప్పుచున్నది
గాన నావయవిక నకారరూప ద్రుతము సరళాదేశాది ద్రుతకార్యముల నొద
వింపకున్నను క్షతిలేదు" (భావసంవత్సర శ్రావణ భాద్రపద పరిషత్పత్రిక.)

(౧౪౨) న్ను మ్ము లాగమములా? లేక యాదేశములా?

(చూడు. చింతామణివిషయపరిశోధనము. ౫౭-౫౮ విషయ.)

"దేశ్యా దస్మ ద్యుష్మ, చ్ఛబ్దా త్తు న్న జసో ర్న్న మూ వు రూపస్తః।
న్న మ్మూ ద్రాస్వ శ్చాదే, రమి శసి చాన్యతర లబ్చ యుక్తస్య"

(ఆంధ్రశబ్దచిం)

(ప్రశ్నము) "నా నీ శబ్దములకు ద్వితీయైకవచన బహువచన ప్రత్యయ
ములు పరములగునప్పుడు వరుసగా 'న్ను, మ్ము' అనునవి యాగమములగు" నని
యొకపక్షము. "నా నీ శబ్దముల ద్వితీయైకవచన బహువచనముల స్థానమున
(ఇచటి 'అమి శసి చ' అను సప్తములచోట విభక్తి విపరిణామాన్వయమున
షష్ఠి చెప్పఁబడుచున్నది) 'న్ను, మ్ము' అను నాదేశములు వరుసగ నగు"నని
యొకపక్షము. "ఈ రెండుపక్షములలోను నాగమము లనువారికి 'అమి, శసి'
అని సప్తమీవిభక్తి యుండుటయే యవి యాదేశములు కావనుటలో ముఖ్యాధా
రము—'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' అను పాణినిసూత్రము వీరివాదమును
దృఢపఱుచుచున్నది. కాని సంస్కృత వ్యాకరణమున నిట్టి విభక్తిభేదమున
నన్వయము కానంబడుచున్నది. చూడుఁడు. పాణినీయసూత్రము:—

'సది రప్రతేః' (౮-3-౬౬).

ఇంక నిది చింతామణి ప్రణాళికకు విరుద్ధమనుటయుఁ గుదురదు.
'స్వంతా న్నామ్నః కుక్ నో ర్బహువచనే' అనుచోఁ బంచమికి షష్ఠ్యర్థము
చెప్పక యన్వయము కుదురదు. . . . . . . ఆగమపక్షమున నాదేశపక్షముకంటెఁ
గ్లిష్టకల్పనమును నెక్కుడు ప్రక్రియయు నుండుట విశదమే."

(శ్రీముఖసంవత్సర మార్గశిర పుష్య పరిషత్పత్రిక).

(౧౪౩) (ఉత్తరము) న్ను, మ్ము, లాగమములె—

"ఈ విభక్తి విపరిణామ సమన్వయము నూత్నము కాదు. అహోబలపతి చూపినదే. విభక్తివిపరిణామాన్వయమును నిర్హేతుకముగ నంగీకరించుట కేవలము నసంగతము. పాణినీయవ్యాఖ్యాతలద్దానిని జూపినమాట నిజమే అప్రస్తుతమని యుపేక్షించవచ్చుగాని యా పాణినీయ సూత్రముల సమన్వయమునందును విభక్తివిపరిణామాన్వయ మక్కఱలేకయే కుదురుచుండును. ఏది యెట్లయినను మూలగ్రంథకర్తృభిప్రేతములని విశ్వసింపరాని యట్టి వ్యాఖ్యాతల మార్గముల నెల్లఁ జింతామణి సమన్వయవిషయమున నుపయోగించుట యుక్తము కాదు. చింతామణిలో నట్టి సమన్వయ ముండక తీరదని చెప్పవలసిన స్థల మొక్కటి యైన లేదు.

'స్వన్తాన్నామ్న' ఇత్యాదిసూత్రమున కహోబలపతి వ్యాఖ్యచేయుటలో నవిమర్శితముగ నిట్టి సమన్వయము నంగీకరించెను. అద్దానినే వీ రీవిషయమునఁ బ్రమాణముగఁ జూపుచున్నారు.

'స్వన్తాన్నామ్నః కుజ్ నో బహువచనే' (ఆంధ్రశబ్దచింతామణి)
"స్వన్తాన్నామ్నో నోః కుజాదేశః స్యాత్ బహువచనే పరే. స్వన్తాదిత్యత్ర సదిరప్రతేరిత్యాదావివ విభక్తేర్వ్యత్యయః" (అహోబలపతి).

పయిసూత్రమున నట్టి విభక్తివిపరిణామాన్వయము నంగీకరింప నక్కఱ లేదు. "స్వన్తాన్నామ్నః పరతః బహువచనే స్థితే సతి నోః కుజాదేశః స్యాత్" "స్వంతనామముకంటెఁ బరముగ బహువచనముండునపుడు నామముతుదిను వర్ణముచోట కుజాదేశమగును" అనురీతి నిచట మిక్కిలి సరళమగు సమన్వయమె వెలయుచున్నది. ఇదె చింతామణి కర్తృస్వరసమని "లుగాద్యద్రుతప్రకృతికాత్పరతః సరళే స్థిరే చ నస్య స్యాత్"అను చింతామణిసంధిసూత్రముద్బోధించుచున్నది. పైని జూపిన యన్వయమే యీ సంధిసూత్రమునఁ గంఠోక్తముగా గ్రంథకర్తచేఁ జేర్కొనఁబడినదిగదా. ఇట్లు మిక్కిలి సరళమును జింతామణి స్వరసమును నగు సమన్వయము కుదురుచుండఁగాఁ జింతామణిలో మఱెచ్చటను నంగీకరింపవలసిన ప్రసక్తిలేని గ్రంథకృదభిప్రేత

మని యంగీకరింపరాని యసహజమగు నీ విభక్తివిపరిణామాన్వయము నంగీకరించుట యుక్తము కాదుగదా. ఇంక నీపక్షమునందలి క్లిష్టకల్పనము శంకాస్పదము గాదు. శబ్దములకు లేని యర్థములను జెప్పి సమన్వయించుటకన్నఁ గ్లిష్టకల్పనములు శ్రేష్ఠతరములు గదా."

(శ్రీముఖ సంవత్సర మాఘఫాల్గున పరిషత్పత్రిక.)

(౧౪౪) అనాదిష్ఠు విభక్తిష్వాత్వోవేతి సూత్రార్థవిమర్శనసందర్భమున నా వ్రాసిన ౧౬, ౧౭, ౧౮, ౧౯ విషయముల సిద్ధాంతములందుఁ గొందఱకు భిన్నాభిప్రాయము కలిగియుండెను. తత్సూత్రసమన్వయసందర్భమునందలి "నన్నేలు-మమ్మేలు" అను సంధులవిషయమునందును "నన్నునున్, మమ్మున్" అను రూపముల సాధించు ప్రక్రియయందును క్లిష్టసమన్వయమును సారళ్య లోపమును గొంత సంభవించినమాట నిజమే. అట్లయినను చింతామణిగ్రంథమును సాకల్యముగ సమన్వయింపవలసివచ్చినపుడు పూర్వోత్తరసందర్భశుద్ధియుఁ జింతామణిసిద్ధాంతస్థాపనమును నత్యావశ్యకములగుటచేత నంతమాత్రపు క్లిష్టత గ్రంథకృదభిప్రేతమగుటచే నంగీకరించుట యొక్క కొఱంతకానేరదని నా యభిప్రాయము. బాలవ్యాకరణకర్తగా రుదాహరించినట్లు 'నన్నును, మమ్మును' మున్నగు రూపములనే పూర్ణరూపములనుగా సాధించుటకుఁ జింతామణిప్రక్రియ యంగీకరింపదు. పూర్వపక్షులు కోరునట్లు 'న్ను, మ్ము' లను ద్వితీయాప్రత్యయముల కాదేశములనుగా నహోబలపతి సమన్వయము చొప్పునఁ నంగీకరించునపుడు తిఙ్మధ్యశాస్త్రము చొప్పున "నన్నున్, మమ్మున్" అను రూపములె యేర్పడును గాని "నన్నును, మమ్మును" మున్నగు రూపము లేర్పడవు. అంతత్త్వవిధాయకశాస్త్ర మెచ్చటను లేదు. ద్రుతమునకు 'ను స్వరూప మున్నదను విషయము చింతామణిసిద్ధాంతమె కాదు. ఈ పక్షమున "నన్నను గౌఁగిలించుకొని......" (భార. అరణ్య. ౩ఆ. ౧౦౭) మున్నగు నన్నయప్రయోగములను జింతామణిసాధ్యములనుగాఁ జేయఁజాలము. మఱియు వెనుక నుదాహరించినరీతిని 'న్ను, మ్ము' లాగమము లను సమన్వయమె చింతా

మణి స్వరసముగ నున్నదిగాని యాదేశము లను సమన్వయము చింతామణి స్వరసమై యుండలేదుగదా. ఇఁకఁ బైసందర్భమునుబట్టి నేను వివరించినరీతిని 'నన్నేలు, మమ్మేలు' మున్నగువాని సంధిప్రక్రియ నంగీకరించిన నంగీకరింపవలె. లేదా యిట్టి యాచ్ఛికవిషయములు చింతామణిదృష్టిలోఁ లేకపోవచ్చునని చెప్పినఁ జెప్పవలెను. ఇదియె యీ గ్రంథమునందలి '౯౭' విషయమున నేను విశదపఱచియున్నాను.

(౧౮౫౯) పయివిషయమునఁ గొందఱువిమర్శకు లీక్రిందిరీతిని ప్రశ్నించుచు రాఁగా సమాధానములను వ్రాయుచు వచ్చితిని. ప్ర. "బాలసరస్వతి మొదలుగ బాలవ్యాకరణకర్తవఱకు నున్న చింతామణి వ్యాఖ్యాతలు వివరణకర్తలు నను నెల్లరును "న్నుమ్ము"ల నాదేశములుగనే వ్రాసిరే? అట్టిదానిని మార్పనగునా?" (ఉ) "గ్రంథమును సాకల్యముగ సమన్వయించుటలో నావశ్యకమగునపుడు మార్పుచేయుట తప్పా? అందఱును నేకరీతిని వ్రాసియున్నా రనువిషయమును నేను మాత్రము ౯౬ విషయమున వ్రాయలేదా?

(ప్ర) "ప్రాచీనవ్యాఖ్యాతలమార్గములను ద్రోసిపుచ్చుటకు వారిమతమున దోషమేమి? అందువలన మీపక్షమునఁ గల్గిన లాభమేమి?"

(ఉ) "చింతామణిశ్లోకములకు లేనియర్థములను జెప్పుటకన్నఁ బ్రాచీనవ్యాఖ్యలపై నేమిదోషమును జూపవలయును? చింతామణిమతమున నెంతమాత్రమును లేని ద్రుత'ను' స్వరూపసమన్వయమును నిరాకరించుకొనుటకన్న నాపక్షమున లాభమేమి కావలయును?......"

(ప్ర) "మీసమన్వయమున సారళ్యము చాలదు"

(ఉ) "ద్రుతము'ను' స్వరూపమన్న బాలవ్యాకరణాదులపక్షమున 'నన్నున + ఏలు' అనుస్వరపరకస్థలమున ద్రుతస్వరలోప మెట్లుఘటిల్లును? అట్టియెడల 'నన్నున్ + ఏలు' అనెడి యుదాహరణస్థల మెట్లులభించును? ఇంక నిచట 'ఉ'కారసంధిచేయనగునందు లేని సంధ్యభావపక్షములోని రూప మెట్లుండును? మఱియు వీరిపక్షమున 'నన్నేలు' అనురూపము దుర్లభమేగదా.

ఇంతియగాక 'న్ను, మ్ము' లాదేశములను వీరిపక్షమున 'నన్నును, మమ్మును' అనుద్రుతప్రకృతికరూపసిద్ధియెట్లు? బాలవ్యాకరణకర్త "తృతీయాదులకు నుగాగమంబగు" అనిగదా సూత్రించెను. ఇట్టి పూర్వవ్యాఖ్యలకుంగల యైకకంఠ్యమును సారళ్యమును నేరీతినున్నవో విమర్శకులె పరిశీలింతురుగాక !......"

(ప్ర) "న్ను, మ్ములలో నొకటివిభక్తికాదనుచు నొకటివిభక్తియని చెప్పుట సరియా?" (ఉ) "రెండును నాగమములేయని నాయాశయము. 'మ్ము' అనునది విభక్తియని నేను వ్రాయలేదు. 'మ్ము' అనుదానిపై నిలిచిన 'శస్' ప్రత్యయము లోపించుటచేత దాని తుది 'ఉ'కారమునకు విభక్తిత్వమును గల్పింపవలయుననిమాత్రము వ్రాసితిని. అట్లు కల్పించుకొని 'అవాదిషు విభక్తిష్విత్యాది' సూత్రమున 'మమేమ్మలు' మున్నగు నలంతియాచ్ఛికోదాహరణములను సంగ్రహించికొని పూర్వపక్షుల మతములలో నెంతమాత్రమును గుదురుపడని "ప్రాంశుపయోదనీలతను భాసితు నుజ్జ్వల..." మున్నగు నన్నయ తత్సమసంధిప్రయోగశతములను నత్యంతసరళమార్గమున సాధించుకొనుట యెంతయును గర్తవ్యముగదా.

(ప్ర) "నపదాన్యస్యేత్యాదిసూత్రము "కృత్వాప్రభృతులు తెలుంగున నుండ నేరవని తెలుపుటకు నుపదేశింపఁబడియుండఁగా నద్దాని నీయొక్కస్థలమున సంస్కృతవిభక్తిలోపమునకు సాధకమునుగా నుపయోగింపఁజేసికొనుట సరియా?" (ఉ) "ఆయొక్కటనె యున నేల? 'రక్షించి, రక్షింపక, రక్షింపన్' మున్నగు వేలకొలఁదిశబ్దములపైనున్న సు ప్రత్యయలోపవిషయమున నపదానీత్యాదిసూత్రముతప్ప నొండెద్దియేని గతిగలదా? అందు 'రక్షించి' మున్నగునవి తత్సమములగుటంజేసి త్రిసమములయునఁగా నేరవుగాన వానికి 'అనుత్తా మిత్యాదిసూత్రసిద్ధ సు లోపము రా నేరదుగదా. విభక్త్యంతములుకాకయె ప్రాతిపదికములనఁదగిన ధాతుజరూపములు ప్రయోగార్హములు కానేరవుగదా."

(౧౮౬) ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ముద్రించిన బాలసరస్వతీయసహితాంధ్రశబ్దచింతామణియందలి బాలసరస్వతీయపీఠికను వ్రాసిన బ్రహ్మశ్రీ

చర్ల నారాయణశాస్త్రిగా రాంధ్రశబ్దచింతామణికి వికృతివివేకము శేషగ్రంథ
మని యప్పటప్పట నంగీకరించియు (మాఘుఁడు "పంచవర్గాదయో వర్ణాః"
అను నథర్వణశ్లోకములు 'బాలేందుపరిధి' అను శ్లోకములకు శేషపూరకములు" బాల
సరస్వతీయపీఠిక. 3 పుట) నీక్రిందిరీతిని శంకించియున్నారు. "అథర్వణకారికా
వళి... పీఠికలో బ్రహ్మశ్రీ వఝల చినసీతారామశాస్త్రిగారు ఇది (అకర్మ
కేషు తు స్వార్థేంచుకో లోపో విధీయతే' అనునది) యథర్వణ కారిక కానేరదని
యు నహోబలపండితులు వ్రాసిన వాక్యమనియు వ్రాసియున్నారు... కాని
పైబాలసరస్వతీయములోఁ గూడ నీకారిక యుండుటంబట్టి సీతారామశాస్త్రి
గారియూహ కాధారమేమో తెలియకున్నది" (బాలసరస్వతీయపీఠిక ౧౬ పుట)

"అథర్వణకారికావళీగ్రంథము బాలసరస్వత్యప్పకవ్యాదులకు
దొరకలేదనియుఁ బండితపరంపరాయాతముగా వారు తమగ్రంథములం
గొన్ని కారికల నుదాహరించుచు వచ్చిరనియు నక్కారణమున వారికేదేని
యితరకృతవిశేషకారిక దొరకినను నథర్వణకారిక యేమోయనుభ్రాంతి కలిగి
వారు తమగ్రంథములలో నుదాహరించుట సంభవింపవచ్చుననియుఁ జింతా
మణి వికృతివివేకములకుఁ గలసంబంధమును వారు గ్రహించియుండమింజేసి
వారు కొన్ని కారికల నాథర్వణములని భ్రమించినంతమాత్రమున వాని నాథర్వ
ణములని యంగీకరింపనక్కఱలేదనియు" నాయీగ్రంథమున ౧౬ విషయమున
సోదాహరణముగా విశదీకరించియే యున్నాను. కాఁగా బాలసరస్వతీయము
లో నున్నంతమాత్రమున నిది యథర్వణకారికయని నిశ్చయింపవలసినయావశ్య
కత లేదు. 'రంజతి ఘట్యాదీనాం బిందోశ్చస్యాపి లోపో భవతః. న తు ణౌ;
భవేచ్చ లోపో ణ్యర్థే యో వర్తతే పరే తస్మిన్' అని యిట్లు చింతామణి
యందే స్వార్థేంచుక్కువచ్చునప్పుడు రంజాదులు 'రంజిల్లు' మున్నగురీతి నకర్మక
ములుగా నేర్పడుననియు వానిపైఁ బ్రేరణేంచుక్కు నిల్చునపుడట్టి 'ఇల్ల' అను
నది లోపింపఁగా 'రంజించు' మున్నగు సకర్మకధాతువు లేర్పడుననియుఁ జెప్పఁ
బడియుండుటంజేసి యీయర్థమునే చింతామణి శేషగ్రంథకర్తయగు నథర్వ

ణుఁడు చెప్పియుండెఁ డనుతలంపున నయ్యది యథర్వణకారిక కాదని నేను వ్రాసియున్నాను. ఈపద్ధతినిబట్టి "అకర్మేషు..." అను నీకారికయేగాక పరిషత్తువారపరిశీలితముగా ముద్రించిన యాబాలసరస్వతీయటీకలో నథర్వణ వచనముగా నుదాహరించిన "కేషాంచిదపి ధాతూనాం మిట్త్వ స్వార్థే ప్రకీర్త్యతే" అను కారికయు నాథర్వణికము కాదని దృఢముగాఁ జెప్పవచ్చును.

(౧౪౭) వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు ముద్రించిన బాలసరస్వతీయటీకలోఁ బైనుదాహరించిన విరుద్ధకారిక లగపడవు. వావిళ్ల వారి బాలసరస్వతీయ మనఁగాఁ బీఠికాంతమున నారాయణశాస్త్రులుగారు వర్ణించిన యాంధ్రశబ్దచింతామణి టీక కాదు. వావిళ్లవారును బరిషత్తువారు ముద్రించిన 1932 (క్రీ. శ)సంవత్సరమునందే యొకబాలసరస్వతీయటీకాసహితముగు నాంధ్రశబ్దచింతామణిని ముద్రించిరి. అద్దానికి నేను విపులమగు పీఠికను వ్రాసియున్నాను. అయ్యది యీపరిషత్తువారి ముద్రణముకన్నఁ జాలశుద్ధముగానున్నది. పరిషత్తువారి ముద్రణములోఁ బయిరీతిని విరుద్ధకారిక లుండుటయేగాక యింకను దోషములు పెక్కుకాన్పించుచున్నవి. మచ్చునకొంతు రెండు తావులు చూపెదను.

(౧౪౮ I.) "అనుబంధప్రాగ్ఘనయో" రిత్యాదిసూత్రపువ్యాఖ్యలో ౪౬-౪౭-౪౮-౪౯ పుటలలోను దర్వాతి మఱికొన్ని పుటలలోను "ఆకంపించుచున్నాఁడు" మున్నగు శతాధికస్థలములందు "ఊన్నా"నుబంధపరకత్వమున 'చ'కారమునకు 'పత్వము' చేయకయే యుదాహరింపఁబడెను. పత్వవిధాయక శాస్త్రమునకు బాలసరస్వతిచేసిన వ్యాఖ్యచొప్పున నచ్చటు "పత్వము" నిత్యముగ వచ్చితీరవలయును. అట్టిస్థితిలో బాలసరస్వతీటీకలోఁ దద్విరుద్ధముగా నుదాహరించుట కేవలము నసంగతముకదా. వావిళ్లవారిముద్రణమున నావ్రాసిన పీఠికలో సవిమర్శముగ సిద్ధాంతీకరింపఁబడిన చొప్పున నెవ్వరుముద్రించినదియు బాలసరస్వతి లిఖించిన మాతృకకు సరియైనది కాదు. పరిషత్తువారు సైతము మాతృకలోనున్నరీతిని యథాస్థితముగా ముద్రించితిమని చెప్పసాహ

సింపఁజాలరుగదా. మాతృకను సవరించి ముద్రించునపుడిట్టి గ్రంథకర్తృహృదయ విరుద్ధములగు నుదాహృతము లుండరాదుగదా. వావిళ్లవారిముద్రణమున నిట్టి తప్పులు లేవు.

(౧౪౮ II.) "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అనుసంధిసూత్రవ్యాఖ్యలో నొకచిత్రమగుతప్పు పరిషత్తువారి ముద్రణమునఁ బడియున్నది. "ఉత్తమపురుషకైన, గొలిచితినంబను, విడిచితిమన్యులను, అన్నది కిమాదిగనుక క్రియాగ్రహణమున నంటులేదు. నిత్యం అన్నాఁడు గనుక క్రియాగ్రహణ మనిత్యము" (పరిషత్తువారి ముద్రణము ౧౪ పుట) "ఉత్తమపురుషమునందైనఁ గొలిచితిఁ౦బను, విడిచితి మన్యులను, గెలిచితి మగలను, ఇవి కిమాదులలోనివి కనుకఁ బ్రాయోగ్రహణమున నంతటును సంధిలేదు" (వావిళ్లవారిముద్రణము ౧౬-౧౭ పుట)

పయిపాఠములలోఁ బరిషత్తువారి ముద్రణమునఁ దప్పుపడినందున నర్థమే లేదు. వావిళ్లవారి ముద్రణమునుబట్టి యుత్తమపురుషశబ్దములు కిమాదిగణములోని వగుటచేత "ప్రాయస్తుస్యాత్ కిమాదికే స్వితః" అనుసూత్రములోని ప్రాయోగ్రహణమున సార్వత్రిక నిత్యసంధి లేదయ్యెననియు "గొలిచితిఁ౦బను" అనుచో సంధిగాలేదనియుఁ దక్కినచోట్ల సంధికలిగెననియు సుసంగతముగా నర్థము వెలయుచున్నది. ప్రాయోగ్రహణమన్నచో "క్రియాగ్రహణ"మనియు "అంతటు" అన్నచో "అంటు" అనియు బరిషత్తువారి ముద్రణమునఁ దప్పులు పడినవి.

పయినివ్రాసిన తప్పులు పీఠికాకర్తగారి నెంతో శ్రమపెట్టినవి. వారు పైతప్పులను బైరీతిని దిద్దుకొనలేదు. ఇంక యథాస్థితముగనె పాఠముననంగీకరించి 'స్థితస్య గతి శ్చింతనీయా" అను పద్ధతిని వారి సాహిత్యబలిమిచే నేదియో యర్థముచెప్పి సరిపెట్ట యత్నించిరి (చూడుఁడు పరిషత్తువారి ముద్రణము, బాలసరస్వతీయపీఠిక ౧౪ పుట.)

(౧౪౯) పై బాలసరస్వతీయపీఠికయందే పీఠికాకర్తగారు ద్రుతసంశ్లేషమును గురించి చర్చించుచు "ఇట నాధునికులు కొందఱు 'ద్రుతము పూర్వా

చ్చునత్తియుండుట సంశ్లేషమనని చెప్పుచున్నారు," అని యారంభించి నా యీ గ్రంథమునందలి ద్రుతసంశ్లేషస్వరూపమును నిరసించి యున్నారు. కాని యావిషయమునఁ గల నిజమును జర్వితచర్వణముగా సమాధాన మీయఁదలంప లేదు. అందులకుఁ బూర్ణమగు సమాధాన మీ గ్రంథమునందలి మూఁడవభాగ మందు—అందును ముఖ్యముగ ౧౩౧ విషయమునందు—వెలయుచుండు టంజేసి పాఠకమహాశయులతోపాటుగ శ్రీశాస్త్రులవారును సద్భావనిని దయతో సావధానముగఁ జిత్తగింతురుగాక. నన్నయాభిమతమున ద్రుతము పొల్లు నకార మె యగుటచే నీతినిమతమునందలి ద్రుతస్వత్వము నకారవ్యంజనరూపమె యనియు నథర్వణుఁడు చెప్పిన స్వత్వమును నిట్టిదియ యనియు గ్రహించి యున్నచో నీ విషయమున నింతగా వ్రాసియుండరు.

(౧౯౦) ౧౯౩౬ (క్రీ. శ.) సంవత్సరమున నాంధ్రవిశ్వకళాపరిషత్తు వారు చేయించిన యుభయభాషాప్రవీణ పరీక్షయందలి (A. final) యొక ప్రశ్నపత్రములో నీ క్రిందిరీతి నొక ప్రశ్న మున్నది.

"I. b. 1. చింతామణిలోని—దూర్చి—పోలదు—కలన—యొక్క—విభక్తులతోడి శబ్దరూపములు నన్నయభారతమున లేవు.

2. 'విక్రుతిశబ్దాః ప్రకృతి స్సాంస్కృతికానాం భవన్తి గ స డ ద వాః' అను చింతామణి నిషేధమునకు విరుద్ధముగ నన్నయాదుల ముందును వెనుకను గూడ—ఇందు ప్రత్యక్షమై—ఎంతగుణములు—ఇత్యాది ప్రయోగములు కనఁబడుచున్నవి.

3 'విక్రుతౌ క్వచిత్స్యా ల్లోపో మా సిద్ధ శ్చేత ఆదుపస్య భవేత్' అను సూత్రమునకు నన్నయరచనలో నుదాహరణము కనరాదు.

4. నన్నయకంటెను భాషావేత్త 'ఇందు' సప్తమీవిభక్తియనఁడు. చింతామణి నన్నయకృతము కాదగు(ను?) ట కీ హేతువులనుగూడఁ జేర్చుకొని నన్నయభట్టారకుఁడు భారత భాగమునకు ముందే యాంధ్రశబ్ద చింతామణి రచించెనన్న పరిశోధన వాదము విమర్శించి మీ యభిప్రాయము

తెల్పునది." (ఇంకఁ బరీక్షకు లాలోచించి వ్రాయవలసిన దే మున్నదో తెలి
యరాకున్నది.)

(౧౫.౧) పరం: ప్రశ్నమునుబట్టి చింతామణి నన్నయ కర్తృకము
కాదనుటకుఁ బయి నాలుగు విషయములును బలమైన హేతువులని పరీక్ష
కులు తలంచినట్లు విశదపడుచున్నది. భాషాస్వరూపమును నిరూపించుట
వ్యాకరణకర్తపని. కథావస్తువును రసోచితరీతిని నిర్వహించుట కావ్యకర్తపని.
కాఁగా వ్యాకరణకర్త కావ్యమును వ్రాయునపు డతని వ్యాకరణములోని
సూత్రములకెల్ల నతని కావ్యములో నుదాహరణములుండి తీరవలయు ననునిర్బం
ధ మెంతమాత్రమును నుండ నేరదు. (భట్టివలె నుదాహరణార్థముగఁ గావ్యమును
రచించుటకుఁ బూనినపుడు తప్ప). ఇంతయేల? ఆంధ్రభాషాభూషణములోని
వ్యాకరణవిషయములకెల్లఁ దత్కర్తయగు కేతన కావ్యములలోఁ బ్రయోగము
లను జూపఁగలరా? అట్లే కావ్యాలంకారచూడామణి వ్యాకరణభాగమునఁ
జెప్పఁబడిన సూత్రములకెల్ల నాగ్రంథములో నుదాహృతులు చూపఁగలరా?
ఇట్లే యధునాతనుల వ్యాకరణవిషయములకు వారివారి ప్రబంధములందు సా
కల్యముగా నుదాహృతులను జూపఁగలరా? సాధారణముగఁ బ్రాచీనవ్యాకర
ణకర్తలెల్లఁ జెప్పిన "యొక్క"విభక్తిని వారిలో నొక్కరైనఁ దమప్రబంధము
నఁ బ్రయోగించిరా? ఒక్క చింతామణి విషయమునమాత్రమె యిట్లు శంకిం
చుట యర్హమా?

పరీక్షకులెంచిన యావిభక్తిప్రత్యయముల నొక్క చింతామణియె చెప్ప
లేదు. ప్రాచీనాంధ్రవైయాకరణులెల్లఁ జెప్పియున్నారు. "ప్రథమావిభక్తికి
గ్రమంబున ముకారంబును డుకారంబును ద్వితీయకు ను కార ని కారంబులును,
తృతీయకుఁ జేత, తోడ యనునవియును, చతుర్థికిం గై, కొఱకు ననునవియుఁ, బంచ
మికి వలన, పట్టి, యుండి, కంటె యనునవియును షష్ఠికిం గి కు కారంబులును
యొక్క లోపల యను పదములును సప్తమికి నందు న యనుపదంబులు నయ్యె"
(కావ్యాలంకారచూడామణి—౯, ఉల్లాసము, 97 వచనము, 58 పుట).

(౧౫.౨) ఇంతకును నన్నయ భారతభాగమందుసైతము పరీక్షకు లను
కొన్నట్లు పైవిభక్తులెల్ల నుజ్జగింపఁబడలేదు.

సీ. పాండుకుమారులు పాండుభూపతి పరో
క్షంబున హాస్తిపురంబునందు
ధృతరాష్ట్రునొద్దఁ దత్సుతులతో నొక్కటఁ
బెరుగుచు భూసురవరులవలన
వేదంబులును ధనుర్వేదాదివిద్యలుఁ
గఱచుచు......... (భార. ఆదిపర్వము, ౩ఆ. ౧౨౨ప).

"ఆఖ్యాతోపయోగే" (౧-౪-౨౯) "నియమపూర్వక విద్యాస్వీకారే వక్తా ప్రాక్సంజ్ఞః స్యాత్. ఉపాధ్యాయాదధీతే" (సిద్ధాంతకౌముది) అనెడి పాణినీయోక్త కారకసూత్రము చొప్పునఁ బై నన్నయపద్యమునందలి 'వలన' పంచమీవిభక్తియే యనుట కెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరుగదా.

చ. నరవరుఁడైన భీమువలనం బ్రభవించె హిడింబకున్ సుతుం
డురుతరభీమరూపుఁడు ఘటోత్కచనాముఁడు.........
(భార. ఆదిపర్వము. ౬ఆ. ౨౩౫ప.)

"జనికర్తుః ప్రకృతిః" (౧-౪-౩౦)" జాయమానస్య హేతు రపాదానం స్యాత్ — బ్రహ్మణః ప్రజాః ప్రజాయంతే" (సిద్ధాంతకౌముది) అను చొప్పునఁ బై నన్నయపద్యములోని మూఁడ్వ గాని యతిస్థానగతము గు "వలన్" అనునది పంచమీవిభక్తియే యనుట కించుకేని సందియము లేదుగదా. ఇట్లె యితరములు లేవన్నవిషయమును నిలువనేరదు. పైనివ్రాసినరీతివి గొన్ని లేకున్నను క్షతియు లేదు.

(౧౫౩) "నన్నయవంటి భాషావేత్త 'ఇందు' సప్తమీవిభక్తి యనఁడు" అని వేఱొక యనుపపత్తిని జూపిరి. 'ఇందు' అనునది సప్తమీవిభక్తి ప్రత్యయము కాదనియు నది ప్రకృతులపై 'అందు' వర్ణకమువలె నిల్చునది కాదనియుఁ జెప్పుటకు నన్నపార్యునివంటి పాండిత్యము కావలయునా? తుదికి నాలవతరగతి విద్యార్థియు నట్లు చెప్పఁడనుటలో సందేహమేమున్నది? ఇట్టి స్థితిలో నెవ్వఁడైనఁ జింతామణిని రచించెనందురా? లేక యది స్వయంవ్యక్త

మందురా? ఇంతకును 'ఇందు' అనునది ప్రాతిపదికముపై నిల్చునని నన్నయ చెప్పియుండలేదు. "అం ద్వింద్వు నా స్తు స ప్తమీ" అని చెప్పి "అందు జేపః సవిధ వర్తినా మిందు" (ఆంధ్రశబ్దచింతామణి-తత్సమపరిచ్ఛేదము) అనియిట్లు సప్తమీవిభక్తిప్రత్యయము 'అందు' అనునదే యనియు 'సవిధవర్తి' విషయమున సప్తమ్యంతమును వాడవలసివచ్చినపుడు 'ఇందు' శబ్దమును వాడవలెననియు స్పష్టముగాఁ జెప్పియే యున్నాఁడు. 'అందు, ఇందు' అను రెండును జి, ఓస్, సుప్, అనెడి జిప్ప్రిత్యాహారరూప సప్తమీవిభక్తికే యేకరీతి నాదేశములుగఁ జెప్పఁ దలంచినచో గ్రంథకర్త 'జేసః కయుకో౽అమా' అని చెప్పినట్లు యిచటను నారెండిటిని జోడించి యేకరీతిని జెప్పక పైరీతిని విభజించియుండఁడుగదా. ఇంక నాంధ్రవైయాకరణు లెవ్వరును జెప్పని యీమార్గమున నన్నయభట్టు చెప్పియుండుట నరయఁగా నీవిషయము చింతామణి ప్రాథమికతను దృఢముగా విశదీకరించుచున్నదని చెప్పవచ్చును. నన్నయకు ముందటి కాలమున "ఇందు" అనునది కళగా వాడఁబడుచుండెడిదని యుద్ధమల్ల బెజవాడశాసనములోని "యిందుప్రత్యక్షు" అను చోటనుండలి వకారాదేశము విశదీకరింపఁజాలియున్నది. కాన నయ్యది కళగాదనియు సప్తమియగుటచేత ద్రుతప్రకృతికమే యనియు స్పష్టపడుచుటకయి నన్నయభట్టారకుఁ డద్దానిని సప్తమీ సందర్భమునఁ జేర్చియుండవచ్చును. కాన నిదియొక యనుపపత్తి కానేరదు.

(౧౯౪) ఇఁక "నవికృతిశబ్దాత్పరత, స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అను సూత్రమునకు బాలసరస్వత్యహోబలపండితాదులు చేసిన వ్యాఖ్యానము సరియై యుండలేదని యీవటికే నేను "ఆంధ్రపత్రిక యువసంవత్సరాది సంచిక"లో నొక వ్యాసమును ప్రచురించియున్నాను. అద్దాని సారము నిటఁ జూపుచున్నాను.

నన్నయభట్టారకునికిఁ బూర్వకాలమందలివగు పండరంగుని యద్దంకిశాసనమును, యుద్ధమల్లుని బెజవాడశాసనమును బరిశీలింపఁగాఁ దెలుఁగు ప్రథమావిభక్తి ప్రత్యయములమీఁదను లుప్తప్రథమావిభక్తిప్రత్యయకములగు నాచ్ఛిక

శబ్దములమీఁదను మాత్ర మీ గ స డ ద వా దేశము నిత్యముగావచ్చుట నియ
తమై యుండెడిదని విశదమగుచున్నది.

"పట్టంబుఁగట్టిన; పట్టంబుఁగట్టించి; కొట్టంబుల్వణ్డు గొణి; బయల్సేసి;
దుర్గంబుఁగడు" (అద్దంకిశాసనము. శాసనపద్యమంజరి ౧ శాసనము).

"రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు; బ్రహ్మంబుగొని; పాపంబుగొణ్డు;
పట్టంబుగట్టిన; పాపంబుదచుకు; ఒణ్డు సోటు; అనఘుణ్డు సేకొని; యిన్దు ప్రత్యక్షు,
అటెపుటవాపంబుగాన; నుల్లపరాజు వేరెఱు (రాజుశబ్దము తద్భవము); ఇడ్డ
ట్లుగా" (యుద్ధమల్లుని బెజవాడశాసనము-శాసనపద్యమంజరి-౨శాసనము).

పయిశాసనముల కాలమున కింకను లుప్తప్రథమావిభక్తి ప్రత్యయకము
లగు సంస్కృతసమశబ్ద ప్రథమలమీఁద నీయాదేశము వచ్చెడిసంప్రదాయము
రాలేదు

"సేనపట్టంబు" (అద్దంకిశాసనము, శాసనపద్య, ౧ శాసనము)

"విఖ్యాతకీర్తిజ ప్రస్తుతి" (యుద్ధ. బెజ. శాస. శాసనపద్య,
౨ శాసనము.) పయినుదాహరించిన "రాజు వేరెఱు" అనుచోటి రాజుశబ్దము
తద్భవ మగుటం జేసి యాదియాచ్ఛిక మిగాన దానిపై నా దేశమువచ్చుట శంకా
స్పదము కాదు. "తేజుణ్డు తనధమ్మిణవు" అనుచోఁ బద్యాంతమునందలి
వాక్యాంతము కాఁబట్టి తెలుఁగుప్రత్యయముమీఁద పైతి మాదేశము (సంధి)
రాదయ్యెను.

ఇంక, నన్నయభట్టు కాలమునాఁటిది దగు సోమలదేవిశాసనమునందన్న
నో లుప్తప్రథమావిభక్తిప్రత్యయకము గు సంస్కృతసమశబ్దమునిమీఁద పైతి మీ
గ స డ ద వాదేశము ప్రాచీనసంప్రదాయమునకన్న విశేషముగ నగపడు
చున్నది.

"మందగమన దొల్లి; సరసిజాస్యగనక" (శాసనపద్యమంజరి, 3 శాసన
ము-సోమలదేవిది)

పయివిషయముల ననుసరించి మేము నన్నయభట్టారకుఁడు తననాఁటి కేగ్ర
డినరీతిగ నాచ్ఛికమె కావలె నను నిర్బంధము లేదనియు లుప్తప్రథమావిభక్తి

ప్రత్యయక సంస్కృతసమములమీఁద సైతము గసడదవాదేశము నిత్యముగా వచ్చుననియు "గ స డ ద వాః స్యుః ప్రథమా మాత్రా" దిత్యాది కారికచే నుపదేశించెను. అట్టికారిక యర్థమిటు విశదీకరింపఁబడుచున్నది

"ఆత్మాస్మదోఃవినా=తా నా శబ్దములయొక్క ద్రుతాంతప్రథమా విభక్తి తప్పఁ దక్కిన, ప్రథమా మాత్రాత్=ప్రథమావిభక్తిమాత్రమునకంటెఁ బరమై యున్న, ఏతఏవ=ఈః క చ ట త ప లె, గ స డ ద వాః స్యుః= గ స డ ద వ లగును. సాంస్కృతికానాం=సంస్కృతసమశబ్దములలో, నవి కృతిశబ్దాత్పరతః=వికృతిచిహ్నములగు 'డుముపులు' అనెడిప్రథమాప్రత్యయములు లేని యనఁగా నవిలోపించినశబ్దమునకన్నఁ బరమైన క చ ట త ప లకు సైతము, గ స డ ద వాః=గ స డ ద వలు, భవంతి=అగుచున్నవి"

ప్రాచీనతమకాలమందలి యాచ్ఛికశబ్దములమీఁదను దెలుఁగువిభక్తులమీఁదనుమాత్రమె యీయాదేశమువచ్చునని సంప్రదాయముమాఱి లుప్తప్రథమా ప్రత్యయక సంస్కృతసమశబ్ద ప్రథమారూపములమీఁదసైత మీయాదేశము వచ్చుట తనవాఁటికి వెలసియుండుటం జేసి, ప్రథమాప్రత్యయముకలదా? లేదా? యను పరిశీల నమక్కఱలేకయే సంస్కృతసమమా? యాచ్ఛికమా? యనుపరిశీలనమును నక్కఱలేకయే ప్రథమావిభక్తిమాత్రము మీఁదనే గ స డ ద వాదేశము నిత్యముగాఁ జేయవలయునని నన్నయభట్టు సూత్రించినవాఁడయ్యెను. సంస్కృతసమశబ్దములమీఁదఁ దెలుఁగువిభక్తులు నిలిచియున్నపుడే గాని యీయాదేశము రాదనెడి ప్రాచీనతమకాలమునందలి నియమము మాఱిపోయినదను విషయమును 'ప్రథమామాత్రాత్' అనుచోటి మాత్రశబ్దముచేతనే వ్యక్తపఱచియు, నట్టియర్థమును స్పష్టప్రతిపత్తికయి "నవికృతిశబ్దా" దిత్యాద్యుత్తరార్థమున విశదీకరించెను. తా నా శబ్దములు ప్రథమాంతములయినను ద్రుతప్రకృతికములయినపుడు వానిమీఁది క చ ట త పలకు "పరుషా ద్రుతప్రకృతికా" దిత్యాది పూర్వసూత్రముచే గ జ డ ద బాదేశాది ద్రుతసంధికార్యములె యగుననియు దానికిఁ బ్రకృత సూత్రము బాధకము కానేరదనియు విశదీకరించుటకయి "ఆత్మాస్మదో ర్వినా" అని యిట్లు నిషేధించెను.

అథర్వణాచార్యుని నాఁటికాంధ్రవాఙ్మయము విస్తరించియుండుటచే నాతఁడు శాసనాదిస్థితప్రాచీనసంప్రదాయముల నరయకయే ప్రబంధవాఙ్మయస్థప్రయోగములను మూలముగాఁ జేసికొని చింతామణి పూరణము చేసినవాఁడఁగుటంజేసి యాతఁడు పై నన్నయాభిప్రాయమును గ్రహించుటకవకాశము లేదయ్యెను. అక్కారణమున నాతఁడు పై సూత్రమునకు వేఱువిధముగ నర్థముచేసికొని దానిని సవరించుటలో "వికృతౌ త్వరుపా శ్చ స్యుః సుస ఆద్య పదాదిగాః" అనుసూత్రము నుపదేశించినవాఁడయ్యెను.

ప్రథమావిభక్తీతరములగు కళాశబ్దములమీఁద సైతము యాదేశము వచ్చుటయుఁ బ్రథమమీఁద సైతము బహుళముగా వచ్చుటయు ననెడి యర్వాచీన సంప్రదాయము నన్నయనాఁటికింకను రాలేదు. కావుననే నన్నయభట్టీయాదేశమును బ్రథమమీఁద నిత్యముగాఁ జేయుచుఁ బ్రథమాంతేతరకళలమీఁద నీయాదేశమును నియమముగా మానుటయుఁ సంభవించెను.

చ॥ గగనమునందు......మా । నుగ......(ఆది ౭ ఆ ౬౯ ప)

క॥ తగిలి......ఇ । మ్మగ...... (సభా ౨ ఆ ౧౫౪ ప)

క॥ చేసమరికొంచుఁ బోడువఁగ । డాసిన......(ఆది ౬ ఆ ౨౦౬ప)

— ప్రథమాంతేతర కళలమీఁద రానందులకు —

అవధారణార్థకములమీఁద:—

కం॥ సకలహితంబై శాంత్యా । దిక......పర్వం । బకడు నెమ్మిలసఁగ
శాంతిపర్వము వెలయున్ (ఆది ౧ ఆ ౫౮ ప)

("దానిక కలశ బిడ్డట్లుగా" అని యిట్లు యుద్ధమల్లుని బెజవాడశాసనమునందును నిట్టి యాదేశము రాలేదు)

సంబోధనస్థల స్థావ్యయములమీఁద:—

కం॥ ఆతని నత్యుగ్రానల...నో । హూతకుక...(ఆది ౧ ఆ ౨౩౫ప)

శేషవస్తుమీఁద:—

కం॥ నీకతముంన...। ప్రాకట...(ఆది ౨ ఆ ౧౯౧ ప)

ఇట్లె "బెజయిత దేవనితూంతు" "రేవలదేవి కనిన సోమలదేవి"

(శాసనపద్యమంజరి ౭ నెంబరు సోమలదేవిశాసనము)

పైస్థలములు రెండిటిలోను శేమషష్ఠిపైని గకారాదేశము రాలేదు. 'రేవలదేవికనిన' అనుచో 'నా కన్నకొడుకు' అనునట్లు 'రేవలదేవియొక్క కనిన' అని ప్రాచీనసంప్రదాయముచొప్పున విగ్రహము చెన్నవలెను. అట్లు గ్రహింపనేరక యచటి "రేవలదేవి" యనునది ప్రథమాంతమని భ్రమించి కీర్తిశేషులగు కె. వి లక్ష్మణరావుగారు రీప్రయోగమునె చూపి "ప్రాచీనకాలమందును నీ గ స డ ద వ వాదేశము వికల్పమె" అని వ్రాయుట ప్రామాదికమని యెఱుంగనగును.

(౧౯౫౯) పయి యనుపపత్తులనేగాక మఱికొన్నిటిని నైతను నన్నయ భారతభాగ భాషాలక్షణములను గూర్చి కొందఱు విమర్శకులు చాల కాలము క్రిందటనె (చూ. రాజనరేంద్రసంచిక. ౪౩. పు) చూపియున్నారు. వానిలోఁ గొన్ని ముఖ్యాంశము లిట విమర్శింపఁబడుచున్నవి.

"నన్నయభారత భాగమున "ఏమ్యాదుల యిత్తునకు సంధి లేదు." ఇది నిజము కాదు.

"కం॥ అమిను ము సింహాసులచే। గోమాయువు గొన్నయట్లు కువలయరాజ్య శ్రీ మనచేఁగొని కౌరవుఁ। డేమని తలఁచునొకో బుద్ధి నిష్ఠలుఁ డానున్"

(అరణ్య ౧ ఆ ౨౩౮ ప)

"కం॥...ధృతి । మంతున కత్యంతధర్మమతి కిట్టిరియెన్"

(సభా ౨ ఆ ౨ ప)

"ఆ॥...మాండవ్యుచే । శప్తుఁడై యాదేల సంభవించె

(ఆది ౪ ఆ ౨౬౧ అ)

"కం॥ ఇదె దేహం బిదె యర్థం । బిదె సాపరిజనసమూహ మిన్నిటిలో...

(ఆది ౫ ఆ ౨౪౩ ప)

"ప్రథమపురుష షేకారమునకు నన్నయభారతభాగమున సంధి గలదు" ఇది నిజముకాదు. ఈవిషయ మీగ్రంథమున ౧౦౦—౧౦౪ విషయములలో విపుల విమర్శన పూర్వకముగా నిరాకరింపఁబడియుండుటచే నిట మగల విమర్శింప మానితిని.

"నన్నయభారతమున 'ఫుం పులు' లేవు" ఇదియు నిజముగాదు.

"మధ్యాక్కర. తవిన యన్నువ నల్లనైన దీర్ఘపుం దనువునుజూచి"

(ఆది ౪ ఆ ౨౫౪ ప)

"సీ॥ కల హిడింబుండను బలితంపు రక్కసు చెలియల..."

(ఆది ౬ ఆ ౨౧౪ ప)

"ఆ॥ వె॥ లోకనాథ యిట్టి లోకవిరుద్ధంపు। వరము..."

(ఆది 2 ఆ ౨౬౨ ప)

"తే॥ మీనిపుట్టిన పాపంపువేళయందు..." (అర ౧ ఆ ౪౯ ప)

"సీ॥ పరుసంపు టాలనైఁ బడి తీవ్రవేదనఁ బొంది..." (అర 3 ఆ 300 ప)

(౧౫౬) పయిరీతిని చింతామణిలోని తక్కినవానికిని నన్నయ భారత భాగమునఁ బ్రయోగములు వెలయుచునే యున్నవి. ఒక్కొక్కరు లేచి సరిగఁ బరిశీలింపక యొక్కొక్కటి లేదనుచున్న నెంతకని వెరుకవలెను ? దయతో నోపికతో శ్రద్ధతోఁ బరిశీలించి యిట్టిప్రసంగములు చేయుట యుక్తము ఇంతకును బయినివ్రాసినరీతిని నన్నయ చింతామణిలోఁ జెప్పినవానిలోఁ గొన్నిటిఁ బ్రయోగింపకున్నఁ బ్రయోగింపకపోవచ్చును. అతఁడట్లు చింతామణికి లక్ష్యముగా భారతమును రచించెదనని ప్రతిజ్ఞ చేసి యుండలేదుగదా. ఇంతియకాక లేఖకముద్రణ సంస్కర్తృప్రభృతులచేఁ గొన్ని రూపుమాసినను మాసియుండవచ్చును. ఇట్టివానితో నేమిప్రయోజనము?

పయిరీతి నాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారక విరచితమనుటలో నాధునికవిమర్శకులు చూపిన యనుపపత్తులెల్ల సుసమాధేయములయి యుండుటం జేసి చిరకాలమునుండి పండితపరంపరాయాతముగా వచ్చుచున్న చింతా·

మణి నన్నయకర్తృకమనెడి ప్రసిద్ధి నిర్బాధమై సిద్ధాంతకోటి నధిరోహించు చున్నది. (చూడుఁడు ౪౯ విషయము).

ఆదినుండియు మొన్నటివఱకు నిర్వికల్పముగాఁ బండితపరంపరాయాత్తమై వచ్చుచున్న "ఆంధ్రశబ్దచింతామణి నన్నయకర్తృకము" అనెడి సుప్రసిద్ధ నిర్బాధ జనశ్రుతియే యది నన్నయకర్తృకమనుటకుఁ బ్రబలప్రమాణమై యున్నది. ఇట్టిస్థితిలో నది నన్నయకర్తృకము కాదనుటకుఁ దగిన యనుపపత్తులను జూపి తమవాదము నిలఁబెట్టుకొనవలసిన భారము ప్రతిపక్షులపైఁ బడియున్నది. అట్లు ప్రతిపక్షులు చూపిన యనుపపత్తులకెల్ల సమాధానములను వ్రాసి యవి నిలువనేరకుండెడి దౌర్బల్యమును విశదీకరించుటయే గాక నన్నయ కర్తృకతాస్థాపకములగు ప్రబలప్రమాణములు సైత మనేకములీగ్రంథమునఁ జూపఁ బడి యున్నవి. అట్టివానిని బాఠకమహాశయులు దయతో సావధానముగఁ బరిశీలింతురుగాక !

గుణగ్రహణపారీణులగు విమర్శకమహాశయు లీ గ్రంథమునందలి గుణ లేశములను మన్నించి స్వభావసులభమగు సమ్మోదము నందుదురుగాక !

విశాఖపట్టనము,
20-11-1936

ఇట్లు విన్నవించు సుజనవిధేయుఁడు,
వఝ్ఝుల చినసీతారామస్వామిశాస్త్రి.

# ఆంధ్రశబ్దచింతామణివిషయ పరిశోధనము.

—)•(—

చింతామణి నన్నయభట్ట విరచితమే.

శ్లో. "వాచా మాంధ్రమయీనాం యః ప్రవక్తా ప్రథమోఽభవత్,
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనమ్."

విచక్షణులారా,

(౧) సరసకవితాసామ్రాజ్యధౌరేయుండును, శబ్దశాసన బిరుదభూషితుండును నగు నన్నయభట్టారకుఁ డాంధ్రసామ్రాజ్యధురంధరుం డగు రాజరాజనరేంద్రుని ప్రేరణంబున వేదవ్యాసోపబృంహితపంచమవేదభూత సంస్కృతమహాభారతసంహిత నాంధ్రీకరింప నుత్సహించినవాఁ డగుచు నప్పటికిఁ దెలుఁగుభాష మహాప్రబంధరచనానుకూలముగా నేర్పడియుండకుండుటం జేసి యాంధ్రలోకవ్యవహారస్థ మగు తెలుఁగుభాషకు హస్తావలంబముగా నప్పటికే మహావైశాల్యము నందియున్నట్టియు దేశీయులలో విద్యాభిలాషులెల్ల నభ్యసించుచున్నదైనట్టియు సంస్కృతభాషను విపులముగా మేళగించి దానిని మహభారతసంహితాంధ్రీకరణానుకూలభాషగాఁ జేయ నెంచెను. ఆవఱకే యాంధ్రదేశమున సంస్కృతము సకలపండిత సాధా

రణముగా నన్నదగుటంజేసి వారి వాడుకలలోను నరుదుగ నప్పటికే వెలయ నారంభించియున్న యాంధ్రపద్యములలోను గొంతవఱకు మేళగింపఁబడుచువచ్చుచున్న యా సంస్కృత శబ్దములందు వెలయుచున్న నియమముల ననుసరించి సంస్కృత భాషామేళనోపయోగి నియమములను విపులముగా నేర్పఱిచి మహాభారతసంహితాంధ్రీకరణక్షమమగు వైశాల్యము నాంధ్ర భాషకుఁ గల్గించి శిష్యపరంపరోపయోగార్థముగాఁ జింతామణి రూపమున నట్టి నియమములను వెల్లడించుటచేతనే యాతఁడు శబ్దశాసన బిరుదభూషితుఁడయ్యెనని చెప్పుటకు సందియములేదు.

(౨) సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనెడి పద్ధతుల నేర్పఱుచుకొనుటను బ్రధానముగాఁ జేసికొని రచించుట మున్నగు కారణములచొప్పున నాంధ్రశబ్దచింతామణి కొంతకాలమునకుఁ (మధ్యకాలమున) బ్రచారము తగ్గియుండుటచేతఁ గావలయుఁ బదునేనవ శతాబ్దములోనివాఁడగు జక్కన కవి తన విక్రమార్కచరిత్రములో నన్నపార్యునకు శబ్దశాసన బిరుదము భారతరచనమువల్ల వచ్చెనని యీ క్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

ఉ. వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సుప్రబంధముల్
వ్రాయక చెప్పి రట్లు రసబంధురభావభవాభిరామ ధా
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తికెక్కిరే
యీయెడ నన్నపార్యగతి నిద్ధర నట్టిమహాత్ముఁ గొల్చెదన్.

(3) కాని నన్నయభట్టారకుఁడు భారతభాగరచనమునకు ముందే యాంధ్రశబ్దచింతామణిని రచించి శబ్దశాసన బిరుదమును గాంచె నని యాతని యీ క్రిందిపద్యము చెప్పుచున్నది. అట్టి యీ క్రిందిపద్యములో నుభయభాషా కావ్యరచనాచణత వేఱుగఁ జెప్పఁబడుటచేత శబ్దశాసనబిరుదము వ్యాకరణ కర్తృత్వమునె బోధించుచున్నదనక తప్పదు. కాన నర్వాచీన జనకల్పితము కాఁజాలదు.

సీ. తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు.........నుభయభాషాకావ్య రచనాభి
శోభితు...నన్న పార్యుఁ జూచి...

(భారత. ఆది ౧.ఆ. ౯ పద్య.)

(౪) నన్నయభట్టారకుని నాఁటికి యుద్ధమల్లుని బెజవాడశాసనము మున్నగు సంస్కృతశాసనములును బహుళములగు పద్యములును దక్క ప్రబంధవాఙ్మయము మున్నదనుటకుఁ దగిన నిదర్శనము లెవ్వియు గనఁబడకున్నవి. ఇట్లే గొందఱు నన్నయభట్టారకుని భారతభాగముయొక్క ప్రౌఢిమను ప్రశంసించుచు నట్టి ప్రౌఢకవిత్వము హఠాత్తుగా బుట్టియుండదా యని యాలోచించుచు నన్నయభట్టారకునకుఁ బూర్వకాలమున నేదేని యాంధ్రకావ్యము లుండియుండవచ్చుననియు నవి బౌద్ధజైనాది మతప్రధానములై యుండుటంజేసి కాలముయొక్క పరవాదివారి చేత నుపేక్షితములై నశించి యుండవచ్చుననియు, నింక ను...

కలచే దహింపఁబడి యైన నుండవచ్చుననియు నూహించు చున్నారు. మఱియు నట్టి ప్రాచీ నాంధ్రకావ్యవాఙ్మయము నన్నయభట్టునకు మార్గదర్శకమై యుండ నాతఁడు సర్వోత్కృష్ట మగురీతిని దన యాంధ్రభారతభాగమును రచించియుండవచ్చు ననియు నూహించుచున్నారు. అట్టిలయూహలు నన్నయభట్టారకుని కవితాప్రాభవము వెలయించున వగుటచేతఁ బ్రశంసనీయ ములే యైనను నవి యథార్థమని నిర్ణయించుటకుమాత్ర మాధా రమేమియుఁ గానరాదు. నన్నయభట్టారకునినాఁటికే యాంధ్ర దేశమున బౌద్ధజైనమతము లంతరించియుండుటచేత నట్టి వాఙ్మయ మాతనికిదొరకి యనుపదముననే నశించినదనుట కేవ లము నసంభావ్యమై యుండునుగదా. అట్లే నన్నయనాఁటికి నిల్చియున్న ప్రాచీనవాఙ్మయమును మాత్రమెంచి తురుష్కులు దహించియుండురనియు నన్నయభారతాదులను విడిచిపెట్టిరని యును జెప్పెడి యూహ యెంతమాత్రమును విశ్వసనీయము కాఁజాలదు గదా. ఒక్కొక్కసమయము ప్రబలునప్పుడు తత్తదితర మతముల గ్రంథములు నశింపక నిల్చియుండుట యెల్లరకును విదితమే యగుటచేతఁ బయియూహలెల్ల నపోహములే యను టకుసందియము లేదు.

(౫) నన్నయభట్టారకుఁడు తన భారతారంభమున సం స్కృతమహాకవులగు వాల్మీకివ్యాసులను స్తుతించియు నాంధ్ర కవుల నొక్కరినైన స్తుతించి యుండలేదు. నారాయణభట్టు

తెలుఁగున నే గ్రంథమును రచించియుండిన ట్లగపడదు. అకా్కా-రణమున నాతఁ డాంధ్రమహాకవి యనిపించుకొనఁ జాలకున్నను నాతఁ డాంధ్రమునందును గొంతజ్ఞానము కలవాఁడై కర్ణాటాది భాషావాఙ్మయపరిశోధకుఁ డగుటచేత నేవేని కొన్నిమార్గములను ద్రొక్కుటలో సాయపడుచు వచ్చుటచేతఁ గావలయు నిర్గర్వచూడామణియగు నన్నయభట్టారకుఁ డట్టి నారాయణ భట్టు తనభారతరచనకు సహాయుఁడయ్యె నని యీ క్రిందిరీతిని భారతకృత్యాదినిఁ జెప్పియున్నాఁడు.

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణు నట్లు వానసభరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగా.

(భార. ఆది. ౧ ఆశ్వా. ౨౫ పద్యము)

(౬) భాషాసంస్కరణ నియమములను ఛందోనియమములను నేర్పఱుచుకొనుటలోను దన యాంధ్రమహాభారత భాగమును నిరర్గళధారావాహికవిత్వముననడపుటలోను నన్నయ భట్టారకునకు సంస్కృత ప్రాకృత కర్ణాట వాఙ్మయములు మార్గదర్శకములు కావచ్చును. "ఉభయభాషా కావ్యరచనాభి శోభితుఁ" డనంబరఁగిన సంస్కృత కవితాదక్షుఁ డగు నాతని కందలి పద్యములయు, సమాసములయుఁ బ్రాచుర్యముతో వెలయు నాంధ్రకవితను ధారావాహిగా నడపుట దుష్కరము

కానేరదని యుభయభాషాకవితానుభవము గలవారికిఁ దోఁచక పోదుగదా. ఇంతకును నాతనికిఁ బూర్వమునందే సంస్కృత భాషాసాహిత్యమునఁ గర్ణాటభాషలో ధారావాహికవిత వెలయుచుండలేదా?

(౨) ఇట్లు నూతనముగా నాంధ్రభాషను మహోన్నత దశలోనికిఁ దెచ్చు మహాకార్యమునకుఁ బ్రోత్సాహకుఁ డైన యాంధ్రసామ్రాజ్యధూర్వహుండగు రాజరాజనరేంద్రుని సభలో నన్నయభట్టు నారాయణభట్టులే గాక మఱికొందఱాంధ్ర పండితప్రకాండులును నుండియుందురని యూహింప నగును. అట్టివారిలోఁ బావులూరిగణితమును రచించిన పావులూరి మల్లన యొకఁడని యీక్రిందిపద్యము విశదీకరించుచున్నది.

ఉ. శ్రీలలనేశుఁ డాంధ్రనృపశేఖరుఁడై చను రాజరాజ భూ
పాలకుచేతఁ బీఠపురి పార్శ్వమునన్ నవఖండవాడ యగ్రా
హారలు విభూతితోఁ బడసి భూరిజనస్తుతుఁ డైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు సివ్వన పుత్త్రుఁడు మల్లనాఖ్యుఁడున్.

(ఆంధ్రకవులచరిత్ర, రివైజ్డ్ ఎడిషను. పుట ౧౭౯).

(౩) పరిశీలింపఁగా నాంధ్రభాషామతల్లికి నవనవోన్మేషమును గల్గింప సమకట్టిన యక్కాలమున నొక్క రాజరాజనరేంద్రాస్థానముననే గాక యాంధ్రదేశమున ననేకస్థలములందు బహుశిష్యపరంపరాపరివృత కవిపండితసంఘము లేర్పడియుండె ననియు నీక్రింది యాంధ్రభారతకృత్యాది సందర్భ

ములోని నన్నయభట్టారకకృత సభాస్తావకపద్యముచే విశద మగుచున్నది.

చ. పరమవివేక సౌరభ విభాసిత సద్గుణపుంజవారిజో
త్కర రుచిరంబులై సకలగమ్యసుతీర్థము లై మహామనో
హర సుచరిత్ర పావన పయఃపరిపూర్ణములైన సత్సభాం
తరసరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్.

(భారత. ఆది ౧. ఆ ౨౫ ప).

ఈ సందర్భమున నన్నయభట్టారకుఁడు వాల్మీకి వ్యాసు లనుమాత్రమె స్తుతించి యిట్లు పండితసభలను నుతించి యున్నాఁడు. దీనినిబట్టి యాతనికిముం దాంధ్రభాషామయ మహాకావ్యములు లేవనియు, నక్కారణముననే యాతఁడు స్వసమకాలిక భాషాపండితసంఘములను మాత్రమే స్తుతించి యుండెననియు విమర్శకులకు గోచరింపక మానదుగదా. మఱియు నీసందర్భముచేత సమకాలికులను సైతము ప్రశంసించెడి నన్నయభట్టారకుని సౌమనస్యము వెల్లడియగు చున్నది గదా.

(౯) భాషలో మొదటమొదటఁ బాటలు పదములు నలంతిగఁ బద్యములు వెలయుచుండుటయుఁ గాలక్రమమున దేశభాషాభిమానులగు పండితకవు లప్పటికిఁ గల పండితవ్యవ హారమును నట్టిపాటలు మున్నగువానిని నాధారముగఁ గొని మహాకావ్యరచనోపయోగముగ భాషకు నియమము లేర్ప

ఱుచుకొని మహాకావ్యరచనకుఁ గడఁగుటయు సహజమే గదా.

(౧౦) ప్రాచీనకాలమందు దక్షిణహిందూస్థానమున నిట్లు భాషను సంఘములు సంస్కరించుకొనుట సంప్రదాయసిద్ధమై యుండెను. ద్రావిడభాషలందు వాఙ్మయవత్త్వావస్థ నందుటలో మొదటి దనఁబడుచున్న దమిళమున కిట్టి సంస్కారము పండితసంఘములు జరపుటయును నట్టి సంస్కారము నందిన భాషను "సెందమిళ్" అని వ్యవహరించుచుండుటయును నట్టి సంస్కారము నందినభాషతోఁ బుట్టినగ్రంథములను సంఘ వాఙ్మయమని వ్యవహరించుచుండుటయును దమిళభాషా సంప్రదాయాభిజ్ఞు లగు విమర్శకులకుఁ దెలియనివిషయము కాదుగదా.

(౧౧) పయి నుదాహరించినరీతిని నన్నయభట్టారకుఁడు భారతాదిని సుకవిస్తుతిసందర్భమున దేశభాషాపండితసంఘము లను స్తుతించుటయే గాక తాను రచించు మహాభారత మట్టి పండితసంఘముల యాదరణము నందుననియు నీక్రిందిరీతిని బలుమా ఱుగ్గడించియున్నాఁడు.*

---

* సంస్కృతభారతమున నిట్టి సభాప్రసంగము లేదు.

శ్లో. ఏతత్సర్వం సభాపర్వ సమాఖ్యాతా మహాత్మనా
అధ్యాయాస్సప్తతి ర్జ్ఞేయా స్తథా......అతఃపర్వ తృతీయంతు జ్ఞేయ
మారణ్యకంమహత్..." (౨ అధ్యా. ౧౪౨-౧౪౩ శ్లో)

క. పర్విసభాప్రభృతిగ నవ, పర్వములను విస్తరిల్లి పండిత చేతో
నిర్వృతిఁ జేయుచు రెండగు, పర్వము నా రమ్యమగు సభాపర్వమిలన్.
(భార. ఆది. ౧. ఆ. ౩౨ ప.)

క. ఆరణ్యపర్వ మనఁగా, నారణ్య ప్రముఖ షోడశాంతఃపర్వా
ధారమయి సకలసూరి సభా రమ్యంబగు తృతీయపర్వము వెలయున్.
(భార. ఆది. ౧. ఆ. ౬౯ ప.)

క. పర్వుచు వైరాటాదిక......సభారంజన మై (భార. ఆది. ౧. ఆ. ౮౧)

క. విదితంబై యుద్యోగము, మొదలుగ...ఉద్యోగపర్వ మిమ్మగుసభలన్.
(భార. ఆది-౧. ఆ. ౮౩. ప.)

క. విన నే డగు పర్వము మే, లనఁగా ద్రోణాభిషేక మాదిగ... ...
...ద్రోణపర్వ మనురుణ సభలన్. (భార. ఆది-౧. ఆ. ౮౭ ప.)

ఆ. సభలవిస్తరిల్లి శల్యాదికములైన...... (భార. ఆది-౧. ౫౧ ప.)

క. పర్వుచు స్త్రీపర్వాదిక......పండితసభలన్. (భార. ఆది-౧. ౯౫ ప).

నన్నయభారత భాగకృత్యాది నున్న పైపద్యముల లోని పండితసభల ప్రసంగమును బరిశీలించునపు డాకాలమునఁ బండితసభ లనేకములు వెలసియుండెడివని విమర్శకులకుఁ దోఁచక మానదు గదా.

(౧_౩) కావుననే నన్నయభట్టారకుఁడు తాను రచించిన చింతామణియందును బండితసంఘముల యభిప్రాయములను బ్రశంసించి యాదరించుచు వచ్చె నని యాంధ్రశబ్దచింతామణిలోని యీ క్రిందిసూత్రముల రీతియు సైతము విశదీకరించుచున్నది.

"యశ్రుతమార్యా లఘుయం, ప్రవదంతి ప్రాణతః పరంప్రాణమ్"
"డుజతౌ తునప్లుతః స్యా, త్సంబుద్ధా విత్యుతాం విదః కేచిత్"
"లఘువో ఽలఘువశ్చేతి, ద్వేధాంతస్థా న్వదంతి శాస్తారః"
"టాదివిభక్తా నిర్నే త్యేకే, నామంత్రణే డుజిత్యన్యే"
"కవిభల్లటైః క్రియాణాం, నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు"
"ప్రథమైక వచనమాత్రే, వికృతౌ నాంతాదయోపి కథ్యంతే."

(ఇందుఁ బేర్కొనఁబడిన కవిభల్లటుఁడు క్రీ॥ శ. ౧౨౩౦ సంవత్సరప్రాంతమువాఁడని వ్రాసిన కవులచరిత్రవ్రాఁత నిరాధారమగుటచేఁ బరాస్తమగుచున్నది).

మఱియు నన్నయభట్టారకుఁడు తనకాలమునందలి పండితుల వాడుకలను సంతకుఁ బూర్వులగు సమీపపండితుల వాడుకలను బరిశీలించుచు వచ్చెనని చింతామణిలోని యీక్రింది సూత్రములు విశదీకరించుచున్నవి.

"అపిసంయుక్తే సమాప్తౌ భూయోంతేఽచః ప్రదృశ్యతే నామ్నామ్"

దీనిచే నీళ్ళు మున్నగువానిలోని లుప్తప్రత్యయస్థితిని మఱచిన భాషాసంస్కారము లేనికాలమునందలి లోకము భ్రాంతిచే మరల బహువచనప్రత్యయమును జేర్చి వాడిన రూపములు పండితాంగీకృతములై గ్రాహ్యము లగుచున్నవని విశదమగుచున్నది గదా.

"స్యాదమహతాం విభక్తౌ సోశ్చ ముతదుపరి పునర్ద్బహూ ప్రాచామ్"

ప్రాచీనశాసనములలో నగపడుచున్న బువర్ణాంతరూ
పములను బట్టి భాషాచరిత్రవేత్తలు "ఫలంబు, ఫలబు,
ఫలమ్ము" అను రూపములు "ఫలము" అనెడి ముప్రత్యయాంత
రూపమునకన్నఁ బ్రాచీనతరములని సిద్ధాంతీకరించుచుండుట
చేతఁ బయిసూత్రములోని "ప్రాచామ్" అనుపదము సుసంగత
మగుచున్నది. అట్టి ప్రాచీనప్రయోగములు సైతము స్వసమ
కాలిక పండితులచే వాడఁబడుచుండుటచేత వానిని జింతామణి
సంగ్రహించుచున్నదని యున్నవలెను. నన్నయభట్టారకుని కాల
మున కించుక ముందటికాలమునుండే గ్రాంథికాంధ్రభాషాం
కురములు మొలకలెత్త నారంభించెనని యీవలనే వ్రాసి
తిని గదా.

మఱియు వ్యావహారికశబ్దములఁ గల్గుచున్న వర్ణలోపాది
వికారములు గలవి వాడుకలోని గ్రామ్యరూపములను గ్రహిం
చువిషయమున మహాకవుల సాధారణమే ప్రమాణమని
నన్నయ యాక్రిందివిధమున సూత్రించియున్నాఁడు.

"అన్యేషాం చ ప్రయోగమహితానామ్"

పైరీతిని సూత్రింపఁబడిన సూత్రము లెల్ల సప్పఁ
బ్రమాణమై యున్న కావ్యవాఙ్మయము లేదని నిర్ణయించు
నాంధ్రశబ్దచింతామణి ప్రాగనుకావస్థను విశదీకరింపఁ
జాలియున్నదిగదా. మఱియు సద్యోసూత్రములలోని "ప్రస

దంతి" మున్నగు వర్తమానక్రియలు పైవిషయముల ననఁగాఁ దాత్కాలికపండితకవి సమాదరణాదికములను మఱింత బల పఱుపఁ జాలియున్న విగదా.

(౧౩) "స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ."

అను చింతామణి ద్వితీయకారికయుఁ దద్గ్రంథ ప్రాథమికావస్థ ను బోధింపఁ జాలియున్నది. దేశభాషాకావ్యములు రసమును వెల్లివిఱియఁ జేసినట్లు వ్యవహారవిదూర సంస్కృత భాషాకావ్య ములు చేయఁజాలవు గాన "అన్యత్" అనఁగా సంస్కృత కావ్యజాతమును విడిచి యాంధ్రదేశీయ మహాశయులు వైకృతకావ్యములనే బహూకరించుచున్నారని యి ట్లకా్కలమునందలి వైకృతకావ్యాభిముఖ్యమును నౌత్సుక్యమును జూపుచు నయ్యది దత్సాధనభూతభాషాసంస్కరణరూప వ్యాకరణ రచనావశ్యకతను నిరూపించుచున్న దని గ్రహింప వలసియున్నదిగదా. అట్టి యభిప్రాయవిశేషములే లేని-నో వ్యాకరణాదిని గావ్యప్రశంస యప్రసక్తమే యగునుగదా.

(౧౪) మఱియు దేశభాషాభిమానము గల పండిత సంఘము నట్లు ప్రశంసించిన చింతామణిలోని పయి కారిక యందలి "సంతః" అనెడి సచ్ఛబ్దముతోనే నన్నయభట్టార కుఁడు తన భారతాదిసందర్భములోఁ సైతము పండితసభల నీక్రిందిరీతిని బ్రశంసించుట నరయఁగా నారెండుగ్రంథములకును

గల యేకకర్తృకత్వము విమర్శకుల మనోవీథిని విహరింపక మానదుగదా.

చ. పరమవివేకసౌరభవిభాసిత సద్గుణ పుంజ వారిజా
త్కర రుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావనపయఃపరిపూర్ణములైన సత్సభాం
తరసరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్.

(భార. ఆది ౧. ఆ ౨౪. ప)

(౧౫) ఇట్లు వ్యాకరణమునకుఁ బరంపరాసంబంధముచే మోక్షఫలకత్వమును "విశ్వశ్రేయః కావ్యమ్" అను సూత్రముచేఁ జింతామణిగ్రంథాది నుపదేశించి యా శ్రేయశ్శబ్దముతోనే భారతాది నీగ్రంథరీతిని నన్నయభట్టారకుఁడు మంగళాచరణము చేయుటయుఁ దద్గ్రంథద్వయసమానకర్తృకత్వమునకు స్ఫోరక మగుచున్నదిగదా.

శ్లో. "శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహం త్యవిహతాః స్త్రీపుంసయోగోద్భవామ్,
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే"

(౧౬) మఱియు వెనుక నుదాహరించినరీతిని,

"స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ."

అను చింతామణి సూక్తిచొప్పున రసప్రలుబ్ధమానసమగు

నాంధ్రమహాశయలోకము తోడి కర్ణాటులను జూచి వైకృత కావ్యముల ననఁగా నాంధ్ర కావ్యములను బహుమానించు (ఆకాలమున కరుదుగ నాంధ్రపద్యకృతులు వెలసియుండెనని యీవఱకు వ్రాసియేయున్నాను.) నుత్సాహముతో వెలయు చుండుటచేత నట్టివారి యౌత్సుక్యము దీఱునట్లుగ నాంధ్ర జగద్ధితముగ రసాస్వాదనోపయోగి 'ప్రసన్న కథాకలితార్థ యుక్త'ము సాధుశబ్దభూషితము నగు మహాభారతసంహితను "నానారుచిరార్థసూక్తినిధి" యగు తాను రచించుచున్న వాఁడు గావున నద్దానిని సేవించు నాంధ్రభాషాభిమాని "రసప్రలుబ్ధ" పండితలోకమునకుఁ బయి శ్లోకముచొప్పున ('లోకానాం స్థితి మావహన్తి') లోకస్థితిని వహించుచున్న త్రిపురుషు లనఁగాఁ ద్రిమూర్తులు 'శ్రేయస్సును' బ్రసాదింతురు గాక యని యిట్లు చింతామణి నన్నయభారత. భాగకృత్యాదిసందర్భములు పరస్పరసంబంధము గలవై వెలయు చుండుటం జేసి యట్టి సంబంధమును జూపు పైనుదాహరించిన శ్లోకపద్యములె గాక యీక్రిందిపద్యము సైతె మీ సందర్భమున విమర్శకసేవాయోగ్య మగుచున్నది.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్.

(అక్షరరమ్యత=శబ్దసాధుత్వము.) (భార. ఆది-౧ ఆ.)

(౧౭) నన్నయభట్టారకునకుఁ బూర్వము చిరకాలము క్రిందటనే యాంధ్రభాష కార్షములగు వ్యాకరణము లుండెడివని చెప్పెడి యీక్రింది వారి వాక్యములు కేవలము పరిహాసనీయములును సకల విమర్శక చరితాభిజ్ఞ నిరాకృతములును నగుటం జేసి గ్రంథవిస్తరభీతిచే నీసందర్భమున వానిని విమర్శింప మానితిని.

శ్లో. ఆథర్వణాని కౌణ్వాని బార్హస్పత్యాని సంవిదన్,
కౌముదీ మాంధ్రశబ్దానాం సూత్రిణీ చ కరోమ్యహమ్''

(ఆంధ్రకౌముది.)

''బార్హస్పత్యాని సర్వాణి కౌణ్వం వ్యాకరణం విదన్
కరోమ్యాన్ధ్రాణాం శబ్దం సర్వలక్షణ లక్షితమ్''

(త్రిలింగశబ్దానుశాసనము.)

ఇట్టి గాథలనెల్లఁ బూర్ణముగ విమర్శించి నారచించి ''ఆంధ్రచ్ఛందస్సు'' అనెడి వ్యాసమున నిరాకరించియున్నాను (సాహిత్యపరిషత్పత్రిక రౌద్రిసంవత్సర జ్యేష్ఠాషాఢ మాసములు)

(౧౮) పైని జెప్పినరీతిని నన్నయభట్టారకుఁడు మొ మొదట నాంధ్రవ్యాకరణమును వెలయింప నెంచి వ్యావహారికభాష యెల్లను రసోచితమహాకావ్యరచనోపయోగి కానేరదని తలంచి యట్టి వ్యావహారికాంధ్రభాష కాంధ్ర

భాషాసహజములగు కొన్నినియమముల నేర్పాటు చేయ సాగె నని యాతని చింతామణిసందర్భమువలన విశదమగు చున్నది. అట్టినియమముల నేర్పఱుచుటలో సంస్కృతసమముల విభక్తిమేళనమునకును, సంస్కృత 'సమశబ్దేతరాంధ్ర ప్రకృతులను గ్రహించుటకును, సాధారణముగఁ బండితవ్యవహారము తప్ప వేఱొక యాధారము లేమింజేసి సామాన్యముగ శబ్దసిద్ధి లోకమువలననే తెలియవలయునని యీ క్రిందిరీతిని మొట్టమొదట సుప్రసక్తముగ సూత్రించెను. వాఙ్మయము వెలసినతర్వాత నన్ననో సాధుశబ్దసిద్ధి వాఙ్మయమువలన నెన్నఁదగును గదా.

"సిద్ధి ర్లోకా ద్బ్రుశ్యా లోకో న స్యాద్ద్రుశశ్చ నిత్యశ్చ
సంస్కారార్థో నియమో ఽనియమా ద్ధ్రావ్యం హి యత్ప్రవక్త్రంశః."

(ఆంధ్రశబ్దచింతామణి. సంజ్ఞా, ౩ శ్లో.)

(౧౯) అట్లు లోకవ్యవహారమునుండి గ్రహించిన శబ్దజాలములోని ప్రకృతుల సంస్కారము చేయుట వైయాకరణుల పనికాదనియు, నది ప్రయోగావసరమునందుఁ గవులచేతనే చేయఁబడఁ దగుననియుఁ, దద్విషయమును విపులముగ సూత్రింపఁ డయ్యెను. ఇఁక నట్టి ప్రకృతులలోను, విభక్త్యంతము లగు శబ్దములలోను వివిధవ్యవహారము లుండునపుడు వానిలో నపభ్రష్టము లనఁదగినవాని విషయమును మాత్రము సందేహనిర్ణాయకములును, ననేక స్థలోపయోగులును, నగు

నియమములనుమాత్రమే సూత్రించుచు వచ్చెను. ఆంధ్రలోక
వ్యవహారస్థమగు నట్టి సంస్కృతసమేతరభాష యల్పతర
మగుటచేత నద్దాని నూఁతగొని మహాభారతసముద్రపారము
నందుట దుస్సాధమని యెంచి యావఱకే యాంధ్రపండితుల
వాడుకలోనున్న యాంధ్రభాషాసహజములగు నియమముల
ననుసరించియు, నప్పటికే కర్ణాటపండితులు త్రొక్కిన పద్ధతిని
బరిశీలించియు, సంస్కృతప్రకృతుల నెల్ల సాధారణముగాఁ దెలుఁ
గులోనికిఁ దెచ్చికొనవచ్చునను నొక యేర్పాటు చేసి, యట్టి
ప్రకృతులకుఁ దెలుఁగువిభక్తులను జేర్చుటలో నుపయోగించు
సుప్తిఙ్విభక్తియోగప్రక్రియ, సంధిసమాసాదిప్రక్రియ మున్నగు
వాని విషయమునమాత్రే మాంధ్రభాషాసహజము లగు నియమ
ములను గొంత విశాలముగా సూత్రించి యుండెను.

(౨౧) ఇట్లు సంస్కృతప్రకృతులను దెనుఁగులోనికి
దెచ్చికొనుటలో సంస్కృతనైయాకరణుల సిద్ధాంతముచొప్పుః
మాఱుమూలశబ్దములను గ్రహించుట కంగీకరింపక ప్రసన్నత
మాలకందములగు ప్రసిద్ధశబ్దములను మాత్రమె రసోదంచిత
కావ్యభాషలో గ్రహింపవలయునను నియమము నీక్రిందిరీతిని
సూత్రించియున్నాఁడు.

శ్లో॥ "విరళాన్ క్వచోపాదిక శబ్దాన్ ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధ మేవ పదమ్"
(ఆంధ్రశబ్దచింతామణి. సం. జ్ఞా. ౨౩. శ్లో).

(౨౧) ఈసందర్భమున సంస్కృతవైయాకరణసిద్ధాంత
మును విశదీకరింపవలసి యున్నది:— వైయాకరణులు
వ్యాకరణములను రచించుటలోఁ బ్రయోగములయం దగపడు
చున్న వ్యాకరణకార్యముల నరయుచు వాని నాధారముగఁ
గొని కొన్నికొన్ని యనుగమములను సూత్రించుచుందురు.
అట్లయినను నాసూత్రము లట్టి లక్ష్యములందే గాక యితర
స్థలములందును (అలక్ష్యములందును) బ్రవర్తించుచుండుట
వింతకాదు. కావుననే సూత్రసాధ్యశబ్దములలోఁ బ్రయుక్తము
లనే ప్రయోగింపవలె ననియు, నప్రయుక్తము లగు
కృతకశబ్దములను బ్రయోగింప రాదనియు, సంస్కృతవైయా
కరణులు సిద్ధాంతము చేసికొనియున్నారు. అట్లయినను
విశాలప్రయోగజ్ఞానము లేని సాధారణపండితు లెచ్చటనో
ప్రయుక్తములై యున్నను బ్రచురములై యుండని శబ్దముల
నప్రయుక్తములనుగా భ్రమించి శంకింపకుండ మహాభాష్యకర్త
యగు పతంజలిభగవానుఁడు "పేచ, ఊష" మున్నగు నూఱు
మూలశబ్దములు నప్రయుక్తములని పూర్వపక్షి శంకించినట్లుగ
శంకించుకొని ప్రపంచమందంతటను వ్యాపించియున్న సంస్కృత
భాషలో నీశబ్దము, లప్రయుక్తములని (నీవంటి సామాన్యుఁడు)
చెప్పుట సాహసమని నిరసించుచు నట్టివానికి వేదమునఁ
బ్రయోగములను జూపెను. అట్టి మహాభాష్యప్రసంగమును బట్టి
యప్పటి .యీసంస్కృతవ్యాకరణమునకు విషయమైయున్న

సంస్కృతభాషలో ననఁగా వైదికకర్మోపయోగి సంస్కృతభాషలోనట్టి మాఱుమూల శబ్దములు సైతము ప్రయోగార్హములే యనుసిద్ధాంత మేర్పడుచున్నదిగదా. (వి-౨౨-౫౩) సంస్కృత కావ్యభాషకుఁ బ్రత్యేకముగ వ్యాకరణములేమింజేసి యట్టి వైదికకార్యోపయోగిసంస్కృతభాషానుశాసనమే కావ్యభాషకు సైత మనుశాసనముగఁగాలక్రమమున నుపచరింపఁబడుచువచ్చుటంజేసి (22-విష) యట్టి మాఱుమూలశబ్దములు ప్రయోజ్యములే యని వ్యాకరణ మంగీకరించుచున్నను నట్టివి రసస్ఫూర్తి ప్రతిబంధకములుగాన (నప్రయుక్తములేగాక) నట్టి యప్రసిద్ధశబ్దములు సైతము కావ్యములలోఁ బ్రయోగింపరాదని కొంద ఱాలంకారికులు నియమింప సాగిరి. కొంద ఱట్టి మాఱుమూల శబ్దములందు వ్యాకరణదోషము లేమింజేసి వానిని గావ్యములందును బ్రయోగింప నంగీకరించుచు వచ్చిరి. పై విషయములకు

"వ్యుత్పన్నమితి గౌడీయై ర్నాతిరూఢ మపీష్యతే."

అను దండ్యాచార్యకావ్యాదర్శకారిక ప్రమాణ మగుచున్నది.

(౨౨) నన్నయభట్టారకుఁడన్నో యాంధ్రమున నట్టిమతభేదములు లేకుండ నట్టి మాఱుమూలశబ్దములు రసప్రధానము లగు నాంధ్రకావ్యములలో నెంతమాత్రమును బ్రయోగార్హములు కానేరవనియు, నట్టివానికిఁ బ్రయోగార్హతను సంస్కృతశాబ్దికు లంగీకరించిన నంగీకరింతురు గాక యనియు సంస్కృతప్రకృతులను దెనుఁగులోనికిఁ దెచ్చికొనుటలో నట్టి

మాఱుమూలశబ్దములను దెచ్చికొనరాదనియుఁ బై విరళానిత్యా
దికారికచే నియమించియున్నాఁడు.

సంస్కృతభాషలోని కృతకశబ్దములను (అప్రయుక్తము
లను) నసాధుశబ్దములను మాత్రమే వైదికకర్మములందుఁ
బ్రయోగించినచోఁ బుణ్యహానియును బ్రాయశ్చిత్తాదులును
సంభవించునని యప్పటి సంప్రదాయమై యుండెను. కాఁబట్టి,
వైదికకర్మోపయోగి సంస్కృతభాషలోనే గాక గీర్వాణ
గ్రంథమునం దేమూలనైనను బ్రయుక్తమై యున్నచో నది
కృతకశబ్ద మనఁగా నప్రయుక్త మనిపించుకొనఁ జాలదు గాన
నద్దానిని వైదికకర్మములందుఁ బ్రయోగించునపుడు పుణ్యహాని
కలుగనేరదని మహాభాష్యకర్త నిర్ణయించెను. అట్లు నిర్ణయిం
చినను నట్టి వైదికకర్మోపయోగి సంస్కృతభాషానుశాసనమునే
కావ్యసంస్కృత విషయమునను ననుశాసనముగ నుపచ
రింపఁ జేసికొనునపుడుమాత్ర మట్టి మహాభాష్యకార నియమ
మును బాటింపరాదనియుఁ, గావ్యములు రసప్రధానములు
గాన వానిలో రసస్ఫూర్తి ప్రతిబంధకములగు నప్రచురశబ్ద
ములు ప్రయోగార్హములు కానేరవనియు, నన్నయభట్టారక
హృదయమై యున్నది. రసప్రధానకావ్యములలో నట్టియప్రసిద్ధ
శబ్దములు ప్రయోగింపఁ బడినయెడలఁ బ్రసన్నత చెడి యర్థ
స్ఫూర్తివిలంబము సంభవించుటచేత సహృదయులకు రసాస్వాద
ప్రతిబంధముసంభవించుననుటకు సందేహములేదుగదా.(౮౭-వి)

(౨౩) నన్నయభట్టారకుఁడు రసప్రధానమగు తనభారత కావ్యము నిర్మాణసందర్భమున గ్రహించు నియమములనే యాంధ్రశబ్దచింతామణిగ రచింపఁ బూనినవాఁడు గాన రసాస్వాదానుకూలప్రసన్నతయే యాతనిచేతఁ బాటింపఁ బడియెను. ఈవిషయమును నన్నయభట్టు తన చింతామణియొక్కయు, భారతభాగముయొక్కయుఁ బ్రారంభములందు స్పష్టముగా వక్కాణించియే యున్నాఁడు.

శ్లో. "స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధ ధియః,
లోకే బహుమన్యంతే ప్రైకృత కావ్యాని చాన్య దపహాయ".
(ఆంధ్రశబ్దచింతామణి. ౨శ్లో).

ఉ. "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్.
(భార. ఆది. ౧ ఆ.

(౨౪) చింతామణికావ్యభాషనుమాత్రమే యనుశాసించుచున్నదని తద్గ్రంథాదిని జేయఁబడిన "విశ్వశ్రేయః కావ్యమి త్యాదికావ్యప్రశంసయు సిద్ధాంతీకరించుచున్నది.

పయిరీతిని సంస్కృత వైయాకరణులయొక్కయుఁ గొందఱు సంస్కృతాలంకారికులయొక్కయుఁ బద్ధతి నంగీకరింపక సంస్కృతప్రకృతులను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనుటలో "సంకేతిత సుప్రసిద్ధ" శబ్దములను మాత్రమే తెచ్చికొనవలయు

నని నియమించిన చింతామణినియమమే యద్దాని యాంధ్ర
వ్యాకరణప్రాథమికావస్థను వేనోళ్ళఁ జాటుచున్నదని చెప్పుటకు
సందేహము లేదు.

(౨౬) అంతకంతకుఁ గావ్యరచనమున రసపారతంత్ర్య
మును వీడి సంస్కృతకవులు యమకశ్లేషాది శబ్దాలంకారప్రచు
రకావ్యములను రచించుచు నచ్చుటంజేసి వానియందు
దుర్వారముగ

„స్యాతా మదోషౌ శ్లేషాదౌ నిహతా ప్రయుక్తతే"

అను నాలంకారిక సూక్తిచొప్పున నప్రసిద్ధశబ్దములు ప్రవే
శింప సాగె నన్న విషయ మెల్లరకును విదితమే. సంస్కృత
వ్యాకరణము కావ్యభాషానుశాసనము కాదన్న విషయమునే
గాక, యావ్యాకరణము నైతము స్వసాధితసర్వశబ్దములకుఁ
బ్రయోగార్హత నంగీకరింపలేదన్న విషయమును బూర్తిగమఱచి
యంతకంతకు సంస్కృతకవులు వ్యాకరణానుశాసనముల
నెల్ల యథేచ్ఛముగఁ బ్రయోగించుట కలవాటు పడసాగిరి.
అట్టివానిని తెనుఁగుకవులును దమకావ్యములలో వాడ
సాగిరి. అట్టికావ్యములలోని వింతవింతశబ్దములకుఁ బ్రయో
గార్హత నంగీకరించి యాంధ్రవైయాకరణులును గావ్యము
లలోఁ బ్రయుక్తములైనపిదప నింక వాని కప్రయుక్తతయు
నప్రసిద్ధతయుఁ గల్పించుట సరికాదని తలంచి వ్యాకరణ
దుష్టములుకాని కవిప్రయుక్తశబ్దములకెల్లఁ బ్రయోగా

భ్యనుజ్ఞ నొసంగసాగిరి. ఇట్టి యభిప్రాయముతోనె వెనుక నుదాహరించిన "విరళానిత్యాది" చింతామణిసూత్రమును నవరించుచు నథర్వణుఁ డీక్రిందిరీతిని సూత్రించియున్నాఁడు. (౨౫-౨౬ విష)

"సర్వేశబ్దాః ప్రయోక్తవ్యా యది దోష వివర్జితాః,
అప్రయుక్తత్వ దోషస్తు నవిరుద్ధో హ రే ర్మతే".

అప్రయుక్తత్వదోషము కృతకశబ్దవిషయకమే గాని యప్రసిద్ధశబ్దవిషయకము కామింజేసి యప్రయుక్త దోష నిరాసపూర్వకముగా వ్యాకరణసాధిత శబ్దములకెల్లఁ బ్రయో గాభ్యనుజ్ఞ నిచ్చుచున్న పై యాథర్వణికసూక్తి కృతక శబ్ద ప్రయోగాభ్యనుజ్ఞా ప్రతిపాదకమే యని చెప్పుటకు సందేహ ము లేదు. ఇఁకఁ గృతకశబ్దములకే యాతఁడు ప్రయోగాభ్య నుజ్ఞను బ్రసాదించునపుడు వ్యాకరణసాధువులు విరళప్రయు క్తములు నగు నప్రసిద్ధశబ్దముల ప్రయోగాభ్యనుజ్ఞ కైమ త్యన్యాయసిద్ధమే యగుటచేతఁ దత్సూత్ర మప్రసిద్ధశ ప్రయోగనిరాసమును నియమించుచున్న "విరళానిత్యాది చింతామణిసూత్రమును నవరించుచున్నదనుట నిర్బాధ మగుచున్నది.

నన్నయభట్టాథర్వణుల పైనిగూఢాశయములను గ హింపక బాలసరస్వత్యహోబలపండితాదులు పై 'విరళా నిత్యాదిసూత్రమును నప్రసక్తముగ నాచ్ఛికశబ్దవిషయ

మునను సమన్వయించి యుదాహరించుట కేవలము ప్రామాదిక
మని విమర్శకులగు విద్వాంసులు గ్రహింతురుగాక.

పై సందర్భమునుబట్టి యాంధ్రశబ్ద చింతామణి
సంస్కృతభారతాంధ్రీకరణ సమర్థముగఁ దెలుఁగును జేయఁగోరి
సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనుటలోని నియ
మముల నుపదేశించుట వానికి సుప్తిఙ్విభక్తులను జేర్చు పద్ధ
తుల నుపదేశించుట ప్రధానముగఁ జేసికొని రచింపఁబడినదగు
టం జేసి యది యాంధ్రకావ్యవాఙ్మయారంభదశలోని దని
సిద్ధాంతిత మగుచున్నది.

(౨౬) ఆంధ్రవాఙ్మయము వెలసినతరువాత రచింపఁబడి
నయాంధ్రభాషాభూషణ కావ్యాలంకారచూడామణ్యా ద్యాంధ్ర
వ్యాకరణములలోఁ బయి నుదాహరించిన చింతామణిలోని
యాదిమావస్థా స్థాపకములగు నేర్పాటులు కానరావు. మఱి
యు వానియందు సాధారణముగ నాచ్ఛికశబ్దవిషయక సూత్ర
ములే యధికసంఖ్యగలవిగను, సంస్కృతసమశబ్దవిషయకసూత్ర
ము లల్పసంఖ్య గలవిగను నున్నవి:—

క. పోఁడిగ బహువచనంబులు, వీఁడనుచో వీండ్రు వీరు వీరలు నయ్యేన్
కాఁడునఁ గాండ్రును గాఱును, వాఁడునకున్ వాండ్రు వారు వారలు నయ్యేన్. ౩౧

క. ఱజ్జిఱంతంబులపై, యుఱ్ఱగు నన్నయును దల్లియును ననుక్రియ నా
యుఱ్ఱంత మొందుచోటుల నుఱ్ఱగునును ముఁడునునందనుండును ననఁగన్.

తే. చేయి వాయి నేయి యనుచుఁ జెప్పుచోటఁ
బ్రీతి చేతులె వాతులు నేతు లయ్యె
బాయి రేయి నేయి యనుచో బాలురేలు
వేలు నా నొప్పు బహువచో వేళలందు. ౭౬

పయిరీతినే, ౭౯, ౯౯, ౧౧౦, ౧౧౨, ౧౧౩, ౧౧౫, ౧౧౭, ౧౨౨, ౧౨౩, ౧౨౪, ౧౨౫, ౧౨౬, ౧౨౮, ౧౨౯, ౧౩౦, ౧౩౪, ౧౪౨, ౧౪౩, ౧౪౪, ౧౪౫, ౧౪౮, ౧౪౯, ౧౫౦, ౧౫౫, ౧౫౬, ౧౫౭, ౧౫౮, ౧౫౯, ౧౬౦, ౧౬౧, ౧౬౨, ౧౬౩, ౧౬౪, ౧౬౫, ౧౬౬, ౧౬౭, ౧౬౯, ౧౭౦, ౧౭౧, ౧౭౩, ౧౭౬, ౧౭౭, ౧౭౮, ౧౮౦, ౧౮౧, ౧౮౨, ౧౮౩, ౧౮౪, ౧౮౫, ౧౮౬, ౧౮౭, ౧౮౮ సంఖ్యలుగల పద్యములం దెల్ల నాంధ్రభాషాభూషణములో నాచ్ఛికశబ్దవిషయక సూత్రములే వెలయుచున్నవి. ఇట్లే కావ్యాలంకార చూడామణియందును జింతామణిశేషమగు వికృతివివేకమునందున నాచ్ఛికశబ్దవిషయక సూత్రబాహుళ్యము వెలయుచున్నది. ఈ మూఁడుగ్రంథములును జింతామణికిఁ దర్వాతి యాంధ్ర వ్యాకరణములలోఁ బ్రాచీనతమములు. తిక్కయజ్వకు సమకాలికమగుటచేఁ బదుమూఁడవశతాబ్దములోని దనఁదగు నాంధ్ర భాషాభూషణములోనున్న పైనివ్రాసిన యేఁబది పద్యముల

లోని యాచ్ఛికలక్షణములు చింతామణిలో స్మరింపఁబడనైన లేదు. ఆంధ్రభాషాభూషణమున నుదాహరణపద్యములను గలిపి నచో ౧౮౯ పద్యములుగలవు. అం దేఁబదిపద్యములకుఁ బైఁగా నాచ్ఛికశబ్దవిషయకసూత్రములే యై యున్నవి.

(౨౭) ఇఁక నాంధ్రశబ్దచింతామణియం దన్ననో రమారమి రెండువందల డెబ్బదియైదుసూత్రములుగ నేర్పడిన తొంబదిరెండు (చూ. బాలసరస్వతీయ పీఠిక) శ్లోకములు గలవు. ఆశ్లోకము లెల్ల లక్షణములే. కాని యం దుదాహరణ ములు లేవు. వానిలో రమారమి పదునేనుశ్లోకములుగ నేర్పడిన యేఁబదిసూత్రములు మాత్రమే యాచ్ఛికశబ్దవిషయకములై యున్నవి. అవియును బైని వ్రాసినరీతిని బ్రచురప్రవృత్తి విషయకములును సందేహనిర్ణయవిషయకములును సంస్కృత శబ్దసామ్యమును జూపునవియును నై యున్నవి. వానిరీతి చదు వరులకు విశదపడుటకయి యిచటఁ గొన్నిటి నుదాహరించు చున్నాను. సంజ్ఞాసంధిసూత్రము లాచ్ఛిక సంస్కృతసమసా ధారణములే తఱుచుగ నగును గాన వాని నీ సందర్భమున ొందును బరిగణింపలేదు.

„వాయురవు ర్వ్యాకృతవాః" (అజంత-౬౭ సూ.)

„క్వచి ద్గకారో నః" (అజంత-౬౮ సూ.)

„ఏదంతతా చనామ్నా మన్యతరస్యా మియాంతానామ్" (అజంత-౫౨ సూ).

"త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్" (హలంత-౨౮ సూ).

(ఇది 'రామునితనము' మున్నగు సంస్కృతసమముల విషయమునఁ జెప్పఁబడినదన్నను ననవచ్చును)

"వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే స్యుః,
క్లీబసమా అమహద్వత్ స్త్రీవత్స్యుః స్త్రీసమా స్సమాస్తు సమాః"
(అజంత-౧౩౧-౧౬ సూ)

"ద్విగుకర్మధారయౌ తత్పురుష ద్వంద్వౌ బహువ్రీహిః
అన్యేచ కేచి దుపమానోత్తరపదలోప రూపకాఖ్యాద్యాః,
పరిదృశ్యా ఇహ కార్యా ఔపవిభక్తికవదంత విధయశ్చ
లోపశ్చ విభక్త్యాదే ర్యద్దేషు స్యా త్సమాసకాంగేషు".
(హలంత-౪౩-౪౫ సూ.)

"ఆత్మ్యాది తత్సమానా మివ దేశ్యానాం క్రియాపదానాం చ
వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు".
(క్రియా-౪౦-౪౯ సూ.)

పయిసూత్రములెల్ల సామాన్యవిధు లగుటంజేసియుఁ బరిచరపవృత్తివిషయకము లగుటంజేసియు వానిని జెప్పినం తమాత్రమున నాచ్ఛికవిషయపాధాన్యము తోఁచనేరదు.

(౩౦) సంస్కృతప్రాకృతవర్ణసమామ్నాయములు సుప్రసిద్ధము లగుటంజేసి వానిని జెప్పక యచ్చాంధ్ర వర్ణసమామ్నాయమును మాత్రమె చెప్పుట సైతము విరుద్ధము కానేరదు. అట్లు చెప్పుటచేత సంస్కృత సమశబ్దములలోను సంస్కృత సమాసములలోను వ్యవహారవాసనావశమునను

బ్రమాదవశమునను బడిన యచ్చాంధ్రవర్ణములను దెలిసి కొని సవరించుకొనుట కవకాశము గల్గును. అట్లే యచ్చాంధ్రపదములలోఁ బ్రమాదపతితము లగుచున్న యనాంధ్ర వర్ణములను దెలిసికొని వానిని సవరించుకొనుటకును వీలు పడును. కాఁగాఁ జింతామణిలోని యచ్చాంధ్రవర్ణసమామ్నాయమాత్ర పారాయణము సైతమొక సామాన్య సూత్రమువంటిదే యగుచున్నది.

(౨౯) ఇఁక రెండుస్థలములలో మాత్రమె యాచ్ఛికప్రాతిపదికములకు సుబ్విభక్తిమేళమునందలి ప్రక్రియ సూత్రింపఁబడినది. వానిలో నొకటి "నీ, నా, తా, మన" శబ్దముల రూపసాధనప్రక్రియ. రెండవది "మ్రాను, విల్లు, ఆలు, ఊరు, పాలు, త్రాడు, పాటు, రోఁకలి" అనువానిజాతిగల యాచ్ఛికశబ్దముల రూపసాధనప్రక్రియ. వీనిలో నీ నా తా మన శబ్దములయొక్కయు, మ్రాన్వాదిశబ్దముల యొక్కయు, విభక్త్యంతరూపములు వివిధరూపములతో వాడుకలో నుండుటంజేసి కావలయు వానిలో నెవ్వి గ్రాంథికములుగా నంగీకరింపఁ దగునో యనువిషయమును విశదీకరించుటకయి పై యాచ్ఛికశబ్దరూపసాధనప్రక్రియ సూత్రింపఁబడినదని గ్రహింప నగును. మఱియు నీప్రక్రియ, వాడుకలోనున్న వివిధరూపములలో గ్రాంథికములుగా నంగీకరింపఁ దగినవానిపద్ధతిని సైతము విశదీకరింపఁ జాలియున్నది.

(30) ఇంక "త్రాడ్లు" మున్నగువాని రూపసాధన ప్రక్రియయొక్క యావశ్యకతను విమర్శించుటకన్న మున్నగ నన్నయభట్టారకుని కాలమునాఁటి లకార భేదముల లేఖ నోచ్చారణముల పద్ధతిని జూపుట యావశ్యకమని తోఁచి యాపద్ధతి నిట ముందుగఁ జూపుచున్నాను.

"లఘువో లఘువ శ్చేతి ద్వేధాంతస్థా న్వదంతి శాస్త్రారః,
అన్యైన్య వ్యాకరణ స్పష్టా ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః",
(ఆంధ్రశబ్దచింతామణి. సంజ్ఞా.)

యరలవలు లఘువులు నలఘువులు నని రెండువిధము లనియు, నందు యలవల లఘ్వలఘుత్వములు సంస్కృత ప్రాకృతములందుఁ బ్రసిద్ధములే యనియు, రేఫమునకును నాంధ్రమునం దట్టి ద్వైవిధ్య మంగీకరింపఁ బడుచున్నదనియుఁ జింతామణికర్త పైశ్లోకముచే నుపదేశించి యున్నాఁడు.

"వ్యో ర్లఘుప్రయత్నతరశ్శాకటాయనస్యేతి పాణినీయ వ్యాకరణ సూత్రే యవయో ర్లఘ్వ లఘుభేదేన ద్వైవిధ్యం స్పష్టమ్. యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం స లఘూచ్చారణః, యస్యోచ్చారణే తేషా మశైథిల్యం సగురూచ్చారణ ఇతి శాబ్దికానాం రాద్ధాంతః లస్య ద్వైవిధ్యంలోకే ఇతి వాల్మీకిసూత్రే స్ఫుటమ్." (అహో. ౧౪౭పుట

అని యిట్లు పై చింతామణివిషయములకు మూలమును జూపుచు నహోబలపండితుఁడు లఘ్వలఘూచ్చారణముల స్వరూపమును నిరూపించియున్నాఁడు.

నన్నయభట్టారకునినాఁటికి రలల లఘ్వలఘూచ్చారణ భేదములు మాత్రము పండితుల వాడుకలోఁ బ్రసిద్ధములై యుండుటచేతఁ గావలయు నాతఁ డట్టి రలల యలఘుధ్వనులను లిపితో గుఱితించుటకై "దంత్యచజౌ గురురలౌచ బిందుయుతౌ" అని యి ట్లక్షరాకార నిరూపణసందర్భమునఁ జింతామణిలో లఘు రలల లిపిపై నొకబొట్టును బెట్టవలెనని సూత్రించెను. ఇ ట్లలఘురలల నుపదేశించియు, నచ్చాంధ్రవర్ణసమామ్నాయము నుపదేశించుటలో "యరలవసహాళం తు హల్వర్గః" అని యిట్లు ళకారమును మాత్రము వేఱుగఁ బరిగణించియున్నాఁడు. శకట రేఫమును వేఱుగఁ బరిగణింపక ళకారము నొక్కటిని వేఱుగఁ బరిగణించినస్వారస్యముచేత నాతఁ డలఘురలల కచ్చాంధ్రవర్ణ సమామ్నాయమునఁ బృథగ్గణనము చేయలేదనియు, నందు వేఱుగఁ జేర్కొనఁబడిన ళకారము వర్ణాంతరమని యాతఁడు తలంచియుండుననియును గ్రహింపక తీరదుగదా. ఈ సందర్భ మునుబట్టి యలఘులకారము వేఱనియు, దానికిఁ జాలవఱకు న్నిహితమైన యుచ్చారణముగల వర్ణసమామ్నాయగత కారము వేఱనియు లఘులకారమెట్లును వేఱేయనియు, నిట్లు నికిఁ ద్రైవిధ్యము విశదమగుచున్నది. ఈవిషయమున నన్నయ నట్టు కర్ణాటసంప్రదాయమును గొంతవఱ కనుసరించిన ట్లగ పడు చున్నది. కన్నడమున ళకారము మూఁడువిధములు:—

''లకారస్థానికాః క్షళాః. ఆదాడిమస్ఫటికాద్యన్యస్థానికాః, గణపతితా పృఅళాః. శేషాస్సర్వేకుళా ఇతి.''

(కర్ణాటకశబ్దానుశాసనము. ౧౮౦ సూత్రపువ్యాఖ్య.)

కావుననే కీర్తిశేషులగు పరవస్తు చిన్నయసూరిగారు తమ బాలవ్యాకరణమున నీక్రిందిరీతిని వ్రాసిరని గ్రహింపనగును.

''ఏళులు, పాళులు, త్రాళు లని బహుత్వమందు రలడల కాదేశమైన ళకార మలఘువు. తల నెల యిత్యాదులందలి లకారము లఘువు...... వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరము గాని యలఘు ళకారము కాదు.'' (బాలవ్యా. సంజ్ఞా-౧౫ సూ.)

పై చిన్నయసూరిగారియభిప్రాయమునె యంగీకరించుచుఁ గీర్తిశేషులగు బహుజనపల్లి సీతారామాచార్యులవారు సైతము తమ ప్రౌఢవ్యాకరణమునందు ''యవలలవలె రేఫ బును బ్రయత్నభేదంబుచే ద్వివిధంబు గాన శబ్దశాసనాదు నలఘురేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె'' (త్రిలి సంజ్ఞా. ౧. సూ.) అని యిట్లు వ్రాసియున్నారు.

(౩౧) పైరీతిని బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణకర్త చాలవఱకు నన్నయభట్టారకాశయమునకు సరిగ వ్రాసినను : దలి ''బహుత్వమునందు రలడల కాదేశమైన ళకార మలఘుః అనువాక్యము మాత్రము నన్నయభట్టారకాభిప్రాయానుకూ ము కానేరదని చెప్పక తీరదు. నన్నయభట్టు బహుత్వము లడలకు నలఘులకారము నాదేశించియే యుండలేదు. రేఫ

స్థానమున సైతము లకారమాత్రమునె యాదేశించియుండెను. అట్లయినను రలల లఘుత్వాలఘుత్వములు పండితవ్యవహార మాత్రవేద్యము లని (సంస్కృతమునందు వలెనె) యాతని సిద్ధాంతమైయుండుటచేత నట్లు రేఫస్థానమునను నాదేశముగా వచ్చిన లకార మలఘూచ్చారణము గలదనుట విరుద్ధము కానే రదు. అట్టి సిద్ధాంతముచేతనే యసంయుక్తావస్థలో లఘూచ్చారణమె గల యచటి బహువచన లు ప్రత్యయలకారము "ఊళ్లు (ళ్ళు)" మున్నగుసంయుక్తస్థలములలో నలఘూచ్చారణమునందుట, యవిరుద్ధ మగుచున్నది. అసంయుక్తావస్థలో సైతము "కాలులు, కాలులు" అని యిట్లు లఘుత్వాలఘుత్వములు రెండును వెలయుచుండుటయు, నా రెండిటిసంయుక్త రూపమగు "కాల్లు" అనుచోట రెండు లకారములును నలఘువులె యగుచుండుటయుఁ బై సిద్ధాంతముచేతనే నిర్బాధములగుచున్నవి. నన్నయభట్టుకాలమున "త్రాడ్లు" అనియే యుండుటచేతఁ దద్విషయ మీసందర్భమునఁ బ్రసంగింపవలసిన ప్రసక్తియే లేదు.

వర్ణసమామ్నాయగత ళకారము మూర్ధన్యము. అనఁగా నించుక మడిచిన నాలుకతుదిభాగము మూర్ధమును దాఁకుట చేత జనించునది. లఘులకారము దంత్యము. అనఁగా నాలుక తుదిభాగము దంతమూలములను దాఁకుటచే జనించునది. అలఘులకారము సైత మిట్టిదియె. కాని లఘులకారోచ్చారణమున

ఱహ్వాగ్రము దంతమూలస్థానమును శిథిలముగాఁదాఁకును. అల
ఘు లకారోచ్చారణమున నశిథిలముగాఁ దాఁకును. అట్టి యశిథి
లస్పర్శమున జనించు నలఘులకారము కాలక్రమమున నపభ్రష్ట
ము గుచు వర్ణసమామ్నాయగత మూర్ధన్య ళకారోచ్చారణము
నకు సన్నిహితముకాఁజొచ్చెను. నన్నయభట్టునాఁటికి నేఁటివలెఁ
గాక కొంతభేద ముచ్చారణములో వెలసియుండెను. కావుననే
నన్నయ యలఘులకారమును వేఱుగ గణింపక మూర్ధన్య
ళకారమును మాత్రమె వేఱుగ గణించినవాఁ డయ్యెను.

(3-౨) పై రీతి నుచ్చారణ సాన్నిధ్య ముండుటచేతనే యల
ఘులకారమున కలఘు రేఫముతో పాటుగ "దంత్యాచజౌ గురు
శౌచ బిందుయుతౌ" అనియిట్లు లిపి నుపదేశించియు నన్నయ
భట్టు వర్ణసమామ్నాయగత ళకారమునకు వేఱుగ లిపి నుప
దేశింపఁ డయ్యెను. అట్లాతఁ డేర్పాటుచేసినను గతానుగతికము
గా వర్ణసమామ్నాయగత ళకారమునె గాక యలఘులకార
మును పైత నాంధ్రకర్ణాటసాధారణలిపిలోఁ బ్రసిద్ధమైయున్న
'ళ'అనునాకారముతోనే వ్రాసెడియాచారమె నిలిచెను. అట్లె
యలఘు రేఫము నయితె నాంధ్రకర్ణాటసాధారణలిపిలోఁ బ్రసిద్ధ
ముగు "ఱ" అనెడి లిపితో వ్రాయు నలవాటె నిల్చెను గాని
నన్నయలిపి పద్ధతి వాడుక కెక్కలేదు.

అట్లయినను ముందు వివరింపఁబోవురీతిని 'ఊరు' మున్నగు శబ్దములందలి రేఫముచోలకారము నాదేశించి 'కాలు' మున్నగు వానిలో ళకారము నాదేశింపమింజేసి "ఊళ్ళు, కాళ్ళు," మున్నగు ప్రసిద్ధశబ్దములలోనివి మూర్ధన్య ళకారములు కావనియు నవి యలఘులకారములనియు వాని యలఘుత సంస్కృతమునం దువలెనే వ్యవహార గ్రాహ్యామనియు నట్టియలఘుత "దంత్యాచజౌ గురురలౌచ బిందుయుతౌ" అను సూత్రముచే నన్నయ యంగీకరించుచున్నాఁడనియు సమన్వయింపక తీరమింజేసి "దంత్యచజా" విత్యాదికారిక ప్రక్షిప్తమనుటకు వలనుపడదు. అట్లే చింతామణిలోని లిప్యుద్ధారకకారికలును ప్రక్షిప్తములు కావనక తప్పదు. లేఖకసామాన్య మిట్లు పండితసంప్రదాయము నుల్లంఘించుట వింతకాదు.

"పూర్ణార్ధ భేదతో ద్వివిధః" "దీర్ఘాచ్చే త్ఖండ ఏవ సజ్ఞేయః"

అని యిట్లుగ నర్ధఖండశబ్దములతో నన్నయభట్టారకుఁడును

"పూర్ణేందుసదృశః పూర్ణస్త్వర్ధస్త్వర్ధేందు సన్నిభః"

అని యిట్లు కంఠోక్తముగ నథర్వణాచార్యుఁడును

"......నిడుపులమీఁది బిందు లరబిందులగున్."

అని యి ట్లరశబ్దముతో నాంధ్రభాషాభూషణకర్త యగు కేతనయు (౧౨౫౦ ప్రాంతమువాఁడు) "ఁ" అనెడి యర్ధబిందు లిపిని నిరూపించియున్నను ప్రాచీనతాళపత్రమాతృకాలేఖకు లును శాసనలేఖకులును మాత్ర మట్టి పండితసంప్రదాయము

నుల్లంఘించి లేఖకపరంపరాయాతమగు నలవాటుచొప్పున నర్ధ
బిందువుచోట నయితము పూర్ణమునే వ్రాయుచు నిండుసున్న
కు వ్యావర్తకముగఁ బరాక్షరమునకు లేనిపోని ద్విత్వమును
వ్రాయుచు (చేయంగ=చేయఁగ; చేయంగ్గ=చేయంగ;) నుం
డుట ప్రాచీనలిపి పరిశోధకులకెల్లఁ దెలిసిన విషయమె గదా.
అట్లే చజలదంత్యతను సైతము "దంత్యచజౌ గురురతౌ చ
బిందుయుతౌ" అనుచొప్పున "చ జ"ల మీఁద నొకబొట్టు
వ్రాసి గుఱితింపనగునని నన్నయభట్టారకుఁడు చెప్పియున్నను
నట్టి లేఖనపద్ధతిని లేఖకసామాన్య మపేక్షించి మఱపింపఁగాఁ
దరువాతిపండితు లట్టిదంత్యతను "ఽ" అను దంత్యతకారపు
గుఱుతుతో సూచింపవలెనను నియమమును జేసికొనుటయు
నదియు నానాఁటి కుపేక్షితమగుచు వచ్చుటయు లిపిపరిశోధకు
లెఱుఁగనిది కాదు.

(33) ప్రకృతమనుసరింతము:—ఇప్పుడు వాడుకలోనున్న
"త్రాళ్ళు" మున్నగురూపములు నన్నయభట్టారకుని కాలమున
"త్రాడ్లు" మున్నగురూపములతోనె పండితవ్యవహారములో
నుండెడివి. "త్రాళ్ళు" మున్నగు నాధునికరూపము లప్పుడనాగ
రక భాషలో నిప్పటి "పళ్ళు" (పండ్లు) మున్నగువానివలెనె
వాడఁబడుచుండెడివని తలంపవలసి యున్నది. కావుననె నన్న
యభట్టారకుఁ డట్టిరూపములను ననుశాసించు సందర్భములో
"త్రాళ్ళు" మున్నగురూపముల నుపేక్షించి "త్రాడ్లు" మున్న

గురూపములకే గ్రాంథికతాయోగ్యత నంగీకరించి వాని ప్రక్రియను సూత్రించియుండెను. (Nel. ins R. 3౬ గుడ్లు ౧౨౪౯ పుట. ౧౧౨౯ పుటలో మాామిడ్లు.)

"డలటా ముదితాం తస్య చ వా లుక్."

అని యిట్లు 'తాొడులు' మున్నగువాని కుల్లోపమును మాత్రము చెప్పెను గాని యచటి డకారమున కధునాతనులవలె లత్వమును విధింపలేదు. కాని యావఱ కనాగరకభాషలో నున్న లత్వము తరువాతఁ బండితవ్యవహారములోనికిని వచ్చుటచేతఁ గావలయుఁ దరువాతికవు లట్లు ప్రయోగించుటయుఁ దదనుసారముగఁ దర్వాతి వైయాకరణు లట్టి రూపములకు సాధుత్వమును బ్రసాదించుటయు సంభవించెను. ఇట్టి ప్రకృత ప్రక్రియాసంస్కారము మనస్సున నాటిన యాధునిక పండితులు నన్నయభట్టారకునకు సైతము "తాొడులు" మున్నగుచోట్ల డకారస్థానమున లత్వము సమ్మతమే యని భ్రమించి

"రలయోర్లడయో స్తద్వ ల్లశయోశ్శసయో రపి, వబయో ర్ణన యోశ్చాంతే సవిస ర్గావిసర్గయోః, సబింనుకాబింనుకయో స్స్యా దభేదేన కల్పనమ్." [ఆహో. ౧౩౭ పుట.]

అనునది మొదలగుసంప్రదాయములచోప్పున లడలయభేదము నాశ్రయించి యచట లత్వమును సంపాదించుచు నట్టియభిప్రాయముతోనే నన్నయభట్టారకుఁడు సైత మచట లత్వమును విధించియుండలేదని తలఁచుచు వ్యాఖ్యానములు చేయసాగిరి.

«పాడి-పాళ్ళు; తడి-తళ్ళు; జడి-జళ్ళు. త్రాడులు-త్రాళ్ళు...లడ ళానామభేదాభిధానా ద్రూపమేతత్." [అహో. ౩౧౦ వ పుట.]

నిజముగా నన్నయభట్టారకునకే యచట లత్వము (ళ) సమ్మతమైనచో «ఊరు» మొదలగుచోటులలోని రేఫమునకు «రోలః» అనుసూత్రముచే లత్వమును విధించినట్లే «త్రాడు» మున్నగుచోటులలోని డకారస్థానమున నయిత మాతఁడు లత్వమును విధించియుండఁడా? ఇఁక వారు తలంచినట్లుగ నిచట నన్నయభట్టు లడలకుఁగల యభేదాభిప్రాయముచే లత్వమును బ్రత్యేకముగా విధింపఁడయ్యెనేని యట్టి యభిన్నత రలలకును బైకారికలలో నభిహితమే యగుటచేత «రోలః» అని రేఫమునకుమాత్రమేల, లత్వమును విధించియుండును? వేయేల చింతామణి «త్రాళ్లు» అనుచోట «ళ్ళు» అనురూపమును సాధింపఁకుండుటచేతనే యథర్వణాచార్యుఁడు,

« కైకృతానాం లుకిభవే ల్లడయో రేకరూపతా»

అని యిట్లు 'ళ్ళు' అను దానితోనున్న తనకాలపుఁ బ్రయోగములకుసరిగాఁ జింతామణిని సవరించుట కటస్థించెనని విమర్శకులగు విద్వాంసులు గ్రహింతురు గాక. కాఁగా «ఊరు» మొదలగు రేఫాంతశబ్దములకు మాత్రమె బహువచనములోని లత్వము నన్నయభట్టారకాభిప్రేతమనియు «త్రాడు» మొదలగు డాంతశబ్దములందు బహువచనమునందలి లత్వము

నన్నయభట్టారకసమ్మతము కాదనియు నచటిచింతామణిసూత్ర
సందర్భము స్పష్టపఱుచుచున్నదనుటకు సందేహము లేదు.
ఇప్పటి వ్యాకరణములకు సరిపెట్టఁబడిన నన్నయభారతభాగ
ములో నైత నెచ్చటను "త్రాళ్ళు" మొదలగు ద్విరుక్త
లకార (ళ) రూపములను స్థాపించుప్రయోగములు లేవు.
ప్రాచీనశాసనములలో "త్రాళ్లు" మొదలగునీలిని లలసంయుక్త
రూపములె వెలసియుండుట శాసనపరిశోధకుల కెల్ల విదితమె
గదా.

(౩౮) బాలవ్యాకరణ కర్తగారు 'త్రాళ్ళు, కాళ్ళు'
మున్నగు చోటులందలి సంయోగాదిస్థిత శబ్దావయవ 'డ, ల'
స్థానమున మాత్రమె యలఘులకారమును విధించి ప్రక్రియను
సూత్రించి యున్నారు. బహువచన లుప్తత్వయలకారస్థాన
మున (కాళ్ళు మున్నగుచోట్ల) నలఘులకారమును నన్నయ
భట్టారకుఁడు సమ్మతింపలే దనుకొని కాఁబోలును
సూరిగారు సైతము బహువచనలకారమునకు నలఘుత్వ
మును సూత్రింపరైరి. అట్టియెడల, సంయోగములో మొదటి
లకారము నలఘువుగాను, దాని నవ్యవహితోత్తరవర్తి
యగు లకారమును లఘువుగాను బలుకుట దుష్టట మనియు,
నది ముఖయంత్రస్వభావమే కాదనియు, నాలోచింపకుం
డుట మిక్కిలి వింతగా నున్నది. రలల, లన్వలఘూచ్చారణ
ములు మాఱుచుండుననియు, నవి పండితవ్యవహారమాత్ర

వేద్యము లనియు, నకారణమున లఘులకారస్థానమున నలఘు లకారాదేశము చేయుట నన్నయభట్టస్వారసము కాద నియు, వా రాలోచింపకుండుటచేత నిట్టిప్రమాదమునకుఁ బాల్పడవలసివచ్చెనని గ్రహింప నగును.

(౩౫) పైసందర్భమునుబట్టి చింతామణికర్త యవలకు వలెనే రేఫలకారములకును లఘ్వలఘుభేదములనుబట్టి పృథగ్వర్ణతాకల్పనము నంగీకరింపలేదనియు, ననఁగా వర్ణసమామ్నాయమున నలఘురలలను వేఱుగఁ బఠింపలేదనియు సంస్కృతాది సంప్రదాయముచొప్పున యవలవిషయమునందువలెనే లకార విషయమునందును గలయుచ్చారణభేదమును గణింపక శబ్దాలంకారాపరావతార మనఁదగు యతిప్రాసమైత్రిని లఘ్వలఘువుల కంగీకరించి "నాన్యేషాం వైధర్మ్యమ్" అని సూత్రించె ననియు గ్రహింపవలసియున్నది. నన్నయకాలమునకు రేఫఱ కారములందు లఘ్వలఘుతామాత్రభేదము నిల్చియున్నను బ్రాచీనతమ కాలమున ఱకారోచ్చారణము 'ట్ర' అన జాతీయధ్వని కల్గియుండుటం జేసి ప్రాచీన ద్రావిడపంచ కవులు (నన్నయాది) రేఫఱకారమైత్రిని బొత్తిగా నిరసించిరి. (కుఱు-తమిళ- కుట్రుయిర్ = (కుట్రియిర్ అని ఉచ్చరింతురు) తెల్గు-కుట్టుసురు. ఊఱు-తమిళ-ఊట్రు ('ఊట్రు' అని పల్కుదురు) తెల్గు-ఊట. తమిళమున కేవలఱకారమున లేకున్నను ద్విత్వఱకారమున నేఁటికిని 'ట్ర' కారోచ్చారణము వెలసియే యున్నది. లళల కింతటిగొప్పభేద మెన్నఁడును లేదు.

(౩౬) పై రీతినున్న నన్నయభట్టారకుని గభీరాశయములను గ్రహింపక, క్కాకునూర్యప్పకవి, "యరలవసహాళ" మ్మని యిట్లు వర్ణాంతరముగ నంగీకరింపఁబడిన ళకారముతో సరిగఁ దుల్యన్యాయమున శకట రేఫముసైతము వర్ణాంతరముగ నంగీకరింపఁబడుట యుక్తమని యెంచి యాంధ్రవర్ణసమామ్నాయమును ముప్పదియేడు చేసి "సప్తత్రింశదిహాన్యే" అనియు "యరయుగలయుగవసహాశ్చహాలః" అనియుఁ జింతామణి పాఠములను గల్పించుసాహసమునకు సమకట్టెను. పయిసందర్భమునుబట్టి యప్పకవిపాఠములు కల్పితము లనియు, నన్నయ ప్రోక్తములు కావనియు విశదము కాక మానదుగదా.

(౩౭) ఆంధ్రశబ్దచింతామణి "త్రాళ్లు" మొదలగు ప్రాచీనరూపములను మాత్రమే సాధించుటయు, "త్రాళ్ళు" మున్నగు నాధునికరూపములను సాధింపకుండుటయు 'కాళ్లు' అనురూపమిష్టమయ్యును నలఘులకారాదేశము చేయకుండుటయు నలఘులకారమును వర్ణసమామ్నాయగత ళకారమును విభిన్నములుగఁ దలంచుటయు మున్నగు విషయములెల్లఁ జింతామణి యథర్వణ కేతనాదుల గ్రంథములకన్నఁ బ్రాచీనమనియు నక్కారణమున నన్నయకృత మనుట యుక్తమనియు సమర్థింపఁజాలి యున్నవి గదా.

(౩౮) "త్రాడ్లు" మొదలగుచోటులందలి డకారస్థానమున లత్వమును "వైకృతానాం లుకి భవే ల్లడయో రేక

హపతా" అని యథర్వణాచార్యుఁడు సూత్రించుటచేత నాతని
ాలమునాఁటికి "త్రాళ్లు" మొదలగు రూపములు గ్రాంథికతా
స్థ నందినవని విశద మగుచున్నది. అథర్వణాచార్యుఁడు
త్రాడు" మున్నగు డ్వంతశబ్దములతో పాటుగ "కాలు"
ున్నగు ల్వంతశబ్దములకును బహుత్వమున సలఘు లకార ద్వి
రూపమును సాధించుటకుఁ బ్రత్యేకాదేశకల్పనము చేయకుం
ంట నరయఁగా నాతఁడు, లకారముయొక్క యలఘుత్వము
ండితవ్యవహారమాత్రసిద్ధమే యగుననియు నద్దానినిఁ బ్రత్యేక
ుగా విధింప నక్కఱ లేదనియుఁ దలంచెడి నన్నయభట్ట
ద్ధాంతమును గ్రహించి 'కాళ్లు' మొదలగు ల్వంతశబ్దముల
హువచన రూపములు చింతామణిసాధ్యములుగా గ్రహించె
నియు సలఘు లకారమును లకారముపైనుంచిన బొట్టుచేత
దంత్యచజౌ గురురతౌ చ బిందుయుతౌ" అను చింతామణి కారిక
ొప్పిన గుఱితించెడి సంప్రదాయమును సమ్మతించెననియు
శద మగుచున్నది.

తిక్కనకు సమకాలపువాఁడగు కేతనమంత్రి సైతము తన
ంధ్రభాషాభూషణములో "తాళ్ళు" మున్నగు రూపము
ను సాధించియున్నాఁడు. అట్లయినను నాతఁడు "ఊరు,
ాడు" మున్నగు ర్వంత డ్వంతశబ్దములతో పాటుగ "వేలు"
న్నగు ల్వంతశబ్దములకును బ్రత్యేకాక్షర ద్విత్వరూప
ళ్ళుట్లు" ను విధించుటం జేసి పైనుదాహరించిన చింతామణి

సిద్ధాంతమును గ్రహించిన ట్లగపడదు. ఇఁక నాంధ్రకర్ణాటలిపి లోని 'ళ' అనుదానితోనె వర్ణసమామ్నాయగత వర్ణాంతర 'ళ'కారముతోపాటుగ నలఘులకారమును గుఱితించెడి యభిప్రాయముతో నుండె ననియు నాతని ప్రక్రియ విశదీకరించుచున్నది.

క. "రులు డుడు లంత్యము లైనన్
లులఁ నడఁచి తదంత్యములకు ళ్ళగు బహుతన్
బలుగోళ్ళనఁ గొనవ్రేళ్ళనఁ
గలగూళ్ళు లేళ్ళు నాఁగఁ గ్రమమై యునికిన్."
(ఆంధ్రభాషాభూషణము. ౭౭ ప.)

తే- గీ. "......చోళ్ళు నసువులు పెసలని చెల్లఁగాన."
(ఆంధ్రభాషాభూషణము. ౭౯ ప.)

పైపద్యములచేతఁ గేతనమంత్రి "గోళ్లు, వ్రేళ్లు, కూళ్ళు, లేళ్ళు" అను నాల్గుస్థలములందును రెండేసి ళకారముల సంయోగమును విధించె నని స్పష్టపడుచున్నది. ఈసందర్భమునుబట్టి యాతఁడు నన్నయాథర్వణుల గ్రంథములను జూచి యుండలేదనియుఁ జూచియే యున్నచో నిట్లశాస్త్రీయముగ నలఘులకారమును బృథగ్వర్ణముగా నాదేశించియుండఁడనియు విశదమగుచున్నది.

(౩౯) పై నుదాహరించినరీతి నాంధ్రశబ్దచింతామణి సాధించిన దేశ్యశబ్దబహువచన సాధన సందర్భమునందలి

“ఏండ్లు, త్రాడ్లు” మొదలగు ననేకరూపములందుఁ గల డల సంయోగములెల్ల “ఏళ్ళు, త్రాళ్ళు” అనురీతిని నలఘు లకార ద్వయసంయోగములుగా మాఱినను నందు స్థిరపరకబిందువు తెల్గున నుండఁబోదను సిద్ధాంతము చొప్పునఁ దరువాతి మహాకవులును వైయాకరణులును బిందుపూర్వకములు కాని స్థలములగు “త్రాళ్ళు” మున్నగు చోటులలోని యలఘు లకారద్వయసంయోగమునకు మాత్రమె గ్రాంథికతాయోగ్యత నంగీకరించిరని విమర్శకులగు విద్వాంసులు గ్రహింతురుగాక.

(౮౦) పై నుదాహరించిన రీతిని జింతామణిలోని యాచ్ఛికశబ్ద బహువచనరూపసాధనప్రక్రియ ప్రచుర ప్రయోగమాత్ర విషయకమును, వ్యవహారస్థరూపములలోనుండి గ్రాంథికతాయోగ్యత నంగీకరింపఁ దగినరూపముల నిరూపించునదియు నగుటచేతఁ జింతామణియొక్క సంస్కృతసమశబ్దానుశాసన ప్రధానతకు విప్రతిపత్తి లేదు. ఇట్లే యాక్రింది సంజ్ఞావిధానములు సైతము సందేహనిర్ణయమాత్ర ప్రయోజనములగుచు నిర్బాధము లగుచున్నవి.

“అద్దంత్యా స్తాలవ్యా శ్చు ర్యకర్ స్స్యా న్మిథస్సవర్ణశ్చ”
(ఆంధ్రశబ్దచింతామణి. సంజ్ఞా. ౨౬.

“దంత్యచజ లత్వవిశిష్టములై యుండును. తాలవ్యలెత్వవిశిష్టములై యుండును.” అని పై సూత్రమున కర్థమ

లఘ్వలఘువులగు సంతస్థముల మైత్రిపరిసంగమున దంత్యతాల వ్యచజలమైత్రిని జూపుట కీసందర్భ మారంభింపఁబడినది.

'చేఁద, జేన' మున్నగు శబ్దములలోని నేకాక్షరమునం దలి యజ్ఝల్లులు రెండును దాలవ్యములయి యుండునప్పుడు వాని యుచ్చారణము శ్రమాపాదకమై యుండును గాన సుఖ ముఖోచ్చారణమును గోరు లోక మట్టివానిని బలుకుటలో నచ్చగు "ఎత్వమును" అత్వముగ నుచ్చరించుట సహజము. కాఁగా "చేఁద, చేట, చేఁప, జేన" మున్నగు చోటులందు "చాఁద, చాట, చాఁప, జాన" అను నుచ్చారణములు కల్గి యనిష్టరూపములు సంభవింపఁగా నట్టిచోటులందలి సాధ్వసాధు శబ్దసందేహమును దీర్చుటయే యీసూత్రము నారంభించుట లోని ముఖ్యోద్దేశమై యున్నది. అట్టియెడల నీసూత్రి మీఁ కిందిరీతిని సాధుశబ్దనిర్ణయమును జూపుచున్నది.

ఉచ్చారణమునం దెచటి 'చజలు' తాలవ్యములుగా నుండునో వానిపైని "ఎత్వ"మున్నదని యెంచుట సాధువగు ననియు, నెచటి చజలు దంత్యములుగాఁ బలుకఁబడునో వాని పైని "అత్వము"న్నదని యెంచుట సాధువగుననియు నీసూత్ర ము నిర్ణయించుచున్నది. కాఁగా "చాఁద, చాట, చాఁప, జాన" మున్నగు స్థలములలోని చజలు తాలవ్యములుగాఁ బలు కఁబడుచున్నవి గాన నవి "ఎత్వ" విశిష్టములె యని సిద్ధాంతి తమగుచున్నది. అయ్యవి 'అత్వ' విశిష్టములయి యుండుటయే

సత్యమైనయెడల "చాప, చందురుఁడు, జాము" "మున్నగువా నివలెనె పలుకఁబడుచు నుండవలసి యుండునుగదా" అని పరిశీలించుకొనవలెనని యీసూత్ర మువదేశించుచున్నది. ఇట్టి నన్నయభట్ట నిగూఢాశయములను గ్రహింపఁజాలక యాతఁడీ సూత్రమును "చజ"ల యుత్పత్తిస్థానములను జూపుటకు మాత్రమె యారంభించె ననుకొని యట్లు సూత్రించుటలో నీ చింతామణి సందర్భము పరిపూర్ణము కాదనియు, మిగుల నసమగ్రమనియుఁ దలఁచి యాధునికు లీక్రిందిరీతిని సూత్రింప నారంభించిరి.

"ఇ ఈ ఎ ఏలం గూడిన చ జ లు తాలవ్యంబులు" రా.

"అ ఆ ఉ ఊ ఒ ఓ ఔలం గూడిన చ జ లు దంత్యములు." బా.

"సంస్కృతసమములం దకారాంతము లైనశబ్దముల యుపధా చ జ లు బహువచనము పరంబగునప్పుడు దంత్యము లగును." ౧౧ సూ (తాలవ్య సంజ్ఞా)

(౪౧) వర్ణసమామ్నాయమునందలి తక్కినవర్ణముల యుత్పత్తిస్థానములను జెప్పక యిట్లు చజల యుత్పత్తిస్థానముల విషయమును మాత్ర మేల చెప్పవలయునో తెలియరాకున్నది. ఇతరస్వరములతోఁ గూడియున్నప్పటి చజల దంత్యతాలవ్యత లుచ్చారణమునుబట్టియె యసందిగ్ధముగఁ దెలియుచుండును. మఱియు నవి వ్యవహారవశమున నెట్టి యపభ్రష్టతను బొందియుండ లేదు. కావునఁ దక్కినస్వరములతో నుండు

నప్పటి చజల దంత్యతాలవ్యతలను బ్రత్యేకముగఁ జెప్పుట యప్రసక్తమనుటకు సందేహము లేదు. ఇఁక వీరనుకొనిన యుత్పత్తిస్థానములను బారాయణముచేయుటకే నన్నయభట్టు "అద్దంత్య" ఇత్యాది పై సూత్రముల నారంభించెనన్నచో వక్ర మగు "ఓత్వము" తోఁ గూడిన చజలుసయితే మీసూత్ర ముచేఁ దాలవ్యములే కావలసివచ్చును గాన నిచట నన్నయ భట్టారకుఁ డసమగ్రముగనే గాక ప్రమాదముగ సైతము సూత్రించెనని చెప్పవలసి వచ్చును. నిజముగాఁ జింతామణిలో నిట్టిప్రమాదము సైతము నున్నదని తలఁచియే సూరిగారు పైరీ తిని సూత్రించిరాయని యాలోచింపవలసి యున్నది. వెనుక నుదాహరించిన రీతిని నన్నయభట్టారకుఁ డుచ్చారణములోని సందేహమును దీర్చుట కాసందర్భమును జెప్పియున్నాఁడు గాన నచట 'చాఁద' మున్నగుచోట్ల "అత్వమా" "ఏత్వమా" అనుసందేహము తోఁచును గాని "అత్వమా" "ఓత్వమా" అను సందేహము పొడమనేరదు. కాఁగా "అద్దంత్య" ఇత్యాది సూత్రములోని వక్రశబ్దముచే "ఓత్వ" విశిష్టతాపహార్థమె స్ఫురింప నేరదుగాన నచట నెట్టిప్రమాదమును లేదని గ్రహింప వలెను.

(౮.౨) పైరీతినే "యేఁబది" "పోయె" మున్నగు చోటులందును "యాఁబది, పోయ" మున్నగునుచ్చారణ ములు వ్యవహారమున సంభవించును; కావుననే యట్టిచోటు లందు సాధ్వసాధుతానిర్ణయము చేయుటకయియే,

"ఆద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః"
అను చింతామణిసూత్రము నుపదేశింపఁబడినదని గ్రహింపవలసి యున్నది. తద్విచారణము మున్ముందు విపులముగాఁ జేయఁబడును. (విష. ౯౮౭.౧౧౫.౧౨౮) కాన నిట విస్తరింపలేదు. కావ్యవాఙ్మయ మావఱకు లేనికారణమునఁ బ్రకృతులగు శబ్దములసిద్ధికి వ్యవహారమునే యాధారముగ గ్రహింపవలసిన యవస్థలోఁ జింతామణి రచియింపఁబడి యుండకున్నచోఁ దరువాతివా రెవ్వరును సంగీకరింపని పదాదియకారమును జింతామణికర్తయు సంగీకరించియుండఁడు గదా. కాఁగాఁ బదాది యకారాంగీకారము సైతము చింతామణియొక్క ప్రాచీనతమత్వమునకుఁ బ్రబలాధారమై యున్నదనుటకు సందేహము లేదు.

(౮౩) చింతామణికిఁ బూర్వకాలమునఁ గావ్యవాఙ్మయమె యుండియున్నచోఁ బైరీతి సందేహానిర్ణాయక సూత్రముల రచనకుఁ బ్రసక్తియే యుండదు గదా. అట్టి కావ్యవాఙ్మయములోని ప్రయోగములె శబ్దముల సాధ్వసాధుతానిర్ణయమున కాధారము లగును గదా.

ఇట్టిస్థితిలోఁ జింతామణిని నన్నయభట్టు రచించియే యుండలేదనియుఁ, జింతామణి నన్నయకుఁ బర్వాతి నాఱు వందల సంవత్సరములనాఁ డనఁగా నాంధ్ర వాఙ్మయము బాగుగ విస్తరించినపిదప రచింపఁబడెననియు, నొకసిద్ధాంతము

బయలుపెడలుట మిక్కిలి వింతగా నున్నది. అట్టివాదమును దానికి మూలము లగుయుక్తులను వానిఖండనమును నిటఁ బ్రదర్శించుచున్నాను.

(౪౪) సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనెడి పద్ధతులనుమాత్రమె ప్రధానముగా నుపదేశించెడి యాంధ్రశబ్దచింతామణియొక్క ప్రచార మాంధ్రవాఙ్మయము విస్తరించినపిదప సహజముగఁ దగ్గుటచేత నద్దానియునికి నెఱుఁగకయో లేక యెఱిఁగియు నది తెలుఁగునకు లక్షణ మనిపించుకొనదని తలంచియో యాంధ్రభాషాభూషణకర్త యగు కేతనమంత్రి యీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

క. ,,మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయ భట్టాది కవిజనంబుల కరుణన్.'' ౪

తే. ,,సంస్కృత ప్రాకృతాది లక్షణముఁ జెప్పి
తెలుఁగునకు లక్షణముఁ జెప్ప కునికి యెల్ల
కవిజనంబుల నేరమి గాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచిన తలఁపుగాని.'' ౬

క. ,,భాషావేదులు నను విని
యాషణ్ముఖపాణినులకు నగు నెన యని సం
తోషింప నాంధ్రభాషా
భూషణమను శబ్దశాస్త్రమును రచియింతున్.'' ౭

ఉ. «క్రొత్తగ నాంధ్రభాషకును గొండొకలక్షణ మిట్లు చెప్పెనే
యుత్తమ బుద్ధి నీతఁ డని యోరలువోవక విన్నమేలు మీ
రొత్తిన మీకు మాఱుకొని యుత్తర మిచ్చుట చాల వేఁగు మీ
చిత్తమునందు నన్నెరవు సేయకుఁడీ కవులార మ్రొక్కెదన్. ౧౦.
(ఆంధ్రభాషాభూషణము).

ఆంధ్రశబ్దచింతామణి సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనుటలోని పద్ధతులుమాత్రమె ప్రధానముగా రచింపఁబడుటచే నది తెనుఁగునకు లక్షణ మనిపించుకొనదని కేతన యిట్లు చెప్పె నన్నయర్థము సైతము పైపద్యములకుఁ జెప్పుటలో విరోధ మగపడదు. కాని యావఱకుఁ జింతామణివంటి వ్యాకరణము లేదనునర్థము సైతము పై పద్యములవలన లభింపకపోలేదు. అట్లయినను జింతామణి యునికి కేతనమంత్రికిఁ దెలియనంతమాత్రమున నది యావఱకుఁ బుట్టియుండలేదనుట సరికాదు గదా.

(౪౫) ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టవిరచితమే యను సిద్ధాంతము చిరకాలమునుండియు నాంధ్రపండితప్రపంచమున సుప్రసిద్ధమై యున్నది. అధునాతనములగు బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణ శబ్దరత్నాకరములపీఠికలం దట్లె వ్రాయఁబడి యున్నది. ఆంధ్రశబ్దచింతామణికి బాలసరస్వతీయ మను పేర నొకతెలుఁగుటీక వ్రాసిన మొలకూచి బాలసరస్వతియుఁ (క్రీ. శ. ౧౬౦౦) గవిశిరోభూషణ మనుపేరుగల వ్యాఖ్యాన

మును వ్రాసిన (సంస్కృతభాషలో) యహోబలపండితుఁడును (౧౭౦౦ ప్రాంతమువాఁడు) నప్పకవీయ మను పేరఁ దెలుఁగుపద్యములతో నొకవివరణమును వ్రాసిన కాకునూర్యప్పకవియు (క్రీ. శ. ౧౬౫౫) నాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టవిరచితమె యని స్పష్టముగాఁ దమతమగ్రంథములలో వ్రాసియున్నారు. ఇంకను నాంధ్రశబ్దచింతామణిని సంబంధించిన వాసుదేవవృత్తి కవిజనాంజనము నాంధ్రకౌముది పారనంది రామశాస్త్రులుగారి యుద్ద్యోతినీవ్యాఖ్య మున్నగు గ్రంథములందెల్లఁ జింతామణి నన్నపార్యవిరచిత మనియే వ్రాయఁబడి యున్నది. ఆంధ్రశబ్దచింతామణి పరిచ్ఛేదాంతగద్యములలో సైతము "ఇతి శ్రీ సకలభాషావాగనుశాసననన్నయభట్ట విరచి తాంధ్రశబ్దచింతామణౌ......" అని యిట్లు వ్రాయఁబడి యున్నది. ఇంతయేల నన్నయయే తాను శబ్దశాసనుఁడనని భారతకృత్యాదిని జెప్పికొనియున్నాఁడు. (౩-వి)

అట్లయినను గీర్తిశేషులగు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు చింతామణి నన్నయభట్టవిరచితము కానేరదని తమ యాంధ్రకవులచరిత్రమునఁ జర్చించియున్నారు. అదిమొదలుగ ననేకులగు విమర్శకు లయ్యది నన్నయభట్టవిరచితము కానేరదను నభిప్రాయము నందుచున్నారు. కాని వీరేశలింగముపంతులుగారును దక్కిన విమర్శ

కులును దద్విషయమునఁ జూపెడి యుక్తులుమాత్రి మించు కేని బలవంతములై యుండలేదు.

(౪౬.) బాలసరస్వతియో లేక యాతనికాలమందున్న మఱెవ్వరో యాంధ్రిశబ్దచింతామణిని రచించిరనియుఁ గారి కావళి నథర్వణాచార్యుఁడే రచించెననియుఁ గవులచరిత్రి ప్రిథమముద్రిణమునందు వ్రాియఁబడి యున్నది. "దీనిని బట్టి చూడఁగా నాంధ్రిభాషాభూషణాదులను నథర్వణకారికావళిని సహాయపఱుచుకొని బాలసరస్వతియే యాంధ్రిశబ్దచింతామణిని జేసి దానికి గౌరవము కలుగుటకయి నన్నయభట్టారకునిపేరు పెట్టినట్లు నిశ్చయింపవలసి యున్నది." (ఆంధ్రికవుల చరిత్రి, ప్రిథమముద్రిణము ౧౨౨ పుట. బమ్మెర పోతరాజు చరిత్రము, రివైజ్డ్ఎడిషను ౪౫ పుట) ముందు వ్రాయనున్న ప్రికార మథర్వణకారికావళి యాంధ్రిశబ్దచింతామణికి వివరణగ్రింథ మనఁదగి యుండుటచేత నారెండిటిలోను నాంధ్రిశబ్ద చింతామణి మొదటిదని యంగీకరింపక తీరదు. చింతామణిలోని లక్షణములు సామాన్యములు. కారికావళిలోని వన్నియో విశేష లక్షణములు. ఆంధ్రిశబ్దచింతామణిలో లేని లక్షణవిశేషములు మాత్రిమె యథర్వణకారికావళిలో వెలయుచున్నవి. సామాన్యలక్షణములను జూచి యందులేని విశేషలక్షణముల నెవ్వరేని వ్రాిసియుందు రనవచ్చును గాని విశేషలక్షణములను జూచి సామాన్యలక్షణములను రచించియుందు రనుట సరి

కాదుగదా. కాఁబట్టి బాలసరస్వతి యథర్వణకారికావళి నాధారముగాఁ జేసికొని యాంధ్రశబ్దచింతామణిని రచించెననుట కల్ల. ఆంధ్రశబ్దచింతామ ణ్యాధర్వణకారికావళులకుఁ గల సంబంధమును బాగుగఁ బరిశీలించియున్నచో వీరిట్లు వ్రాసియుండరని నా నమ్మకము. మఱొకవింత! బాలసరస్వతి పూర్వుఁడనియు నాతనికిఁ బిమ్మటివాఁ డప్పకవియనియు నాతనికిఁ దరువాతివాఁ డహోబలపండితుఁ డనియు నధర్వణకారికావళి నాధారముగాఁ జేసికొని బాలసరస్వతి చింతామణి వ్రాసెననియు వ్రాసియు (కవులచరిత్ర రివైజ్డ్ఎడిషను ౪౫ పుట) నందే వీరేశలింగము పంతులుగారు ‘‘అహోబలపండితీయ మనఁ 'బడెడు కవిశిరోభూషణ మప్పకవీయమునకంటె మిన్నగా నుండవలెనన్న యభిలాషతో నీకారికావళిని రచించి (అహోబలపతి) తనవ్యాఖ్యానములోఁ జేర్చి యథర్వణాచార్యునిదని లోకమును భ్రమపెట్టి నమ్మించి యుండెననుటకు సందేహము లేదు.” (కవులచరిత్ర రివైజ్డ్ఎడిషను ౨౯౧ పుట) అని యిట్లత్యంత విరుద్ధముగ వ్రాసియున్నారు. దీనినిబట్టి యుత్తరకాలిక మనఁదగియున్న యథర్వణకారికావళి నాధారముగాఁ జేసికొని యహోబలపతికిఁ బూర్వుఁ డని వారే యంగీకరించిన బాలసరస్వతి చింతామణిని వ్రాసెనన్నమాట యెంత యసంగతముగ నున్నదో చదువరులె గ్రహింతురు గాక.

కవులచరిత్రమును సవరించుటలో వీరేశలింగము పంతులు గారు పై విరోధమును గ్రహించియే కావలయును జింతామణి యథర్వణకారికావళి నాధారముగఁ జేసికొని రచింపఁబడెనన్న మాట వదలికొని చింతామణి బాలసరస్వతీరచిత మనియు, నథర్వణకారికావళి యహోబలపండిత విరచిత మనియు వేఱొక చోట వ్రాసియున్నారు. అట్లయినను జిరకాలమునుండియుఁ బండిత సంప్రదాయమున సుప్రసిద్ధములై యున్నవిషయము లసత్యములనుటకును, బాలసరస్వ త్యహోబలపండితులు తమ గ్రంథములవలనఁ దమకు రావలసినకీర్తిని విడుచుకొని తద్గ్రంథ కర్తృత్వమును నన్నయాథర్వణులపై మోపి లోకమును భ్రమింపఁజేసిరను వంచకత్వము వారిపై నిలుపుటకును, దగిన ప్రబలప్రమాణములను బంతులవారు చూపి యుండలేదు. ఈవిషయమున వారు చూపిన యుక్తులదౌర్బల్య మిూక్రిందఁ జూపుచున్నాను.

(౪౭) ఆంధ్రశబ్దచింతామణిలోని,

"సర్వత్రాజ్య తాల్వ-ర్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః."

అను సూత్రము ద్రుతప్రకృతికములకంటెఁ బరమం దున యకారమున కంతటను నచ్చునటెఁ గార్య మగునని చెప్పుచున్న దనియు, నది భారతప్రయోగవిరుద్ధ మగుటచేఁ జింతామణి నన్నయరచితము కానేరదనియు నొకయుక్తిని జెప్పిరి. ఎప్పుడు

మాంధ్రశబ్దచింతామణిని వ్రాసెనన్న మాట యెట్లుపొసఁగును? కాఁగా "సర్వ త్రాజ్వత్కార్య" మిత్యాది సూత్రరచనమువలన భారతభాగకర్తయగు నన్నయభట్టునకుఁ జింతామణికర్తృత్వము విరోధింపనేర దనుటకు సందేహము లేదు. పదాది యకారాంగీకారవిషయమున ముందు విశాలముగ వ్రాయఁబడును. (౧౧౫-౧౨౪ విష).

(౪౮) చింతామణి ప్రథమపురుషేకారసంధియు నిత్యమేయని చెప్పుచున్నదనియు, నయ్యది నన్నయభారతభాగప్రయోగములకు విరుద్ధమనియు, మఱొకయుక్తిని జెప్పుచు వీరేశలింగముపంతులవారీ క్రిందిపద్యము నుదాహరించిరి.

ఆ. "అంతఁ గొంద ఱధిక హాస్యంబు సేసిరి
యడవి నేమి రోసె దనిరి కొంద
ఱవ్వ నీవు వేల్పవౌ దని కొందఱు
మోడ్పుకేలుతోడ మ్రొక్కి రంత." (భారత. అరణ్య.)

ఈపద్యమునందు "అంతఁ గొంద ఱధిక హాస్యంబు సేసిరి" అనుదానితో వాక్యాంతమును బాదాంతమును నగుటచేతను, దెలుఁగునఁ బాదాంత మగునపుడు వాక్యాంత మయ్యేనేని సంధి వైకల్పికమని నన్నయాభిప్రాయ మగుటచేతను "చేసిరి+అడవి" అనుచోఁ బ్రథమపురుషేకారసంధి నిత్యమని యంగీకరించినపక్షమందు సైతము సంధిలేకుండుట విరుద్ధము

మొదలగుశబ్దములలోఁ బదాది నచ్చేయున్నదని కొందఱి యాశయము. అచట యకారసహితస్వర ముచ్చారణాను సారముగా నున్నదనియు, నాయకారము పదముకంటెఁ బర మగునపుడు సంధివేళలో లోపించుననియుఁ జింతామణి కారుని యభిప్రాయము. ఉచ్చారణములో నున్న యకారము లేదనుట సరికాదని తలఁచి చింతామణికారుఁ డద్దానిని నంగీకరించుచుఁ బ్రయోగవిషయమున బాధలేకుండఁ బై రీతిని సరిపెట్టెను. తరువాతి వైయాకరణులు "పదాదిని యకార మున్నదని యొప్పికొననేల? సంధివేళల నది లోపించు నని చెప్పనేల? అచట స్వరమే యున్నదని చెప్పరాదా?" అని యిట్లుచ్చారణస్వభావమును గణింపక ప్రక్రియాలాఘవ మునుబట్టి పదాదియకారము నంగీకరింప రైరి. ఇంతేగాని యచట నేమతమునందును బ్రియోగబాధ లేదు. (అహోబల పండితీయము. ౧౫౫ పుట.) ఇట్టిస్థితిలోఁ బైసూత్రము భారత ప్రయోగముల కెట్లు విరోధించునో తెలియకున్నది. అట్టి విరోధమును గలిగించునట్టియర్థమును వీ రాసూత్రమునకుఁ జేసికొనియుండిరో విశదపఱుప రైరి. మఱియు వీ రెట్టియర్థ మును జేసికొన్నను నాసూత్రము భారతప్రయోగములకు విరో ధించునపుడు మఱి యేగ్రంథమునకు విరోధింపకుండును? ఆప క్షమునఁ జంద్రికాపరిణయమును వ్రాసిన బాలసరస్వతి మాత్రి

కానేరదు. ఇట్లే నన్నయభట్టు మఱొకచోట సైతము సంధ్యభావమును బ్రయోగించియున్నాఁడు. కాని యిట్టివి బాధకములు కానేరవు. ఈరెండు నిర్బాధస్థలములుఁ దప్ప నెల్లయెడలను నన్నపార్యుఁడు ప్రథమపురుషైకారమునకు నిత్యసంధినే ప్రయోగించియున్నాఁడు. కాఁగా నన్నయభట్టుప్రయోగములలోఁ బాదమధ్యమునఁ బ్రథమపురుషైకార సంధ్యభావమును జూపినంగాని వీరివాదము నిలువనేరదు.

తే. "సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు
ఎఱుఁగు మెల్ల ధర్మములకు నెందుఁ బెద్ద
యండ్రు........." (భార. ఆది.)

ఇట్టిచోట్లఁ బాదాంతమున నుకారమునకుసైతము నన్నయభట్టు సంధ్యభావమును బ్రయోగించి యున్నాఁడు. దీనినిబట్టి యుకారసంధియు నన్నయభట్టు వికల్పించె నని వాదింతురా యేమి? ఈ ప్రథమపురుషైకారసంధివిషయము చింతామణియొక్క ప్రాథమికతనుబోధించుచున్నది. ఈవిషయము మున్ముందు విపులముగాఁ జర్చింపఁబడును.

(౪౯)

ఉ. "ఏమి మహాద్భుతం బిది హరీ! హరి! యెక్కడియాంధ్రశబ్దచిం
తామణి ఫక్కి యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు? సిద్ధుఁ డెవ్వఁ డా
హా మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁ గాదె యిన్నియున్."

మ. "ఇలఁ బ్రజ్ఞానిధు లౌ కవుల్ మునుపు లేరే వారు వ్యాఖ్యాన క
ర్తలు గానోపరె? పెక్కువత్సరము లంతర్ధ్యాతమై యున్న యీ
తెలుఁగుఁ వ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం డీకఁ గావింపుమం
చల సిద్ధుండ్లు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగాన్."

(బాలసరస్వతీయ టీకాపీఠిక.)

అని యిట్లు బాలసరస్వతిచేసిన సిద్ధునికల్పనమును దానిని బెంచి వ్రాసిన యప్పకవికల్పనమును విశ్వసింపఁ దగినవి కావని యు, నన్నయభట్టే యాంధ్రశబ్దచింతామణిని రచించియున్న యెడల నంతకాల మది యంతర్ధ్యాతమై యుండుటకుఁ గారణ ము లేదనియు, బాలసరస్వతియే యాగ్రంథమును రచించి దాని ప్రామాణ్యమునకై నన్నయభట్టుపేరుపెట్టె ననియు, నం దువలన దానికి వ్రాసిన తనబాలసరస్వతీయ టీకమూలమునఁ దనకుఁ బ్రసిద్ధి వచ్చునని తలఁచి యట్లు చేసెననియు, న ట్లగుట చేతనే తిక్కనసోమయాజికి సమకాలికుఁడగు (క్రీ. శ. ౧౨౬౦) మూలఘటికకేతన తనకాలమువఱకుఁ దెలుఁగుభాషకు వ్యాక రణమే లేదని స్పష్టముగాఁ జెప్పుట సంభవించెననియుఁ జెప్పు చు "మున్ను దెలుఁగునకు......" "సంస్కృతప్రాకృతాది ......" మొదలగు వెనుక (౪౪-విషయము) నుదాహరింపఁబడిన కేతనమంత్రిపద్యములను వీరేశలింగముపంతులుగారు కవులచరి త్రములో నుదాహరించి యున్నారు.

(౫౦) ఆంధ్రశబ్దచింతామణి యంతకాల మంతర్హ్యా తమై యుండిపోవుట కీవలికే (౪౪-వి) కారణములు చూపి యున్నాను. చింతామణి సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చికొనెడి పద్ధతులను జూపుట మాత్రము ప్రధానముగాఁ జేసికొని రచింపఁబడిన దగుటచేత నది యాంధ్రవాఙ్మయము ప్రబలినవెనుకఁ బ్రచారవిదూరమగుట సంభవించి యుండునని యీవలికు వ్రాసియే యున్నాను. పైరీతి నాంధ్రశబ్దచింతామణి తత్సమశబ్దనియమోపదేశపరిభాసమై యుండఁగాఁ బరిశిష్టమగు నచ్ఛాంధ్రశబ్దనియమములఁ బాలవలికధర్వణాచార్యుఁడు పూరించుటచే నాచింతామణి కావశ్యకత మరల వెలసెను. అట్లయినను నట్టి పరిశిష్టగ్రంథమును జింతామణితో జోడించి యాతఁడు వివరణము వ్రాయకముందే కాలగతి నందుటచేతనో మఱి యేకారణముననో యట్టియథర్వణకారికలను జింతామణితో జోడించిన యేకగ్రంథ మెచ్చటను నేఁటికిని నుపలబ్ధము కాలేదు. కాఁగాఁ జింతామణిసూత్రముల కచ్చటచ్చట నదుకఁ దగిన యాయథర్వణకారికలు సందర్భక్రమశూన్యము లయి సామాన్యపండిత దురవగాహములయి నిల్చిపోయి యుండును. కావుననే తరువాతి పండితు లథర్వణకారికలను జింతామణి పరిశిష్టభాగముగ గ్రహింపఁ జాలక యాగ్రంథమును వికృతి వివేక మనెడి ప్రత్యేకవ్యాకరణముగఁ దలంచుచు వచ్చుట

సంభవించెను. అట్లు సాధారణపండితదురవగాహ మగుటచేతనే యావికృతివివేకమును బరిపూర్ణముగ నందఱును నభ్యసించు నలవాటును లేకపోయి యుండును. అట్లయినను గొన్ని గొన్ని కారికలు కొందఱకుఁ బరంపరాయాతముగ లభించుచు నుండెడివని తోఁచుచున్నది. కావుననే కొన్ని కారికలు బాల సరస్వతీయమున నుదాహరింపఁబడి యుండుటయుఁ గొన్ని కారిక లప్పకవీయమున నాంధ్రీకరింపఁబడి యుండుటయుఁ దట స్థించి యుండెను. తుట్టతుది కహోబలపండితుఁ డాకారికలను జాలవఱ కర్థ్వముగనే యాయాచింతామణిసూత్రముల వ్యా ఖ్యానావసరమున నుదాహరించియు, వానిని సంక్షేపముగ వివరించియు వెల్లడించెను. తరువాత నేఁటికిని నథర్వణకారి కల నెల్లరును నహోబలపండితీయమునుండి సంగ్రహించుట తప్ప మూలమాతృకనుండి గ్రహించుట సంభవింపలేద ఈరీతిగ నాంధ్రశబ్దచింతామణియు నథర్వణకారికావళియు బెక్కువత్సరము లంతర్హితములై (యనఁగాఁ బ్రచారవిదూ రములయి) యుండిపోయినవని గ్రహింపవలసి యున్నది. పై కా రణములచేత వానియునికి కొందఱకుఁ దెలియకుండినంత మాత్రమున నవి నిజముగాఁ బ్రాచీనములు కావనియుఁ, దః వాతివారిచేత రచింపఁబడినవనియు నూహించుట యుక్తము కాదు గదా.

చింతామణి హఠాత్తుగా బాలసరస్వతికి లభించుట చేతఁ బ్రాచీనుల యలవాటుచొప్పున నాతఁడు సిద్ధునికల్పన మును జేసియుండవచ్చును. అట్టికల్పనమును బెంచినయప్పకవి ప్రసంగము విశ్వసింపఁదగనంతమాత్రమున గ్రంథమే హుళిక్కి యనుట యుక్తమా? అట్లె యొకపక్షమున మూలఘటిక కేతనకును జింతామణియునికి తెలియనంతమాత్రమున నయ్యది ప్రాచీనమనుట బాధితమగునా?

(౫౧) మఱియుఁ గొందఱు గ్రంథకర్తలట్లు తమగ్రంథమే మొదటిదని చెప్పికొనెడి యలవాటు సయితము లేకపో లేదు. వసుచరిత్రములోని పద్యముల నుదాహరించుటచేత ౧౫౮౦ (క్రీ. శ.) సంవత్సరమునకుఁ దరువాతివాఁడని నిశ్చయింపఁదగిన గణపవరపు వేంకటకవియుఁ గేతనవలెనే యీ క్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

సీ. "శ్రీకరముగను సంస్కృతమునకును బ్రాకృ
తమునకుఁ గల లక్షణములు చెప్పి
తెనుఁగున కావిధంబున లక్షణముచేయ
రాకున్కి యదియు నేరంబు గాదు
తొల్లిటి సుకవుల కెల్లను నను ధన్యుఁ
గావించు తలఁపింతె గాని యనుచుఁ
గుకవిజనాజ్ఞాన ఘోరాంధతమసమూఁ
బోఁగొట్టఁ గల్గు కౌముదివిధమున

నిల మున్ను తెనుఁగున నెవ్వా రెఱుంగని
యాంధ్రకౌముది యనునట్టికృతిని
సీసమాలిక గాఁగఁ జేసెద........"

(సర్వలక్షణశిరోమణి యను నాంధ్రకౌముదిలోని వ్యాకరణభాగము. ౧ పుట.)

ప్రబలములగు నాధారాంతరములు లేకయే యిట్టి మాటలను బట్టికొని గ్రంథముల పౌర్వాపర్యమునకు విపర్యయమును గల్పించుట పరమసాహసము కాదా? కేతనవాక్యములనుబట్టి చింతామణి కేతనకుఁ దర్వాతిదన్నట్లే పై వేంకటకవి వాక్యములనుబట్టి ప్రాచీనలక్షణగ్రంథము లెల్ల నాతనికిఁ బిమ్మటికాలములోని వన నగునా?

(౫౨) మఱియుఁ జింతామణికి వివరణగ్రంథమగు వికృతివివేకములోనికారికలను గొన్నిటిని బాలసరస్వతి తనరచించిన చింతామణిటీకలో నీ క్రిందిరీతి నుదాహరించి యుండుటచేత బాలసరస్వతికిఁ జిరకాలము క్రిందటనే చింతామణి పుట్టియుండెననియు, దానితర్వాత దానికి వివరణగ్రంథముసైతము చాలకాలము క్రిందటనే పుట్టియుండె ననియు నంగీకరింపక తీరదు గదా.

"ప్రాగ్ధనార్థే ము రేక త్వే కథ్యతే మధ్యమార్థకః
విభాషేతి వచం త్యేకే న ప్రాణేతు కదాపి చ.

అనే అధర్వణవచనమువల్ల ముకారలోపము మధ్యమపురుషకుఁ గలదు. అచ్చు పరమైయుంటే లోపములేదు." (మ-రా-శ్రీ,

రావుసాహెబు గిడుగు వేంకట రామమూర్తిపంతులుగా రిచ్చిన పర్లాకిమిడి మాతృక కి(యా. 12 తాటాకు) ఇట్లే, శ్రీమాన్ విద్వాన్ అంగలూరి శ్రీనివాస తాతాచార్యులుగా రిచ్చిన కాకినాడ మాతృకలో సైతముున్నది. (59 కాగితము). పైరీతినే బ్రహ్మశ్రీ, నిడదవోలు సుందరముపంతులుగా రిచ్చిన విజయనగరమాతృకలో సైతము స్వల్పపుమార్పులతో నున్నది. (38 తాటాకు). కాకరపర్తి కృష్ణమ్మగారు వ్రాసిన గంజాము జిల్లా కరకవలసమాతృకలోఁ బైవిధముననే యేవిధమైన మార్పును లేకయే యున్నది (55 తాళపత్రము). మ-రా-శ్రీ. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులవారు వ్రాయించిన మఱొకమాతృకలో సైతము పైవిధముననే యున్నది. ఇందుఁ బ్రకృతపు సంస్కర్తలు చేయుచున్న సహజములగు మార్పులు మాత్రము గలవు. విస్తరభీతి నుదాహరింపలేను గాని యిట్లనేకస్థలములందు బాలసరస్వతీయటీకలో నథర్వణకారికలుదాహరింపఁబడి యున్నవి. బాలసరస్వతీయమున నహోబల పండితీయమునందువలె నట్టివిషయబహుళమగు వికృతివివేకమెల్ల నుదాహరింపఁబడక యలంతికారికలుమాత్రము నుదాహరింపఁ బడియుండుటచేత బాలసరస్వతి కథర్వణకారికావళి పూర్తిగ. లభించి యుండలేదనియుఁ, బండితపరంపరాయాతముగాఁ గొన్నికారికలుమాత్రమే లభించియుండెననియు గ్రహింప నగును. చింతామణికి వివరణగ్రంథమగు

నథర్వణకారికావళి సైతము బాలసరస్వతినాఁటికే వ్యాప్తినొంది యుండుటచేతఁ జింతామణి బాలసరస్వతీరచిత మనువాదమే గాక యథర్వణకారికావళి యహోబలపండిత రచితమన్న వాదముసైత మున్మూలిత మగుచున్నది.

(౫౩) బాలసరస్వతికివలెనే యప్పకవికిని నథర్వణకారికలు కొన్ని లభించియుండెనని యీక్రింది యథర్వణకారికల కప్పకవిచేసిన యాంధ్రీకరణమువల్ల విశదమగుచున్నది.

శ్లో. "తృతీయోచ్చ తృతీయోష్మ తృతీయేసరళాస్త్రియః,
షోడశవ్యంజనం చాపి షష్ఠస్థానే నయుజ్యతే." (సంజ్ఞా. ౨౯.)

క. మూఁడవ తావున మొదలిటి
మూఁడు సరళవర్గములును మూఁడవ స్వరమున్
మూఁడవ యూష్మాక్షరమును
గూడదు కడియింప సెట్టి కూళకునైనన్. (అప్ప. ౨ ఆ. ౩౯.)

తే. వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన
షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁ దఱఁ జంప వచ్చినట్టి
చెడుగునకు నైనఁ బద్యంబు నుడుగవలయు. (అప్ప. ౨ ఆ. ౩౯.)

ఇట్టి వింకను గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

(౫౪) చింతామణికి వివరణగ్రంథమగు నథర్వణకారికావళియే బాలసరస్వత్యాదులకుఁ జాలపూర్వప్పుదై యుండుటచేత నద్దానికి మూలగ్రంథమగు నాచింతామణి యంతకన్నఁ బ్రాచీనతర మని స్పష్టపడుచున్నది గదా. అథర్వణకారికావళి

చింతామణికి వివరణ మన్నవిషయము పాఠకమహాశయుల హృదయమున కెక్కుటకై యిచటఁ జింతామణ్యాథర్వణకారికావళులకుఁ గల సంబంధమును ముందుగ విశదీకరించుచున్నాను.

"ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భనంతీహ,
రుల్యాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ."

అనెడి చింతామణికారికలోని హిశబ్దమును గ్రహించి యథర్వణాచార్యుఁ డీక్రిందిరీతిని దన వికృతివివేకమున వివరించి యున్నాఁడు.

"బహవో(త్రాంధ్రభాషాయాం, వర్ణా ఔపవిభక్తికాః,
ప్రవృత్తి శ్చాప్రవృత్తిశ్చ, వికల్పశ్చ క్వచి ద్భవేత్,
తద్వివేకః ప్రయోగైక, శరణం స్యా ద్ధి శబ్దతః." (సంధి౩౧.)

ఇట్లే చింతామణిలోనున్న యీక్రింద నుదాహరించు "దరశార్ఙే" త్యాదికమగు నాంధ్రలిప్యుద్ధారక శ్లోకములలోని "దరశార్ఙేత్యాదిశబ్దముల ననువదించుచు నథర్వణుఁ డీక్రింది రీతిని వివరించియున్నాఁడు.

శ్లో. "దరశార్ఙ్గ పిప్పల దళాంకుశ పన్నగ సన్నిభాః క్రమాత్ పరుషాః."

(ఆంధ్రశబ్దచింతామణి. అప్పకవిమాతృక.)

శ్లో. "పంచ వర్గాదయో వర్ణాః శంఖశార్ఙ్గాది సన్నిభాః,
తిర్యగ్రేఖా యుజశ్చోర్ధ్వం దండరే ఖాన్వితా అధః,
తఏవ చ ద్వితీయాః స్యుః......" (అథర్వణకారికావళి. ౩-౨)

అని యిట్లు తనకాలమునకు మాఱియున్న తిర్యగ్రేఖాకారములగు పొల్లుగుర్తులతోఁగూడిన లిపికి సరిపడునట్లుగను,

వర్గ ద్వితీయాదులకు నవీనముఁగా నేర్పఱిచిన యొత్తులతోఁ గూడుకొనునట్లుగను చింతామణికారికల నధర్వణాచార్యుఁడు నవరించి యున్నాఁడు.

(౫౫) పై సందర్భమునుబట్టి చింతామణికి వికృతివివేకము వివరణగ్రంథ మగుట సిద్ధాంతిత మగుచున్నందున నప్పకవి గ్రహించిన చింతామణికారికల మాతృకలోని

"నుమ్మోత్తో హల్యథర్వణాచార్య మతాత్."

అనుపాఠము ప్రక్షిప్తమనియు "నుమ్ చోతః పరుషాణా" మిత్యాది బాలసరస్వతీ మాతృకాపాఠము గ్రంథకృత్ప్రయుక్త మైనదనియు విశదమగుచున్నది. చింతామణికి వివరణగ్రంథ మును రచించు ఘట్టమునఁ బు నధర్వణుఁ డాచింతామణిలో స్మరింపఁబడుట కేవలము నసంభవము గదా.

(౫౬.) మఱియుఁ బై సందర్భమునుబట్టి యథర్వణకారికావళి దురవగాహ మగుటచేత నిప్పటి కొందఱు పండితుల పఠనపాఠనాది ప్రచారములో నుండలేదనియు, నకారణము ననే బాలసరస్వత్యప్పకవులు కది పూర్ణముగ లభింపక కొన్ని కొన్ని కారికలుమాత్రమే లభించుట సంభవించెననియు, గ్రంథము నామమాత్రముగ నవగాహించి యుండమిచేతనే యప్పకవి పై రీతిని దానిని చింతామణి వివరణగ్రంథముగా గ్రహింపలేక చింతామణిలో నథర్వణుని స్మరించెడి పైనివ్రాసిన

"నుమ్మోత్తో హల్యథర్వణాచార్యమతాత్."

అను ప్రక్షిప్తపాఠమును సమ్మతింపవలసినవాఁ డయ్యెననియు

విశదము కాక మానదుగదా. పై రీతి నథర్వణకారికావళి యాకాలమున నామూలాగ్రముగఁ బ్రచారములో లేకుండుట చేతను నట్టి గొప్పగ్రంథ మొకటిగలదని చాలమందికిఁ దెలిసి యుండుటచేతను నాయాకాలముల పండితులు రనిపెట్టి సంగ్రహముగా రచించుకొన్న వేఱొకకొన్ని లక్షణవిశేషములకారిక లట్టి యథర్వణకారికావళిలోనివే యనుభ్రమ నానాఁటికి వ్యాపించుటంజేసి యథర్వణకారికావళిలో నట్టికారికలకుఁ బ్రక్షిప్తత సంభవించెననియు నూహింపఁ దగియున్నది. ఈసందర్భమున నొక్కయుదాహరణమునుమాత్ర మిటఁ జూపుచున్నాను.

వాక్యములలోను సమాసములలోను శుద్ధ సంస్కృతాంధ్రపదముల మేళనమును జేసెడి మణిప్రవాళశైలి(మలయాళ భాషాప్రసిద్ధము) నంగీకరింపక యాంధ్రపండితులు శుద్ధ సంస్కృతాంధ్రపదముల సమాసమును వైరిపదదోషదూషితముగా నిరాకరించుచుండెడివారు. ఆసందర్భమునఁ గొందఱాంధ్రపండితులు "వాఁడినయూఖములు"మున్నగు నన్నయప్రయోగములకును నట్టి దోషము తగులుచున్నదని భ్రమించి యట్టి ప్రయోగములకుఁ జింతామణిలోని

"సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి"

అనెడిసూత్రము రక్షక మగుచున్న దని యపార్థము చేసికొని యట్టి మఱికొన్ని ప్రయోగముల నన్వేషించి యా చింతామణి సూత్రములోని పరిమితశబ్దముచే బోధితమగుచున్న పరిమి

తత్త్వము షడక్షరమాత్ర పరిమితమని యీక్రిందిరీతి నొక సంగ్ర హకారికను రచించికొనిరి.

"ఆంధ్రః షడ్వర్ణపర్యాంతం సంస్కృతేన సమస్యతే."

లేదా,

"ఆంధ్ర షడ్వర్ణ పర్యంతం పదం స్యాత్ కర్మధారయే."

నానాఁటి కిది యథర్వణకారికలలో నుండఁదగిన దను భ్రాంతిచే నందుఁ బ్రక్షిప్తమగుటయు సంభవించెను. పై కారిక బాలసర స్వతీయమునందును నహోబలపండితీయాదులందును బై యభి ప్రాయములతోనే యుదాహరింపఁబడి యున్నది. కాని పైయ భిప్రాయములు సన్నయాథర్వణసమ్మతములు కావు. చింతామణి కర్త కేవల సంస్కృతశబ్దముల సిద్ధసమాసములను యథాస్థిత ముగానే యంగీకరింపవలెననియు, నాచ్ఛికసమాసములను వ్యా హారమును బట్టి గ్రహింపవలెననియు విశదపఱిచి సంస్కృ తాంధ్రమిశ్రసమాసములను గాని సాంస్కృతికసాధ్యసమాస ములను గాని ఘటించునపుడు పాటింపవలసిన యేర్పాటులను మాత్ర మీక్రిందిరీతిని సూత్రించియున్నాఁడు.

"సంస్కృత ప్రైకృత శబ్దైర్మిశ్రసమాసః స ఏవ విజ్ఞేయః"

"సంస్కృత పదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి.
స్యుస్స్వవిభక్తివికారైర్బహవశ్చ యథాయథం సమస్యన్తే"

(ఆంధ్రశబ్దచింతామణి. హలంత.)

వీనినిబట్టి యాంధ్రవిభక్త్యాదిచిహ్నముల నందినపైని సంస్కృ తాంధ్రశబ్దములకు యథాయథముగా సమాసములు (తత్పు

రుపకర్మధారయద్విగువులు) చేసికొనవచ్చుననియు, నిఁక శుద్ధ సంస్కృతశబ్దముతో నాంధ్రశబ్దములకు సమాసముచేయుట యథేచ్ఛముగా జరుప వలనుపడదనియు, బిరుదాదివాచక పరిమితాంధ్రశబ్దములతోనే శుద్ధసంస్కృతశబ్దము కర్మధారయ సమాసముగా (కృష్ణరాయఁడు మొ.) సమసించుననియు విశద మగుచున్నది. కావునఁ బైనుదాహరించిన "సంస్కృతపదేనపరిమిత" మిత్యాదిసూత్రములోని పరిమితశబ్దమున కాఱక్షరముల పరిమితి యని యర్థముచేయుచు నథర్వణుఁడు

"ఆంధ్రే షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే"

అని వివరించినట్లు వ్రాసి "వాఁడిమయూఖములు, వేఁడిపయో నారలు, వేయి మున్నూఱుగజములు" అనురీతి సమాసములను బాలసరస్వత్యహోబలపఁడితాదు లుదాహరించుట కేవలము సంగతమై యున్నది. ఇట్టి నియమమునే యంగీకరించినచో "ఒకవేయిమున్నూఱుగజములు, కటికిచీఁకటితిండికరములు, ర్వఁజాలని వాఁడిమయూఖములు," మున్నగు సమాసము లెల్ల వ్యాకరణసంస్కార విదూరములే యనవలసివచ్చును గదా. వేయేల! అథర్వణాచార్యుఁ డందలి పరిమితశబ్దమునకు నేను బైని వ్రాసినరీతినే బిరుదాదివాచక పరముగనే యర్థముచేసి యీక్రిందిరీతిని వివరించియున్నాఁడు.

"ద్వ్యక్షరాది చతుర్వర్ణ, పర్యంత జననామసు,
లోప స్స్యా ద్డ్వాది వర్ణానాం, శబ్దేరాయాదికే పరే,
క్వచి దిత్వం క్వచి న్నత్వం, క్వచి త్పత్వమ్........"

పై సందర్భమునుబట్టి యాంధ్రశబ్దచింతామణి కర్ణాట కారికావళి వివరణగ్రంథమనుటకు సందేహములేదుగదా.

(౫౭) నన్నయకాలమువఱకును జిరకాలమునుండియు నాంధ్రులకును గర్ణాటులకును లిపి యొక్కటియై యుండెడిది. అట్టి యాంధ్రకర్ణాట సాధారణలిపియందుఁ గొన్నిమార్పులు చేసి తెల్గున కొకశ్లాఘ్యమగు ప్రత్యేకలిపిని నన్నయ యీక్రిం దిరీతి నుపదేశించెను.

"అప్పకవిప్రస్తుతేక్షిత నాంధ్రలిప్యుద్ధారకం శ్లోకత్రయమ్ ......
శ్లో॥ బాలేందు పరిధి శృంగాః, పర్తనుశిరలిఖి దాత్రపరశు సమాః,
ఆద్యా ఇథకరతుల్యాః సదీర్ఘా శ్చాలసన్నిభా వర్ణాః
దరశార్ఙ్గ పిప్పలదళాంకుశ, పన్నగసన్నిభాః క్రమా త్పరుషాః
స్వంభవితేఖాధిక్యా, స్తవేవ వర్గద్వితీయవర్ణాద్యాః
కీర తరి హస్తిమస్తక, శుక్తి ఘలాసన విత్తర్ది సీరసమాః
అంతస్థా శ్శోష్మాణో, దంత్యావకారగుణకాలౌచ బిందుయుతౌ॥
(అథర్వ. ౧౫౬ పుట.)

ఆంధ్రకర్ణాటసాధారణ లిపియందుఁ గొన్ని మార్పులు చేసి తెల్గునకొక శ్లాఘ్యమగు ప్రత్యేకలిపిని గల్పింపఁగోరి నన్నయభట్టు పైని వర్ణించిన రీతి నెల్లరకును సుజ్ఞేయమైయుండు టకయి యప్పటి కలవాటులోనున్న యా లిపినె చాలవఱకు గ్రహించి స్వల్పములగు మార్పులు చేసెను. అచ్చులును గొన్ని హల్లులును బ్రత్యేకస్థితిలో నొకరీతిగను వేఱొకహల్లుపై నిల్చునపుడొకరీతిగను నావఱకుండఁగా నట్టివిస్తర మేలయని తలఁచి

యచ్చులకును "యరల" అను హల్లులకును వానిసంశ్లేషరూపము లగు గుణితములోని యాకారములె ప్రత్యేకస్థితిలో సైత ముందు నట్లుగ నేర్పాటుచేసి యట్టి వాని యాకృతిని బాలేంద్వితాద్యాదిక ముచే వర్ణించెను. తక్కిన హల్లులు గుణితములోను ప్రత్యేకస్థితి లోను సాధారణముగ నొక్కరీతినె యుండుటంజేసి వానిని యథాస్థితముగనె వర్ణించెను. కాని స్పర్శములందు మాత్రము గొప్పమార్పు చేసెను. అయిదువర్గములలోను వర్గప్రథమాక్ష రములను మాత్రమె యాంధ్రకర్ణాటసాధారణ లిపిలోని వానిని దీసికొని వానిమీఁద నొక్కొక్క నిడుపుగీఁత గీయుటచేత వర్గ ద్వితీయాదు లేర్పడునని నియమించెను. వర్గప్రథమములపైని మహాప్రాణ నాదాదియోగముచే వర్గద్వితీయాదులు జనించును. కాన నట్టి వర్ణపార్థక్యసంపాదకలక్షణములకు గుఱుతుగా నొక్కొక్క గీఁతగీయుట యక్షరతత్త్వశాస్త్రానుకూలముగ నుండు నని యాతఁడు తలంచియుండును. ఉదా—అప్పటి వర్గప్రథమ ములు—" " బాలచంద్రాకారమగు 'అ' కార ముతోఁగూడినవి " " కవర్గద్వితీయాదులు " =ఖ; =గ; =ఘ; =ఙ". ఇట్టి నన్నయోపదిష్టలిపి లోని స్పర్శములమీఁది గీఁతలను లెక్కించికొని శీఘ్రపఠనాది కము చేయుట శ్రమాపాదకమని తలంచి కావలయు నథర్వణా చార్యుఁ డట్టిగీఁతలను గీయుటలో మహాప్రాణయోగమున నేర్పడు నొత్తక్షరములకుఁ గ్రింద గీఁతలను గీయవలెననెడి

మార్పును జేసెను. ఆంధ్రకర్ణాటసాధారణలిపిలోని తలకట్టు '‿' అను నాకారముగలది. దానిని దీసివేసినచో పొల్లగు వ్యంజనపు గుఱుతగుచుండెను. కాని పొల్లు హల్లునకు గుర్తుగా వ్యంజనలిపిమీఁద నొక తిర్యగ్రేఖ '/'అను రీతిని గీయుట నన్నయనాఁటికె యంకురించి యథర్వణునినాఁటికి విస్తరించెను. కాన నట్టివిషయమును సైతమథర్వణుఁడంగీకరించి తనచేసిన సవరణముల నీ క్రిందిరీతిని వర్ణించెను.—

శ్లో. "పంచ వర్గాదయో వర్ణా। శ్శంఖ శార్ఙ్గాది సన్నిభాః।
తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వం। దండరేఖాన్వితా అధః।
త ఏవచ ద్వితీయా స్స్యు। రూర్ధ్వరేఖాద్వికాన్వితాః।
ప్రథమాస్తు తృతీయాః స్యు। స్తృతీయా స్తే చతుర్థకాః।
రేఖాద్వయాధోచండేన। యుక్తాః స్యు రనునాసికాః।
మిశ్రదండద్వయోపేతాః। ప్రథమా లిపయ స్స్మృతాః॥
తిర్యగ్రేఖాయుజశ్చోర్ధ్వ మిత్యస్య పూర్వేణాన్వయః"
(అహోబల ౧౮౦ పుట).

దీనిచొప్పున నేర్పడెడి కవర్గము—

పయిరీతిని నన్నయోపదిష్ట లిపినే సవరించుచు నన్నయ చెప్పిన వరశాస్త్రేత్యాదిక కారికనే యనువదించుచు "పంచవర్గాదయోవర్ణా, శ్శంఖశార్ఙ్గాదిసన్నిభాః" అని యిట్లథర్వణాచా

ర్యుఁడు చెప్పుటచేత "బాలేంద్విత్యాది చింతామణికారిక లథర్వ
ణుని నాఁటికే (క్రీ. శ. ౧౨౦౦) చింతామణిలో నున్నవని నిస్సందే
హాముగాఁ జెప్పవచ్చును. బాలసరస్వత్యప్పక వ్యహోబలపండి
తుల కీశ్లోకములు సరిగా బోధపడలేదు. కావుననే బాలసరస్వతి
యీనన్నయకారికలకుఁ డీక వ్రాయఁడయ్యె. అక్కారణముననె
లేఖకులు వీనిని దొలఁగించుటచేత బాలసరస్వతీయచింతామణి
లో బాలేంద్విత్యాదికారికలు లేకపోయెను. అప్పకవి నన్నయ
కారికలనాంధ్రీకరించుచు నథర్వణకారికలయర్థమునుసైత మందు
స్వకల్పితమును వలె జోడింపఁ బోయి పెక్కు ప్రమాదములకు
లోనయ్యెను. అహోబలపతి యప్పకవిదారినే పోయెను. (పారిజా
తము ౨౮౦. వి.) ఇట్టి వీరుగాని వీరి గ్రంథములను జూచిన
వేఱొకరు గాని యీకారికలను బ్రక్షిప్తము చేసిరేమోయనుట
విశ్వసనీయము కాదుగదా, ఇంతయేల! అథర్వణునినాఁటికె
యివి వెలసియున్నవని పై యథర్వణుని సవరణమె విశదపఱుపఁ
జాలును గదా.

నన్నయ వర్ణించిన యాకారములలోఁ గొన్ని నాఁటికిని
నేఁటికిని నించుమించుగా నేకరీతినె యున్నను "శార్ఙ్గ — =
ఙ్; పిప్పలదళ — = ట్; అంకుశ — = త్;
పన్నగ — = ప్; శుక్తి — = వ్; తులా —
= శ్; సీర — = హ్? ఇభకర — = దీర్ఘపు
గుర్తు." అను లిపులయాకారములు దక్షిణ హిందూదేశ లిపిశాస్త్ర

మున (సౌదిండియను పేలియాగ్రఫీ) బర్నెల్ దొరగారు చూపిన యాఱవపటములోని (క్రీ. శ. ౯౮౫) లిపికి సరిపడి యున్నవి. ఇఁక నవి నేఁటి లిపికే గాక యందు బర్నెల్ దొరగారు చూపిన యేడవ పటములోని పదునొకొండవశతాబ్దపు లిపికిఁగాని యెనిమిదవ పటములోని పండ్రెండవ శతాబ్దపు లిపికిఁ గాని సరిపడి యుండలేదు. కాఁగా "బాలేంద్విత్యాది చింతామణికారికలు క్రీ. శ. పదునొకండవశతాబ్దము నారంభములోనివని గాని యంతకు ముందటివని గాని యంగీకరింపక తప్పదు. ఇంతియ కాక (క్రీ. శ.) ౧౦౦౫ సంవత్సరపు శక్తివర్మశాసనమునందు సైతము తలకట్టు ' — ' అను నాకారముతోనె లిఖింపఁబడి యుండఁగా (క్రీ. శ.) ౧౦౨౨ సంవత్సరపు రాజనరేంద్రుని కోరుమల్లిశాసనమున నన్నయ వర్ణించిన యర్ధచంద్రాకారపు గుర్తగు ' ' అను నదె తలకట్టుగ నెల్లయెడలను లిఖింపఁబడి యున్నది. అది మొదలుగఁ దలకట్టు బాలచంద్రాకారమగు నట్టి గుఱుతుతోనె లిఖించుట సంప్రదాయముగ వెలసెను. నిశ్చయముగ నన్నయ యుపదేశముననె యట్టి మార్పు మొదటఁ గోరుమల్లి శాసనములో సంభవించె నని విశ్వసింపఁదగియున్నది. ఈయొక్క నిదర్శనమె చింతామణి నన్నయరచితమని స్థిరపఱుచుటకు సమర్థమై యున్నది గదా.

ఇట్లై యథర్వణుఁడు చెప్పిన వర్గద్వితీయచతుర్థముల యథోదండాకారరూపమగు నొత్తుగుఱుతు సైత మథర్వణు

నకుఁ బూర్వమున లేదు. ఒత్తుగుఱుతులు పదుమూఁడవ శతాబ్దపుశాసనములు మొదలుగనె యగపడుచున్నవి. కాఁగా నథర్వణకారికావళి పదుమూఁడవశతాబ్దపుదని చెప్పుటయెంత యు విశ్వసనీయ మగుచున్నది. ఇట్లె బర్నల్ దొరగారు తమ సౌదిండియను పేలియాగ్రఫీలో (31 పుట) వ్రాసియున్నారు. ఈయొత్తుగుఱుతు కన్నడమునందు సైతము తెల్గులిపిసంబంధమునఁ బదుమూఁడవశతాబ్దము నుండియె వెలయసాగినది.

(౬౨) నన్నయభారతభాగప్రయోగములనుబట్టి చూచినను జింతామణి నన్నయభట్టారకకృతమనియే విశదమగుచున్నది. నన్నయభట్టభారతభాగపద్యములలోఁ దద్ధర్మార్థకములగు ‘‘ఎడి, ఎడు’’ అనువానితో నున్న ‘‘రక్షించెడి, రక్షించెడు’’ అను సంస్కృతసమధాతుజ విశేషణరూపము లగపడవు. దేశ్యక్రియాజన్యవిశేషణము లట్టివి పెక్కు లందగపడుచున్నవి. అట్లే ‘‘ఎద’’ అనురూపముతో నున్న ‘‘రక్షించెద’’ అనురీతిగల తద్ధర్మార్థక తత్సమక్రియారూపములు నన్నయ భారతభాగములో రెండుచోటులఁదు మాత్రమే యగపడుచున్నవి. అట్లే ‘‘విచారింతము’’ అనురీతిగల యుభయకర్తృకప్రార్థనాద్యర్థక తత్సమక్రియారూపములు సైతము రెండుస్థలములందుమాత్రమే యగపడుచున్నవి. ‘‘విచారింపకు’’ అను నీ వ్యతిరేకప్రార్థనాద్యర్థకరూప మొక్కచోటను మాత్రమే యగపడుచున్నది. బాలవ్యాకరణకారుఁ డానంతర్యార్థక ‘ప్రత్యయాంతరమని భ్రమ

పడినట్టియు, "రక్షించుటయును" అనుదానినే పోలియున్న ట్టియు సముచ్చయమను శబ్దపరక భావార్థక డు ప్రత్యయముతో నున్న తత్సమరూపములును నన్నయభారతభాగమున రెండు చోట్లనుమాత్రమే యగపడుచున్నవి. (౧౧౧ విష) "తేజరిల్లమి, రక్షింపమి, లంఘింపమి" అను వ్యతిరేకభావార్థక మి ప్రత్యయాంత తత్సమరూపములు మూఁడు మాత్రమే యందగపడుచున్నవి. అట్టి వ్యతిరేక క్త్వార్థక తత్సమరూపములు సైత మల్పముగనే యున్నవి. పై ప్రత్యయములతో నున్న యాచ్ఛిక క్రియారూపములు మిక్కిలి ప్రచురముగ నగపడుచున్నవి. పైసందర్భమునుబట్టి పై ధాతుల సంస్కృతసమరూపములను బ్రచురముగాఁ బ్రయోగించుట నన్నయభట్టారకహృదయము కాదని తోఁచక మానదు గదా. నన్నయభట్టారకుని యట్టి నిగూఢాశయము నొక్క యాంధ్రశబ్దచింతామణిమాత్రమే పాటించుచున్నది.

ఆంధ్రశబ్దచింతామణిసూత్ర

"ఉపకృతి పరిణతి సంవృతి, భేదా త్త్రివిధా క్రియా పురుషత్వాదిః,
ఉపకృతి రత్ర భూతాద్యాదిః, పరిణతి రన్యాతు రంజి వస్త్వాదిః"

అని యిట్లు దేశ్యధాతువులకు వర్తింపని యుపకృత్యాదిభేదముల నుపన్యసించి వానికి స్వార్థమున నించుగాగమువ విధించి యట్టి తత్సమధాతువులకు మాత్రమే కాలపురుషభేదములందు వచ్చు "అత్వాది" కార్యములను "వ్యాతి కాదా భావిని చాత్ స్యాత్" అనునది మొదలగు సూత్రము

చేత సిద్ధించునట్లు క్రియాపరిచ్ఛేదమెల్ల నడపి తుట్టతుద నట్లు తత్సమధాతువులకే నియతముగాఁ జెప్పఁబడిన "అత్త్వాది" కార్యములు దేశ్యధాతువులకు యథాసంభవముగా వచ్చునని "అత్త్వాది తత్సమానా మివ దేశ్యానాం క్రియాపదానాం చ" అనుసూత్రముచే నతిదేశించి యున్నాఁడు. ఇట్లు చింతామణి లోని క్రియాపరిచ్ఛేదములోని యాగమాదేశప్రత్యయా దులు తత్సమధాతువులకే నియతముగాఁ జెప్పఁబడియున్నం దునఁ దత్సమధాతువులందుఁ బ్రచురముగాఁ బ్రయోగము లేని పైనుదాహరించినరూపము లాగ్రంథములో సాధింపఁ బడవయ్యెను. అట్టివానినెల్ల యథాప్రయోగముగా వర్ణాగమము లను జేసి సాధించుకొనవలెనని సూత్రమే "పునరాగమః క్రియాణా" మిత్యాదిసూత్రముచేత నుపదేశింపఁ బడెను.

ఆంధ్రవాఙ్మయమున నొక్క నన్నయభారతభాగము నందు మాత్రమే తత్సమక్రియలయం దట్టిరూపములు సాధా రణముగాఁ బ్రయోగింపఁబడకుండుటయు నాంధ్రవ్యాకరణము లన్నిటిలో నొక్క యాంధ్ర శబ్దచింతామణిమాత్రమే తత్సమధా తువులం దట్టిరూపములను బూర్ణముగ సాధింపకుండుటయు నను నీరహస్యమును బాగుగఁ బరిశీలించునపుడు తద్గ్రంథము లేకకర్తృకములై యుండవలె ననెడియూహా విమర్శకుల మనోవీథిని విహరింపక మానదుగదా. ఇట్టి యేకాంతసంబం ధము నన్నయభారతభాగచింతామణుల కనేకస్థలములం దీవలకుఁ జూపఁబడెను.

(౫౯) మఱియు దుగాగమయుక్తరూపములకుఁ (ఎద గాగమ యుక్తరూపములకును ననవచ్చును) జింతామణి తద్ధర్మార్థకత్వము నంగీకరించుటయుఁ బయిసిద్ధాంతమును బలపఱుచుచున్నదని గ్రహింపఁజాలక యది యాసిద్ధాంతము నకు బాధకమని కవులచరిత్రకారులు వింతగ వ్రాసి యున్నం దునఁ దద్విషయము నిట విమర్శించుచున్నాను.

నన్నయభారతభాగములోని ప్రయోగములకు సరిగా నాంధ్రభాషాభూషణము కావ్యాలంకారచూడామణి ము న్నగు ప్రాచీనలక్షణ గ్రంథములలో 'ఎడ్యెడు' ప్రత్యయాంత రూపములును "ఎదగాగమ" యుక్తరూపములును (అడిగెద రు. మొ) వర్తమానార్థకములనియు దుగాగమ యుక్తరూప ములు (పలుకుదురు. మొ) భవిష్యదర్థకములనియుఁ జెప్పఁబడి యున్నట్లును, నాంధ్రశబ్దచింతామణిలో నట్లు ప్రాచీనపద్ధ తిని జెప్పఁబడక "ఉన్నానుబంధ" యుక్తరూపములు వర్త మానార్థకము లనియు "కలానుబంధ" యుక్తరూపములు భవిష్యదర్థకములనియు నవీనపద్ధతిని జెప్పఁబడినట్లును, నకా్కా రణమున నాంధ్రశబ్దచింతామణి ప్రాచీనమనుటకు వలనుపడ నట్లును నాంధ్రకవులచరిత్రమున వ్రాయఁబడి యున్నది. (రివైజ్డ్ ఎడిషను. ౪౫—౫౨ పుటలు) ఉన్న కలానుబంధముల విషయమున ముమ్ముందు విపులముగా వ్రాయఁబడును. (చూ. ౧౧౨-౧౧౫. వి.)

(౬౦) ఆంధ్రభాషాభూషణ కావ్యాలంకారచూడామణి కర్తలు భారతమునే గాక యా కాలమునందలి యాంధ్రవాఙ్మయమునే బాగుగఁబరిశీలింపకయే క్రియారూపముల కాలముల నుపదేశించిరనుట సాహసము కాదు. వీరేశలింగముపంతులు గారు స్వవాదోపయుక్తము లగు ప్రయోగములను మాత్రమె భారతమునుండి చూపి బాధక ప్రయోగములను జూపకుండుట యుక్తము కాదు. పురాతనాధునాతనవాఙ్మయములో నెచ్చటను, 'దుగా'గమయుక్తరూపములకుఁ గాని "ఎద"గాగమయుక్త రూపములకుఁ గాని కాలనియమ మగపడదు. ద్వివిధరూపములను వర్తమానభవిష్యత్కాలములు రెండింటి యందును నన్నయభట్టారకుఁడే వాడియున్నాఁడు. ఇంకను 'దు' గాగమయుక్త రూపములకు భూతకాలమునందును నరుదుగ వాడుకగలదు.

(౬౧) 'ఎద'గాగమరూపములు వర్తమానార్థకములనియు 'దు'గాగమయుక్తరూపములు భవిష్యదర్థకములనియుఁ గేతనాదులు చెప్పుటచేతను వీరేశలింగముపంతులుగారందులకు భారతమునుండి యుదాహరించి యుండుటచేతను నవి ప్రాసవిశ్రమస్థలఘటితములు కాకున్నను నాకు సమ్మతములే యగుట చేత గ్రంథవిస్తరభీతిచే మరల నిట నుదాహరింప మానితిని. ఇఁక నథర్వణాచార్యుఁడు కేతనాదులకు విరుద్ధముగ "ఎద" గాగమయుక్తరూపములు భవిష్యదర్థకములని చెప్పియున్నాఁడు. అహోబలపతి యద్దానిని సమ్మతించి యుదాహరించియున్నాడు.

ణగ్రింథేతు పాయెద నిత్యాదా
మాసు యస్యస్యా, దెత్వమేవ ప్రయోగతః,
క్రియావ్యవహారేణ ఎత్వంవిహితమ్." (అహో.౧౫౩ పుట.)

దర్శమునుబట్టి "ఎద" గాగమయుక్తరూపములకు
మును గలదనుటకు సైతము వేఱుగఁ బ్రయోగ
నక్కఱలేదు. అట్లయినను గేతనాదుల పరిమా
సుహాశయులకు విశదపడుటకయి యిటదిఙ్మాత్ర
రించుచున్నాను.

) ఎదగాగమరూపములకు భావ్యర్థమును గలదు.

పంచినఁ బదపడి చేసెద, ననక తఱి బంచిన యాతఁడుణంబ
............" (భార. ఆది. 3 ఆ ౧౧౦.)

:నకు మకుళితకరుండై గ్రుపకుం డిట్లనియె.
లోక మెల్లను । గొనియాడఁగఁ దగిన లోకగురుఁ డీయమనం
పురము నను ని । తనుమధ్య వివాహ మయ్యెదము నని పలికెన్.
(భార. ఆది. ౭ ఆ. ౧౪౫ ప.)

మాగ్నివోలె దెసలెల్లను గప్పుచు విస్ఫులింగముల్
ము సారథి జవంబున దానిటవచ్చె నేమిసే
ంలార! యీబిలము నొయ్యనఁబోయి చొరుండు దీనిఁ గ
పాంసుజాలముల భీమశిఖావళి దాఁకకుండఁగన్.
(భార. ఆది. ౫ ఆ. 30 ప.౫)

ంశ్చిలం భూమహా, వృక్షస్యాస్య సమీపతః
త్వరితం, వహ్నా దత్ర న వో భయమ్,
పాంశునాభిద్ర మపిధాస్యామి పుత్రకాః."
(భార. ఆది. ౨౨౭ అధ్యా. ౧౬ శ్లో.)

(౬౩) దుగాగమరూపములకు వర్తమానార్థమును గలదు.

సీ. మీవంశమున నరదేవోత్తములదైన సద్ధర్మమార్గంబు సలుపుదయ్య
ధర్మవిదుండవై ధర్మకామంబు లొం డొంటిని బాధింపకుండ నుచిత
కాలవిభక్తముల్ గాఁజేసి సేవింతె ధర్మువునందుఁ జిత్తంబు నిలిపి
యిమ్మల నపరరాత్రంబులం దెప్పుడుఁ జింతింతె నిజబుద్ధిఁజేయఁదగిన

ఆ.వె. రాజకృత్యములు......... (భార. సభా. ౧ ఆ. ౨౬ ప)

,,కచ్చిదాచరితం పూర్వై, ర్నరదేవ పితామహైః,
వర్తసే వృత్తి మక్షుద్రాం, ధర్మార్థసహితాం త్రిషు,
కచ్చి దర్థేనవా ధర్మం, ధర్మేణార్థ మథాపివా,
ఉభౌవా ప్రీతిసారేణ న, కామేన ప్రిబాధసే,
కచ్చి దర్థం చ ధర్మం చ, కామం చ జయతాం వర,
విభజ్య కాలే కాలజ్ఞః, సదా వరద సేవసే,
కచ్చి చ్చాపరరాత్రేషు, చింతయ స్యర్థ ధర్మవిత్.
(భార. సభా. ౫ అధ్యా)

—♦ దుగాగమరూపములకు భూతార్థమును గలదు. ♦—

క. భూమీశ హంసడిభకులు
నామగధాధీశ్వరుండు నమ్మెవ్వరు న
ద్దామభుజ వీర్యసంపద
తో మూఁడుజగములు వోపుదురు సాధింపన్.
(భార. సభా. ౧ ఆ-౧౧౫)

(హంసడిభకు లావఱకుఁ జచ్చిరి గాన (౧౧౬-౧౧౭ ప.)
నిట ,,ఓపుదురు=ఓపెడివారు" అని యర్థముచేయక తీరదు.
ఇది భావ్యర్థక మెంతమాత్రమును గానేరదు )

చ. ఇది మునికన్యయేని మఱి యేలొకొ యీలలితాంగియందు నా
హృదయము దద్దయుం దవిలె నిప్పడు కింకను నమ్మనేరన
య్యొద విజితేంద్రియుండనఁగ నిమ్మునిఁ బాయక విందునంచు దా
నిది కలరూపెఱుంగఁగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోఁ.

(భార. ఆది. ౪ ఆ. 30 ప.)

(ఇచట 'విందున్' అనుపది యొంతమాత్రమును భావ్యర్థకము కాదుగదా.)

(౬౮) పైరీతిని "ఎద"గా గమాంతరూపములకును "మ" గాగమాంతరూపములకును గాలనియమము లేమింజేసి యవి కాలవివక్ష లేని ధాత్వర్థమాత్రమునఁ బ్రయోగింపఁబడుననియు నచ్చటి సందర్భమునుబట్టియే యుచితమగు కాలము స్ఫురించు ననియుఁ దలఁచి నన్నయభట్టు వారికిఁ దద్ధర్మార్థకత్వము నంగీకరించి యుండెను. అట్టి యాతని గంభీరాశయము నహోబలపతి వివరించియు నున్నాఁడు.

"భూతాద్యర్థత్రయవిలక్షణః కశ్చిదర్థః తద్ధర్మాఖ్య ఇత్యాచార్యైః వ్యవహ్రియతే...తత్రాచార్యైః కాలమవివక్షిత్వైవ ధాత్వర్థమాత్రే వివక్షా క్రియతే అతఏవ తద్ధర్మార్థ ఇత్యన్వర్థసంజ్ఞా. తస్య ధాతోర్ధర్మః వాచ్యార్థమాత్ర మితి." (అహో. ౪౫౯ పుట.)

మఱియు 'నిప్పుమండును' మున్నగుచోట్ల నీక్రియల కేకాలమును గల్పింపరాదు. అట్టియెడలఁ గేవల ధాత్వర్థము మాత్రమే తోఁచును. ఇఁకను దాచ్ఛీల్య సాతత్యాద్యర్థవిశేషములును వీనికిఁ గలవు.

తే. ఏను జర యను రాక్షసి నిప్పురంబు
చదుకమునఁ బాయకుండుదు సంతతంబు
నీకు నిష్టంబు సేయఁగ నెమ్మితోడఁ
గోరుచుండెద నది సమకూరె నేఁడు. (భార. సభా. ౧ ఆ. ౧౫౧ ప.)

అతివిశాలమగు సంస్కృతభాషలో సైత మిట్టి లకారములు లేవు. కావుననే గదా కొంద ఱాంధ్రవైయాకరణుల కిట్టి తడఁబాటు సంభవింపవలసి వచ్చెను. పయిసందర్భమును బట్టి పరిశీలించునపుడు వెనుక నుదాహరించిన రీతినున్న నన్నయభట్టారకుని ప్రయోగములందలి గంభీరాశయములను గ్రహింపఁజాలక యాంధ్రభాషాభూషణ కావ్యాలంకార చూడామణికర్తలు క్రియాకాలముల నుపదేశించుటలో నవిమర్శితముగ నపమార్గమునఁ బోయిరని యెవ్వరికేని తోఁచకమానదు. గదా మఱియుఁ బైనుదాహరించిన విషయములను బరిశీలించునపుడు చింతామణి నన్నయభారతభాగములకుఁ గల యాంతరంగికసంబంధము విశదపడకపోను గదా.

(౬౫) పైనుదాహరించినరీతిని జింతామణి నన్నయభారతభాగములకుఁ గల యేకాంతసంబంధమును బరిశీలించినను, జింతామణి గ్రంథాదిని జేయఁబడిన కావ్యప్రసంగమును విమర్శించినను, జింతామణి సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొను మార్గములనుమాత్రమే ప్రధానముగఁ జేసికొని యాచ్ఛికభాషాపద్ధతులఁ జూపుట కంతగాఁ బ్రయత్నింపకుండుట నాలోచించినను, సంస్కృతశబ్దములలో సైతము కావ్యో

పయోగి ప్రసిద్ధశబ్దములనే తెనుఁగులో నుపయోగించుకొన వలెనని చేసిన "విరళా" నిత్యాదిసూత్రపు నియమమును బరికించినను, మహాభారతాంధ్రీకరణసందర్భమున నన్నయభట్టారకుఁ డేర్పఱిచికొన్న గ్రాంథికాంధ్రభాషాలక్షణములయొక్క—అందును సంస్కృతసమశబ్దలక్షణములయొక్క—ఏర్పాటుతే యాంధ్రశబ్దచింతామణిగ వ్రాయఁబడెనని విమర్శకులగువిద్వాంసులకుఁ దోఁచకమానదు గదా.

---

# ఆంధ్రశబ్ద చింతామణి విషయ పరిశోధనము.



## II

### కావ్యభాషకే సంస్కారము.

(ఆంధ్రవ్యాకరణములు సంస్కృత వ్యాకరణానుసారులు)

(౬౬) విచక్షణులారా, నా విన్నవించిన మొదటిభాగమునం దాంధ్రవ్యాకరణరచనమునకు నన్నయభట్టారకుఁడే మొదటివాఁ డనియు, నాతని గ్రంథములలోఁ జింతామణి రచనయే మొదటిదనియు విశదపఱిచియున్నాను.

(౬౭) పదస్వరూపాజ్ఞానము, నుచ్చారణమునందలి త్వర, యస్పష్టశ్రవణము, నుచ్చారణమునందలి సుఖాపేక్ష, వర్ణోత్పత్తిస్థానములలోని లోపములు, దేశములోని శీతోష్ణస్థితి భేదములవల్లఁ గలిగిన వర్ణోత్పత్తిస్థానములందలి యీషద్భేదములు మున్నగు పెక్కుకారణములచేత వ్యావహారికభాష లెవ్వియైనను సర్వసామాన్యముగా వివిధములగు పరిణామములను గాలక్రమమున నందుచుండుననుట సకలభాషాతత్వశాస్త్రజ్ఞులకును సమ్మతమే యగుటచేతఁ దద్విషయమున నంత

గాఁ జర్చింపవలసిన ప్రసక్తి లేదు. అట్లు సర్వకాలములందును బహువిధములుగ మాఱుచున్న భాషలలోఁ గొందఱు ప్రాజ్ఞులు వ్యవహరించెడు భాష తక్కిన సామాన్యజనుల వ్యవహారములో నున్న భాషవలె విశేషములగు మార్పులనందక ప్రాచీనస్థితిలోఁ జాలవఱకు నిల్చుననుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు గదా. ఇందుల కిప్పటినాగరకజనవ్యవహారభాషకును సామాన్య జనవ్యవహారభాషకును గలభేదమే ప్రబలనిదర్శనము కాఁజాలియున్నది.

ఇట్లు పరిణామము నందుచున్నపు డాయాకాలములందుఁ బూర్వపూర్వభాష లుత్తమములైనవనియుఁ, బైనివ్రాసిన యుచ్చారణత్వరాది కారణములచేత వర్ణలోపాదులనందిన యుత్తరోత్తరభాష లపభ్రష్టము:లనియుఁ దత్తత్కాలములలోని పండితులు తలంచు చుండుటయు, నట్టి యపభ్రష్టభాషను వాఙ్మయోపయోగిగా నంగీకరింపక యప్పటి కుత్తమముగా వారికిఁ దోఁచు పూర్వ పూర్వ సంప్రదాయములతో నుండుభాషనే గ్రాంథికభాషగ నంగీకరించుచుండుటయు మనపూర్వుల సంప్రదాయ మగుటచేత నిప్పటికిని నట్టిసిద్ధాంతమే మనచేత సయితము పాటింపఁ బడుచున్నది. పరిశీలింపఁగా ననాదియగు నీ ప్రపంచమున నేభాషయైనను బై నుదాహరించినరీతిని బూర్వపూర్వభాషల యపభ్రంశపు రూపములతోనే యుండుననుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలకున్నను దమతమ కాల

కులనాఁటికిఁ బ్రాచీనస్థితిలో నున్నభాషయే పవిత్రమైనదని తలంచుట మనపూర్వులకును మనకును సమ్మతమైయున్నది. ఆచారవ్యవహారములలోవలెనే భాషావిషయములోను నట్టి సంప్రదాయము నుల్లంఘించి లోకవిరుద్ధముగఁ బ్రవర్తించుట యనుచితమగుటంజేసి మహాకవులు రసికజనుల మెప్పును గోరి ప్రాచీనసంప్రదాయములతో నున్నభాషనే యుత్తమకావ్యాదులలో నుపయోగించుచుండుట కభిలషించుచుందురు. మఱియు వ్యవహారమునకు బొత్తిగా విదూరమైన కేవలప్రాచీనతమభాష నుపేక్షించుచుండుటయు సంప్రదాయమై యున్నది.

(ఉ-ర) అట్లైనను మహాకవులకును లోకముతో సంబంధ ముండుటచేతను వారును నితరవిషయములలో వ్యవహారభాషనే యుపయోగించుచుండుటచేతను వాసనావశముగ వారి వ్యవహారమునందుఁ జిరకాలము నిలిచియుండి వారిమనసు నచ్చికం గాంచిన యుత్తోత్తరవ్యావహారికభాషయుఁ గొంత క్రమక్రమముగా నట్టి కావ్యభాషలో సైత మనివార్యముగాఁ జొరఁబడుచుండును.

పై సందర్భముచొప్పున దేశభాషలలోఁ గావ్యభాష వేఱుగను వ్యావహారికభాష వేఱుగను నేర్పడుచుండుట సనాతనసంప్రదాయమై యున్నది. అట్టి వ్యావహారికభాష యపభ్రష్టమని పూర్తిగ నమ్మకముగల్గినట్టియు నట్టి యపభ్రష్టత

సందని గ్రాంథిక భాషతోఁ బ్రసంగించుటకు శక్తి గలినట్టియుఁ బండితులును విద్యాధ్యాపనసందర్భమునందును, వ్రాఁగూపము లగు నుపన్యాసముల నిచ్చుసందర్భమునందును దమ వ్యవహార భాషనే సాధారణముగా నుపయోగించుచుందురు. అట్లైనను నుత్తమమగు నేదేని గ్రంథమును వ్రాయునపుడు—ఇంకను నట్టి యధ్యాపనవిషయములనే గాని యట్టి యుపన్యాసములనే గాని గ్రంథస్థములుగఁ జేయునపుడు మాత్రము—సామాన్యముగ నిప్పటిగ్రంథకర్త లెవ్వరును నట్టి వ్యావహారిక భాష నుపయోగించుట కెంతమాత్రమును నంగీకరింపరు.

(౬౯) పైని వ్రాసినపద్ధతియే మనదేశములోఁ గొంత కాలమునుండియు నిర్వివాదముగఁ బండితులచేత నంగీకరింపఁబడుచుండెను. కాని కొన్నిసంవత్సరములనుండిమాత్ర మీవిషయమున వివాదము జరుగుచున్నది. మనసంఘములో నెక్కువ సంఖ్యగలప్రముఖులకుఁ బాశ్చాత్యభాషాపాండిత్య మలవడుటయే యట్టి భాషావిషయకవివాదము తటస్థించుటకుఁ గారణమనఁదగును. ఇంగ్లీషుభాషలోని గ్రాంథికభాషాపద్ధతులకును మనభాషలోని గ్రాంథికభాషా పద్ధతులకును జాలభేదము గలదు. అట్టిపాశ్చాత్య భాషావాఙ్మయపద్ధతులు మనమునఁ నాఁటిన మన యింగ్లీషుపండితులలో గొందఱు వ్యావహా భాషతోనే యెల్లగ్రంథములను వ్రాయుట సంప్రదాయప వాదింపసాగిరి. మనసంఘములోని ప్రాచ్యభాషాపండితు ల లున్ననో గ్రంథవిషయమున నెల్లెడలను గ్రాంథికభాష న

యోగించుటయే సంప్రదాయమని వాదింపసాగిరి. వాదింప
సాగి రననేల? చాలవఱకు కందఱమును నేఁటివఱకు కట్టిసంప్ర
దాయమునే పాటించుచున్నాము.

ఇంగ్లీషుభాషకు గ్రాంథికదశ యారంభించుకాలమున
నాభాషలో నధికముగ నాంగ్లోశాక్సను పదములుండఁగాఁ
గొంతవఱకు మఱికొన్నిభాషల పదములు సైతము దేశములో
నపుడు స్థిరపడిన జనులసమ్మేళనమువలన మిశ్రితములై యుం
డెడివి. అప్పటి యింగ్లీషులో గ్రంథములు లేవు. ఎవ్వరేని
యరుదుగ గ్రీకు లాటినులందుఁ బండితులై యుండినవా రందలి
గ్రంథములతోనే వినోదించుచుండెడివారు. అట్టిసందర్భములో
నింగ్లీషునకు గ్రాంథికావస్థ యవతరించుటచేత వారికి దేశము
లో వాడుకయం దున్నభాషయే యాధారమయ్యెను. మనవా
రూఁతఁగొనుట కున్నతదశలో నున్నసంస్కృతము మనవారి
కనేకులకు వశపడియున్నట్లుగ నింగ్లీషువారి కేదియు నట్లు వశ
పడియుండలే దయ్యెను. ఆకారణముచేత నాఁటికిని నేఁటికిని
వ్యావహారికభాషలో నాగరకభాషయే వారికి గ్రాంథికభాష
యగుచు వచ్చుచున్నది. కర్తృక్రియలకుఁ బురుష వచనాదులు
సరిపడకయుండుట మున్నగురీతులనుండు కేవల పామరభాషను
మాత్రమే విడుచుచుండుట వారికి సంప్రదాయమగుచు వచ్చె
ను. ఆకారణమువలన నట్టి సంస్కారములు మనసుననాఁటిన
మనసంఘములోని యింగ్లీషుపండితులలో ననేకులు మనభాష

యొక్క చరిత్రమును బాగుగఁ బరిశీలింపకయుఁ బ్రాచ్యపండితు
మాత్రి సులభమగు మన గ్రాంథిక భాషయొక్క సంప్రదాయము
చొప్పునఁ గొందఱు గ్రంథరచనము చేయఁజాలకయు నింగ్లీషు
సంప్రదాయముచొప్పున దేశీయనాగరకజన వ్యవహారస్థభాష
యే యెల్లవిషయములందును గ్రాంథికభాషయై యుండవలె
నని పెనఁగులాడసాగిరి.

(౭౦) పైనివ్రాసిన యింగ్లీషుభాషాపద్ధతి యాంధ్ర
భాషకు సరియగు నాదర్శము కాదు. ఆంధ్రభాషకు గ్రాంథికతా
వస్థ కలుగు కాలమున మనసంఘములో ననేకులు సంస్కృత
ప్రాకృతభాషలలో గొప్పపాండిత్యము గలవారై యుండిరి.
అప్పటికే సంస్కృతము పొందవలసినంత మహోన్నతదశను
బొంది మిక్కిలి విశాలమై యుండెడిది. అట్టి మహోన్నతదశ
లో నున్న సంస్కృతభాషయందు మహాపండితులయి యున్న
మనపూర్వులు తెలుఁగున గ్రంథరచనమున కారంభించునపుడు
వారు సంస్కృత ప్రాకృతభాషాసంప్రదాయములను బాటిం
చుట యసంగతము కాదుగదా. అట్టిసంస్కృతభాష వాసనల
తోనున్న మనవారు తమకాలములోఁ గేవలము నపభ్రష్టము
గాఁ దమకుఁదోఁచు తెనుఁగుభాషను గ్రాంథికభాషగా నంగీక
రింపఁజాలరు గదా. మఱియు నప్పటికి మహోన్నతదశలోనున్న
సంస్కృతభాషలో నాఱితేఱినవారును, నందలి భావ వైశా
ల్యమును సేవించినవారును నగు మనపండితు లప్పటి యల్ప

తరమగు వ్యావహారికభాషతో గ్రంథరచనమునకుఁ బూనఁ బోరు గదా. కాఁగా నప్పటికే సహజముగఁ బండిత వ్యవహారములోఁ గొంతవఱకుఁ బ్రవేశించియున్న సంస్కృత సమముల పద్ధతులననుసరించి సంస్కృతసమశబ్దములను గ్రహించు మార్గము నేర్పఱుచుకొని సంస్కృతవాఙ్మయములో నుత్తమమును గథాచమత్కారచమత్కృతమును వివిధరసభావ బంధురమును నగు మహాభారతము నాంధ్రీకరించుటకు నన్నయ భట్టారకుఁ డారంభించెనని యూహింపవలసి యున్నది. సామాన్యముగా వాఙ్మయవ్యాప్తి గలిగినపిదపనే భాషామార్గముల నుపదేశించు వ్యాకరణము లుదయించుట సంప్రదాయమై యున్నను విశాలభావబంధుర గ్రంథరచన కప్పటి వ్యావహారికాంధ్రము చాలదని తలఁచి సమర్థమగు సంస్కృతభాషను దెనుఁగులోనికిఁ దెచ్చికొనెడిమార్గములను వాఙ్మయరచనారంభదశలో నన్నయభట్టేర్పఱుచుకొనెననుటయు స్వభావ సిద్ధమే యనుటకు సందేహము లేదు.

మఱియు నాతఁడు, దేశ్యభాషలోఁ గొన్ని సామాన్య పద్ధతుల నేర్పఱుచుకొనుటలోనయిత మప్పటి పండితవ్యవహారమున నాంధ్రభాషలోఁ గల వాడుకలనుబట్టి యాంధ్ర భాషా సహజములగు ప్రాచీన సంప్రదాయములను బాటించియు, నట్టి వానిలోఁ దనకాలమున నున్న సహృదయశ్రుతి సమ్మతిని బరిశీలించియు, సంస్కారము చేయసాగెనని యూహింపవలసి యు

న్నది. పరిణామమునందిన నాగరక తదన్య భాషలలోఁ జాలస్థల ములందు మార్పులుగల్గినను గొన్నింటియందుమాత్రము పూర్వ మూలభాషాసంప్రదాయములు నిలిచియుండుట మనయనుభవ మునకు విలక్షణమగు విషయము కాదు. చాలవఱకు నశించిన దీర్ఘముమీఁది నిండుసున్న లిప్పటికిని "దాంగున్నాఁడు, చాం తాడు" మున్నగువాడుకలలో మిగిలియే యున్నవిగదా. నేఁ టికి హ్రస్వములమీఁద నుండు నిండుసున్నలును జాలవఱకు నశించినను "చేమంతి, పావంచ, నారింజ" మొదలగుపదము లలో నిలిచియే యున్నవి గదా. ఈవిధముననే పూర్వపదాంత మున నున్న నిండుసున్నమీఁదను బొల్లునకారముమీఁదను మాత్రమే పరపదాదిస్థపరుషములు సరళము లగుచుండెడి కాల మున నుత్పన్నములగు "కాంగల, కాంబట్టి, రాంబట్టి, చేయంబట్టి, చేయంబడు, చదువంబోవు" మొదలగువానిలోని నిండుసున్న లును బొల్లునకారములును దాది కర్ధానుస్వారస్థానీయమగు నచటి యానునాసిక్యమును నశించిన నేఁడును "కాగల, కాబట్టి, రాబట్టి, చేయబట్టి, చేయబడు చదువబోవు" మొదలగువాని వ్యవహారమున సరళాదేశములు నిలిచియే యున్నవి గదా. ఇట్లు నాగరకజనవ్యవహారములో నిలిచి యున్న ప్రాచీనరూపము లనఁదగు వానినిబట్టియే పూర్వపూర్వభాషాసంప్రదాయముల నూహించి సంగ్రహించియుఁ బండితజనశ్రుతి విరుద్ధములగు వానిని యథోచితముగ సంస్కరించి గ్రహించియు నన్నయాథ

ట్టారకుఁడు వ్యావహారికాంధ్రభాషను సంస్కరించెననుట సత్య విదూరము కానేరదు. ఇట్లే నన్నయభట్టుకాలమునకున్న యుద్ధమల్లుని బెజవాడశాసనము మున్నగువానిలోను నప్పటి కరుదుగ నుండియుండవచ్చునని యూహింపఁదగియున్న పాటలు పద్యములు మున్నగువానిలోను గల ప్రాచీనభాషాసంప్రదాయ సూచకప్రయోగములు సైతము నన్నయభట్టారకునకు భాషాసంస్కారవిషయమునఁ దోడ్పడియుండవచ్చుననియు నూహింపనగును. అట్లే దేశవ్యవహారములో నున్నట్టియుఁ బండితవ్యవహారములో నుండియుండవేమో యని సందేహింపఁదగినట్టియు 'లచ్చి' మున్నగు తద్భవపదముల సంగ్రహమునం దాతనికిఁ బ్రాకృతవ్యాకరణములలోని భాషాపరిణామపద్ధతులు హస్తావలంబము నిచ్చియుండునని యూహింపనగును.

దక్షిణదేశమున నిట్లు భాషాసంస్కారముచేయుట ప్రాచీనకాలమున నాచారములో నుండెనని యీావలకు వ్రాసియేయున్నాను. (౧౦. వి)

(౨౧) అట్లు సంస్కరించిన యుత్తమమగుభాష "ఉదాత్త రసాన్విత కావ్య" రచనమునందుమాత్రమే వాడవలసియుండునని యాతఁడు తలంచినట్లు చింతామణి వ్యాకరణ రచనారంభమున నతఁడుచేసిన "విశ్వశ్రేయః కావ్యమ్" అనెడి కావ్యప్రశంసయే విశదీకరించుచున్నది. కావ్యములు దేశభాషాగ్రథి

తము లగునపుడే జీవకళలతో నలరారుచు రసోదంచితములు కానోపుననియు, నవియే కాంతాసమ్మితము లనందగి దేశీయులకు సముపదేశములను జేసి శ్రేయస్సు ననఁగాఁ త్రివర్గప్రాప్తి పూర్వక పరమపురుషార్థమును బ్రాపింపఁ జేయఁ జాలుననియు నక్కారణమున భాషాకావ్యరచనమును దానికి సాధనమగు చింతామణిరచనమును 'జగద్ధితంబు' లనఁగా దేశోద్ధరణసమర్థము లగుననియు, నాతఁడు తలంచిన ట్లీక్రింది యాతని చింతామణి భారతసూక్తులు విశదీకరించుచున్నవని యీవఱకు వ్రాసియే యున్నాను. (౧౮—౨౮ వి)

"విశ్వశ్రేయః కావ్యం, తదదోషా పరిష్కృతా చ వాగర్థా
సావా గ్యా రసవృత్తిః సాధ్యో హి రసో యథాయథం కవిభిః."

(ఆంధ్రశబ్ద. సంజ్ఞా. ౧.)

"స్వస్థాన వేష భాషా, భిమతా స్సంతో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యంతే, వైకృత కావ్యాని చాన్య దపహాయ."

(ఆంధ్రశబ్ద. సంజ్ఞా. ౨

ఉ "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారత సంహితా రచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్."

(భార. ఆది. ౧ ఆ. ౨౬ :

(౭౨) సామాన్యముగా నాయాశాస్త్రాచార్యు లవై శాస్త్రములే పరమపురుషార్థదములని చెప్పుట సంప్రదాయమై

యున్నను నన్నయభట్టారకుఁ డాంధ్రశబ్దచింతామణి యను తనవ్యాకరణము మొదట రసోదంచితమగు కావ్యము శ్రేయస్సాధకమగునని చెప్పుటచేత నాతఁ డితరశాస్త్రాచార్యులవలె వ్యాకరణాది శాస్త్రపారాయణము పరమపురుషార్థమునకు సాక్షాత్కారణమని చెప్పుటకు సమ్మతింపఁ జాలఁడయ్యె ననియుఁ, దత్తచ్ఛాస్త్రములు రసాస్వాదనానుకూల భాషాపాండిత్యప్రదములై వివిధసదుపదేశక్షమ సత్కావ్యరచనావగాహన సాహాయ్యకరణద్వారమునఁ బరమపురుషార్థమునకుఁ బరంపరాకారణములు కానోపునని యాతఁడు తలంచెననియు విశదమగుచున్నది. మఱియు దేశభాషాకావ్యములు రసభావములను వెల్లివిఱియఁ జేసినట్లు వ్యవహారవిదూర సంస్కృతభాషామయకావ్యములు చేయఁజాలవనుచు 'అన్యదపహాయ' అను వాక్యముతో దేశీయరసికుల యుత్సాహమును వెల్లడించుచు సంస్కృతకావ్యములను విడిచి దేశభాషాకావ్యములను సేవించునట్లును, దేశీయులకు స్వదేశభాషాభిమాన విజృంభణము గల్గునట్లును బ్రసంగించెనని పై చింతామణిగ్రంథాదిసందర్భము విశదీకరించుచున్నది. చింతామణిలోని యనుశాసనపద్ధతి సైత మయ్యది కావ్యసేవనమాత్రప్రయోజనకమని మున్ముందు విశదీకరింపఁబడును.

(23) ఇఁక జీవద్భాషామయము లగుటచేత రసమును వెల్లివిఱియఁ జేయునవియు దేశీయులకెల్ల నుపయోగించునవి

యు నగుకావ్యములు దేశభాషతో నుండవలయునని తలంచి
నను వ్యాకరణవిషయములను జెప్పఁజాలినభాష సంస్కృతమే
యనుతలంపునఁ గవిపండితమాత్రోపయోగి యగు తనవ్యాక
రణము సంస్కృతభాషలోనే యుండవలయునని యుద్దేశించి
తాను రచించెడి యాంధ్రశబ్దచింతామణివ్యాకరణమును సం
స్కృతభాషామయముగనే చేసియున్నాఁడు. లేదా వ్యాకరణ
శాస్త్రము వేదాంగములలోని దగుటచేత నయ్యది పవిత్రమ
గు సంస్కృతభాషలో నుండనలెనని యాతఁడు తలంచియుండి
నను నుండవచ్చును. సంస్కృతభాషయం దిట్టి గౌరవ మానాఁ
డున్నదనుట యాశ్చర్యకరముకాదు. ఇట్లే యజన యాజన దాన
ప్రతిగ్రహాది పుణ్యకార్యవిషయములందుఁ బరమపవిత్రమగు సం
స్కృతభాషయే యుపయోగింపఁ దగునను విశ్వాసముతోడనే
యాతఁడు నారాయణభట్టునకు రాజరాజనరేంద్రుఁడు చేసిన
దానశాసనమును సైతము సంస్కృతభాషతోనే సంప్రదాయ
సిద్ధముగ రచించి యున్నాఁడని యూహింపవలసి యున్నది.
ఆకాలమున వాడుకలో నున్న సరిహద్దుల సంజ్ఞలను గీర్వాణిం
చినచో వేద్యములై యుండఁజాలవేమో యనుభీతిచేత సరి
హద్దులుమాత్ర మాశాసనములో దేశభాషతో వచించినవా
డయ్యెను. శిష్టాచారపరాయణుఁడగు నన్నయభట్టారకుఁ డట్లు
శాసనరచనమును సంస్కృతముతోఁ జేసినను నాకాలమందు
ను నంతకుఁ బూర్వకాలమందును దేశభాషతో నయితము

శాసనములను వ్రాయించు నభిమాన మంకురింపకపోలేదు. అట్లయినను నన్నయభట్టారకుఁడు సంస్కృత వాఙ్మయపారము ను గాంచిన యాకాలపు వాఁడగుటచేత నాతని కట్టి సనాతన ధర్మపరిపాలన తత్పరత గలుగుట వింతకాదు."

(౨౮) సీ. "తనకుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాన నిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ. వె నిత్య సత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ. (భార. ఆది. ౧ ఆ. ౯ ప.)

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మ శా
స్త్రముల తెఱం గెఱింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యము లైనయీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోఁ."

(భార. ఆది. ౧ ఆ ౧౦. ప.)

అనునవి మొదలగు భారతాదిపర్వసందర్భమునుబట్టి కృతికర్త యగు నన్నపార్యుఁడును, కృతిభర్తయగు రాజరాజనరేంద్రుఁడును ప్రాచీనాచారపరాయణులని విశదమగుచున్నది గదా. కావున వారికెంతే దేశాభిమానమున్నను వారు దాన ప్రతిగ్రహాది వైదికకార్యములందు సంస్కృతభాష నుపయోగించు వైదికసంప్రదాయమును బాటించుట వింతకాదు. రాజనరేంద్రుఁడు సీదమార్యునకుఁ జేసిన కోరుమల్లిదానశాసనము సైము సంస్కృతభాషతోనే వెలయుచున్నది. ఇంతయేల! యజన యాజన దాన ప్రతిగ్రహ వివాహోపనయనాది సమస్తవైదిక కార్యములందును బ్రత్యాబ్దికాది పితృకార్యములందును దాదికిఁ గర్తృప్రభృతులకు సంస్కృతము రాకున్నను వారిచేఁ బురోహితులు వల్లించుకొన్న సంస్కృతవాక్యములను నేఁడును బలికించుచుండుట యెల్లరకును దెలిసినవిషయమే గదా. వైదిక కార్యములందెల్ల నట్లు సంస్కృతభాషనే వాడవలయు నను సిద్ధాంతము వెలసియుండుటంజేసియే యంతకంతకు సంస్కృత భాషావ్యవహారదక్షత సోమయాజులకును లేకుండుట సంభవించుచుండఁగా నప్పటి శిష్టాచారపరాయణు లట్టి కార్యములందుఁ బలుకవలసిన శాస్త్రోపవాక్యములనెల్ల సంస్కృతభాషామయముగ రచించుటయు, వానిని బురోహితులు వల్లించుచుండుటయు నను నాచారము బయల్వెడలిన దని గ్రహింపవలయును. వైదికకార్యములలో నట్లు సంస్కృతభాషతోనే ప్రసం

గింపవలసియుండుననియు, నపభ్రష్టభాషతోఁ బ్రసంగింపరాదని యుఁ దలంచుట మనవారికి సనాతనధర్మమై యున్నది.

(౭౬) ప్రాచీనకాలమున నిట్టిసిద్ధాంతమే యుండెడిదని శ్రీవిజయనగర సంస్కృతకళాశాలాప్రిన్సిపలు వారును, బాశ్చాత్యపండితోపన్యస్త సంస్కృతప్రాకృత భాషావాఙ్మయచరిత్ర పరిశోధకులును నగు శ్రీమాన్ పరవస్తు వేంకటరామానుజ స్వామి ఆచార్యులు ఎమ్. ఏ. గారు విభవసంవత్సర చైత్రమాస భారతిలో నుపన్యసించి యున్నారు. దానినుండి యీసందర్భమునఁ గొన్నిపంక్తుల నెత్తి వ్రాయుచున్నాను. "కొంతకాలమున కావ్యావహారికభాష విశేషవికారములనుబొంది పాళీభాషగా నేర్పడెను. అప్పుడీభాషకును వైదికభాషకును విశేషభేద మగపడుటచే మనపూర్వులు ప్రాకృతజనులచే వ్యవహరింపఁబడుచున్న యీభాష వైదికకర్మములలో నుపయోగింప యోగ్యముగాదని తలంచిరి. దీనికి బౌద్ధమతప్రచారమునైతము కొంతకారణము కావచ్చును. బుద్ధుఁడు తనమతమును ప్రాకృతభాషలో జనులకు బోధించెను. బౌద్ధమతగ్రంథములు గూడ పాళీ (ప్రాకృత) భాషలో వ్రాయఁబడినవి. అందుచేత మనవారు భాషను సంస్కరించి మతసంబంధము లగుకర్మలలో నుపయోగించుటకు సంస్కృతభాష నేర్పఱచిరి."

అపభ్రష్టమగు మూలప్రాకృతభాషయనెడి యీకాలపు వ్యావహారికభాషతోఁ బవిత్రములగు వైదికకార్యములందుఁ

ప్రసంగించుటకు సమ్మతింపక మనపూర్వు లప్పటి యావ్యావ హారిక మూలప్రాకృతభాషను సంస్కరించి సంస్కృతమనెడి యొక కృతకభాషను వైదికకార్యోపయోగిభాషగా నేర్పఱచి కొనిరని పాశ్చాత్యపండితులు సిద్ధాంతీకరించి యున్నారు. ఈవిషయమునుసయితము శ్రీమాన్ రామానుజస్వామి ఆచార్యులవారు పై వ్యాసమున నీ క్రిందిరీతిని వ్రాసియున్నారు. "ఆ మూలప్రాకృతమును సంస్కరింపఁగా సంస్కృతభాష యేర్పడినది. అది (ఆమూలప్రాకృతభాష) స్వాభావికములగు పరిణామములను బొంది పాళీ (ప్రాకృత) భాషలోనికి మాఱినది. అనఁగా సహజముగా వైదికయుగములోని (మూల) ప్రాకృతభాషనుండి పాళీ (ప్రాకృత) భాష జన్మించినదనియుఁ, గృత్రిమముగా సంస్కృతభాష యేర్పఱుపఁ బడినదనియుఁ దాత్పర్యము."

"వైదికయుగమునందు వేదములలో నగపడెడు భాష నుండి కొంచెము భేదించియుండిన (మూల) ప్రాకృతభాష యొకటి వ్యవహారములో నుండెడిది. అది కాలక్రమమున సహజమైన మార్పులనుబొంది మొదటఁ బాళీ (ప్రాకృత) భాషలోనికిని దరువాత నుత్తరహిందూదేశమున వ్యవహరింపఁబడుచున్న హిందీ బెంగాలీ మున్నగుభాషలలోనికిని మాఱినది. హిందువు లీభాషను గర్మలయం దుపయోగించుట కిష్టపడక వైదిక,

మూలప్రాకృతభాషనుండి సంస్కృతము నేర్పఱిచిరి. ఇది వ్యావహారికభాష కాకపోవుటచే నెంతకాలమైనను మార్పునుబొందక యట్లే నిలిచియున్నది. శిష్టులుమాత్రము దీనినుపయోగింపఁ గలిగియుండిరి. ఇప్పటికిని నియ్యది యిట్లు వ్యవహరింపఁబడుచునే యున్నది. అంతియకాని సంస్కృత మెన్నఁడును సర్వజనవ్యవహారభాషగ నుండలేదు... యాస్కపాణినుల కాలమున సంస్కృతము సర్వజనవ్యవహారములోనుండిన దని యంగీకరించుటకును వీలు లేదు."

పాశ్చాత్యపండితులు పైనిజెప్పినట్లు మూలప్రాకృతభాషనుండి సంస్కృతభాష సృజింపఁబడె నన్నపద్ధతి వ్యస్తగణితమువంటిది. వ్యస్తగణితము చేసి వెనుకటియంకెలు తీసినట్లే "అజ్జఉత్త"అనురీతి వికారములుగలిగిన శబ్దములనుండి యట్టి వికారములు గలుగని "ఆర్యపుత్ర"మున్నగురీతి శబ్దములను వేదాదివాఙ్మయసాహాయ్యమున గ్రహించుట దుస్సాధము కాకపోయినను నది వక్రమును నసహజమును నైన మార్గ మగుటచే విశ్వసనీయముగ నగపడదు.

(౨౭) మహాభాష్య ప్రసంగమునుబట్టి పరిశీలింపఁగా నిరంకుశప్రయోగభూయిష్ఠ మగువేదభాషకు మూలమగు శిష్టసవ్యవహారస్థ గీర్వాణభాష యొకటి యుండెడిదనియు, నద్దాని పరిణామమును మూలముగఁ గొని వైదికకర్మోపయోగిగ సం

స్కరించుటచే నేర్పడినదే సంస్కృతభాషయనియు మనపూర్వు లు దలంచినట్లు విశదమగుచున్నది.




"అథ శబ్దానుశాసనమ్... కేషాం శబ్దానామ్, లౌకికానాం వైదికానాంచ... వేదాన్నో వైదికా స్సిద్ధాః. లోకాచ్చ లౌకికాః. ఏకైకస్య శబ్దస్య బహవోఽపభ్రంశాః, తద్యథా-గౌరిత్యస్య గావీ, గోణీ గోతా, గోపోతలికేత్యేవమాదయోఽపభ్రంశాః ... లోకతోఽర్థప్రయుక్తే శబ్దప్రయోగే శాస్త్రేణ ధర్మనియమః క్రియతే......సమానాయా మర్థావగతౌ శబ్దేన చాపశబ్దేన చ ధర్మనియమః క్రియతే. ఏవం క్రియమాణ మభ్యుదయకారి భవతీతి... యద ప్యుచ్యతే...నియమ ఇతి, యాజ్ఞేకర్మణి సనియమోఽన్యత్రానియమః. యాజ్ఞేకర్మణి పున ర్నాపభాషంతే." (మహాభా. ౧ అధ్యా. ౧ పాద. ౧ ఆహ్ని.)

పై మహాభాష్యసందర్భమునుబట్టి యాకాలమునకు వేదభాషయు శిష్టవ్యవహారభాషయుఁ బామరజనవ్యవహారస్థాపభ్రష్టభాషయు ననెడి మువ్విధము లగుభాష లుండెడివనియు నందు శిష్టవ్యవహారభాష నాధారముగాఁ జేసికొనియే వ్యాకరణసంస్కారము చేయఁబడినదనియు, నట్టి శిష్టవ్యవహారస్థభాషతోనే యజ్ఞకర్మములందుఁ బ్రసంగము చేయవలయు ననియు నట్టిసమయములు దప్పఁ దక్కినసమయములం దప్పటి యపభ్రష్టభాషను వాడుక చేసికొనవచ్చుననియు స్పష్టపడుచున్నది. (పాణిని సూత్రప్రయోగములలో నపాణినీయములు పెక్కుగలవు.) పై నుదాహరించిన మహాభాష్యోదాహృతము లగు "గావీ, గోణీ" మున్నగుపదములు పాళీభాషలో నుండుటచేత "అన్యత్రానియమః" అనుచోఁ జెప్పిన వైదిక కర్మేతర వ్యవహారములలో వాడుకొనవచ్చునని మహాభాష్యకర్త యంగీకరించిన యీ యపభ్రంశభాషయే పాశ్చాత్యపండితులంగీకరించిన వెనుక నుదాహరించిన మూలప్రాకృతభాషయని నిశ్చితమగుచున్నది గదా.

"పృషోదరాదీని యథోపదిష్టమ్."

అనుపాణిని సూత్రమునుబట్టియు నాసందర్భములోనున్న

కై రుపదిష్టాః, శిష్టైః... కే పునః శిష్టాః, వైయాకరణాః;... యది తర్హి శిష్టాః శబ్దేషు ప్రమాణం కి మష్టాధ్యాయ్యా క్రియతే, శిష్టపరిజ్ఞానార్థాష్టాధ్యాయీ. కథం పున రష్టాధ్యాయ్యా శిష్టాః శక్యా విజ్ఞాతుమ్, అష్టాధ్యాయీ మధీయానోఽన్యం పశ్య త్యనధీయానమ్.

యే౽త్ర విహితా శ్శబ్దాః తాన్ ప్రయుంజానం పశ్యతి, నూన మస్య దైవానుగ్రహః స్వభావో వా, యో౽యం న చాష్టాధ్యాయీ మధీతే, యేచాస్యాం విహితా శ్శబ్దా స్తాన్ ప్రయుజ్క్తే, నూన మయ మన్యా నపి జానాతీతి, ఏవ మేషా శిష్టపరిజ్ఞా నార్థాష్టాధ్యాయీతి,”

(మహాభాష్యము. ౬ అధ్యా. 3 పాద. 3. ఆహ్ని.)

అను మహాభాష్య సందర్భమునుబట్టియుఁ, బాణిని పతంజలు లిద్దఱును దమనాఁడు శిష్టవ్యవహారభాష యొకటి యుండెడిదనియు నక్కారణముననే వ్యాకరణము చదువుకొననివారు సైతము శిష్టజనవ్యవహారభాషను సాధించెడి పాణినీయవ్యాకరణపు సాధుశబ్దములను వ్యవహరింపఁగలిగినవారును గ్వాచిత్కముగా నుండెడివారనియుఁ జెప్పినట్లు విశదమగుచున్నది గదా. ఇఁక “వేదా న్నో వైదికా స్సిద్ధాః” అనుమహాభాష్యోక్తినిబట్టి వైదికభాషయు నుండెడిదనుటలో విప్రతిపత్తియే లేదుగదా.

(22) పైనుదాహరించిన సంస్కృతభాషాచరిత్రమెల్ల జాలవఱకాంధ్రగ్రాంథికభాషాచరిత్రకు మార్గదర్శకమైయున్న దనఁదగియుండుట నరయఁగా వాగనుశాసనుఁడట్టిసంస్కృతభాషాచరిత్ర నాదర్శముగాఁగొనెనని తోఁచకపోదు. నిశ్చయముగా సంస్కృతభాష యెట్లు సర్వజనవ్యవహారయోగ్యము కాదనుట సరియో యట్లే గ్రాంథికాంధ్రభాషయు సకలాంధ్రజనవ్యవహారయోగ్యము కానేరదు. శిష్టులును వైయాకరణులును దానిని వ్యవహరింపఁ గలిగినట్లే యాంధ్రపండితులు దీనిని వ్యవహరిం

పఁగలరు. శిష్టజనవ్యవహారభాషను మూలముగాఁ గొని చేసిన వ్యాకరణసంస్కారముచేత నది సంస్కృతమై వెలసినట్లే యాంధ్ర పండితుల వ్యవహారములోనున్న యాంధ్రభాషలోని కొన్ని కొన్ని సంప్రదాయములను నావఱకున్న యలంతి పద్యాదుల భాషను నాధారముగాఁ గొని మొట్టమొదట నన్నయభట్టారకుఁడును గ్రమక్రమముగ వెలసిన వాఙ్మయమునుబట్టి తరువాతి యాంధ్ర వైయాకరణులును జేసిన వ్యాకరణసంస్కారముచే నాంధ్రమును సంస్కృతమై వెలసినది. కొందఱు పాశ్చాత్య పండితులు చెప్పుచున్నట్లు కొన్ని ప్రాకృతపదములు వేదభాషలోను గావ్యసంస్కృత భాషలోను బ్రవేశించి యున్నట్లే తత్తత్కాలిక సర్వజనవ్యవహారస్థాంధ్రభాషా ప్రయోగము లాయాకవులకుఁ గల వ్యావహారిక భాషావాసనచే గ్రాంథికాంధ్ర భాషలో, గ్రాంథికభాషా సంప్రదాయానుకూలముగాఁ బ్రవేశించుచు వచ్చుచున్న వనుటయు నిశ్చయమే. అట్లు మహాకవుల నాశ్రయించి వారి మన్నన గొని గ్రాంథికాంధ్ర భాషాప్రవేశయోగ్యత నవి పొందియుండుటచే వాని ప్రయోగము విరోధింప నేరదుగాని వెనుకనుదాహరించినమన యింగ్లీషు పండితుల యభిప్రాయము చొప్పున వివిధకాలప్రాప్త వివిధవికారములతోఁగూడిన నేఁటి వ్యావహారికభాషను గ్రాంథికాంధ్రభాషతో యథేచ్ఛముగ మేళగించుటఁ బైనివ్రాసిన గ్రాంథికాంధ్రభాషా చరిత్రముతోఁ గేవలము విరోధించును గదా.

(౭౮) సంస్కృతభాషాచరిత్రమునకును గ్రాంథికాంధ్ర భాషాచరిత్రమునకును బైనుదాహరించిన రీతిని జాల సాదృశ్యమున్నను నారెండుభాషల స్థితిగతులకుఁ జాలవైషమ్యమును గలదు. నేఁటికి మాకుపలబ్ధములగుచున్న పాణినీయ సంస్కృతవ్యాకరణము రచించుకాలమునకుఁ బూర్వము రామాయణభారతాది సంస్కృతవాఙ్మయమును గొందఱు వ్యాకరణకర్తలును గలరను పాశ్చాత్యపండితులు వ్రాసినవ్రాఁతలు సత్యవిదూరములు కావు. వ్యాకరణశాస్త్రమును బాణినిముని క్రొత్తగా లోకములో నవతరింపఁ జేయలేదు. అంతకుముందు సైతము శిష్టజనవ్యవహారస్థ వైదికకర్మోపయోగి భాషయుఁ బురాణాది వాఙ్మయమును గొన్ని వ్యాకరణములును నుండెడివి. అట్టివానిని సేవించి గొప్పపాండిత్యమును సంపాదించియే పాణినిముని యష్టాధ్యాయిని రచించెను. కావుననే పాణినీయమునందు శాకల్యాది పూర్వశాబ్దికులు పేర్కొనఁబడి యున్నారు. ఇంతయేల! అష్టాధ్యాయిలోనే యొకచోటఁ బాణినిముని పూర్వాచార్యమతము నీ క్రిందిసూత్రములతో విమర్శించియుండెను.

"లుపి యుక్తవ ద్వ్యక్తివచనే" (౧ అ. ౨ పా. ౫౧ సూ.)
"తదశిష్యం సంజ్ఞాప్రమాణత్వాత్" (౧ అ. ౨. పా. ౫౩ సూ.)
"లు బ్యోగ ప్రత్యాఖ్యానాత్" (౧ అ. ౨ పా. ౫౪ సూ.)

గ్రాంథికాంధ్రమున కట్లుగాక చింతామణికి ముందటి వ్యాకరణముగాని నన్నయభారతభాగమునకు ముందటిప్రబంధ

ము గాని యగపడదు. మఱియుఁ బాణినిముని చేసిన సంస్కారము శిష్టజనవ్యవహారస్థమగు వైదికకర్మోపయోగిభాషకై యున్నది. పాణినీయవ్యాకరణమున సంస్కృతకావ్యాది వాఙ్మయస్థప్రయోగములకుఁ బ్రామాణ్యము లేదు. "గ్రాంథికాంధ్రభాషాసంప్రదాయ మట్టిది కాదు. కావ్యభాషకే వ్యాకరణసంస్కారము చేయఁబడినది. మహాకవిప్రయోగముల కాంధ్రవ్యాకరణములు లొంగికీరవలయును.

(౨౯) శ్రౌతస్మార్తకర్మములు పుణ్యసంపాదకములగుటంజేసి యట్టిపుణ్యము సుశబ్దోపయోగపూర్వక కర్మాచరణము వల్లనే లభింపఁగలదనియు, నపశబ్దోచ్చారణమున నట్టిపుణ్యము లభింపనేరదనియు, నక్కారణమున వైదికకర్మాచరణముతప్పఁ దక్కినచోట్ల నపశబ్దప్రయోగము దుష్టముకాదనియు మహాభాష్యకర్త

> "సమానాయా మర్థావగతౌ శబ్దేన చాపశబ్దేన చ ధర్మనియమః క్రియతే, శబ్దేనైవార్థోఽభిధేయో నాపశబ్దేనేతి. ఏవంక్రియమాణ మభ్యుదయకారి భవతీతి ...యద ప్యుచ్యతే ...నియమ ఇతి, యాజ్ఞే కర్మణి స నియమోఽన్యత్రానియమః, యాజ్ఞేకర్మణి పున ర్నాపభాషంతే..." (మహాభాష్యము. ౧ అ. ౧ పా. ౧ ఆహ్ని)

అనియిట్లు స్పష్టముగను కంఠోక్తముగను జెప్పియుండెను. పైరీతిని యజ్ఞకర్మములలోఁ బ్రయోగింపఁదగినవి కావను నభిప్రాయముకలవారు గావుననే మునిత్రయమువారు తమకు ముం

దటివేయగు రామాయణ భారతాదిగ్రంథములలోని ప్రయోగము లనేకములను సంగ్రహించి యుండరైరి. వేయేల! పతంజలిభగవానుఁడీయభిప్రాయము నొకచోటఁ గంఠోక్తముగనే చెప్పియున్నాఁడు. మహాభాష్యకర్త "యూస్త్ర్యాఖ్యౌనదీ" (౧. అధ్యా ౪. పాద. 3. సూ.) అనుసూత్రపు భాష్యములో 'స్త్ర్యాఖ్యౌ' అను శబ్దపు సాధుత్వము విషయమునఁ జర్చించుచు నద్దాని కొక కవిప్రయోగము నిచ్చి సాధుత్వము నంగీకరింపవలెనని చెప్పెడి పూర్వపక్షిమతము నుపన్యసించి కవులు నిరంకుశులు గాన వారిప్రయోగము లుచ్ఛృంఖలము లైయుండుననియు, నక్కారణమున వానిప్రామాణ్యమున నట్టిప్రయోగములు వైదిక కర్మములం దుపయోగించుభాషలోఁ జేర్ప నర్హములు గావనియు, నట్టి కవిప్రయోగము లపభాషితములే యనియు నిస్సందేహముగా వాని సీక్రిందిరీతిని నిరాకరించియుండెను.

"న త స్త్రీదానీ మిదం భవతి యస్మిన్ దశసహస్రాణి, పుత్రే జాతే గవాం దదౌ, బ్రాహ్మణేభ్యః ప్రియాఖ్యేభ్యః సోఽయ ముంఛేన జీవతి. ఛందోవ త్కవయః కుర్వంతి న హ్యేషా ఇష్టిః"

అను నీభాష్యసందర్భమున

"నహ్యేషేతి = అసాధవ ఏవైవ మాదయః నతు తత్ప్రామాణ్యాత్సాధుత్వవ్యవస్థా."

అని యిట్లు కైయటుఁడు వ్యాఖ్యానము చేసియున్నాఁడు. పరిశీలించి చూడఁగా నిట్టి మహాభాష్యసందర్భమునుబట్టి కవి

ప్రయోగములను బ్రమాణీకరించి యనుశాసించుట ముని యేష్టి కాదని విశదమగుచున్నది గదా. మునిత్రయమువా యిట్టిసిద్ధాంతములను బాటింపక యర్వాచీనవైయాకరణు కావ్యములలోని యపాణినీయప్రయోగములకు వ్యాక దుష్టత నాపాదించుచు

"మ్లేచ్ఛా మాభూ మేత్యధ్యేయం వ్యాకరణమ్; దేవేన సహ సామ్యం ... ఇత్యధ్యేయం వ్యాకరణమ్; ప్రాయశ్చిత్తీయా మా భూమే త్యధ్యేయం వ్యాకరణమ్; దుష్టాన్ శబ్దాన్ మా ప్రయుంక్ష్మహీ త్యధ్యేయం వ్యాకరణమ్; న మ్లేచ్ఛిత వై, నాపభాషిత వై, మ్లేచ్ఛో హవా ఏష యదపశబ్దః" అనునవి యాదిగాఁగల మహాభాష్యపంక్తుల నుద్ఘోషించు

"అపశబ్దం ప్రయుంజానో రౌరవం నరకం వ్రజేత్"

త్తను చెప్పునఁ గావ్యకర్తకు నరకదండనము విధించు దుట కేవలము నన్యాయ్యము గదా.

పరిశీలింపఁగా వైదికకర్మోపయోగి భాషానుశా మును జేయఁదలంచిన పాణినీయవ్యాకరణము కావ్యభాషా శాసనమునకు సాకల్యముగ నుపచరింపకుండుటం జేసి మ కవుల కావ్యములలోని ప్రయోగముల సాధుత్వాసాధు ముల విచారణమువిషయమున నద్దాని నుపయోగించుచు వి ర్శించి వానిని నిరాకరించుట కేవలము సాహసకృత్యే మ తీరదు. మఱియు యజ్ఞాదివైదికకర్మముల కిప్పటివలె నిప్పు ప్రచారము లేకుండుటచేతను, నిపుడు జరపఁబడెడి వై

కార్యములందు వాడఁబడవలసినభాష ప్రాచీనపండితులచేత గ్రంథములుగ రచింపఁబడియుండుటం జేసి వానిని వైదికులు మంత్రములతోఁ బాటుగ వల్లెవేసికొనుచుండుటచేతను, వైదిక కర్మోపయోగి లౌకికభాషామాత్రానుశాసక పాణినీయవిశాల వ్యాకరణము మనుష్టివలె నుపయోగించుచుండ లేదనియు నంగీకరించుట సాహసము కాదు. ఇఁక వేదరక్షాప్రయోజన మున్నదనవలసి యున్నది. ఇంతియకాక యపారమగు సంస్కృత కావ్యనాటకాలంకారాది వాఙ్మయములోని భాషకుఁ దదను శాసనప్రవణమగు విపులమైనవ్యాకరణము లేదనుటయు సాహసము కాదు.

(౮౦) సంస్కృతవ్యాకరణవ్యాఖ్యాత లనేకు లిట్టి ముని త్రయము వారి యభిప్రాయములను బాటింపక పాణినీయమునే కావ్యభాషానుశాసకముగ నంగీకరించుచు నపాణినీయ కవి ప్రయోగములను గొన్నిటిని దమ పాండిత్యమహిమచేఁ బాణి నిసూత్రములలోని 'చకారములు' మున్నగువానికిఁ జేసెడి వింత వింత వ్యాఖ్యానముల మూలమునఁ బాణినీయసమ్మతములుగాఁ జేయుచు వచ్చిరి. నిజముగా నట్టివ్యాఖ్యానములు వక్తృతాత్ప ర్య విలక్షణము లగుటంజేసి యాదరణీయములు కానేరవను టకు సందేహము లేదు. ఇంతియుగాక యట్టిప్రయత్నములో నెల్ల మహాకవిప్రయోగములకును గుదురుపాటు సంభవింప కుండఁగా వా రట్టివానినెల్ల నసాధువులనియుఁ, గావ్యప్రయో

గ్రాహ్యములు కావనియుఁ, బ్రామాదికములనియుఁ, గవులు
నిరంకుశులు గావున నెట్టెటో యవిమాత్రమె సోఢవ్యములని
యు, నట్టివానిని గావ్యములలో మనము ప్రయోగింపరాదని
యు, నిట్లు వింతవింత లగుసిద్ధాంతములను జేయుచువచ్చిరి.
కావ్యప్రయోగానుశాసనమునకై రచింపఁబడని వ్యాకరణము
నుబట్టి యట్టిప్రయోగముల కసాధుత్వకల్పనము చేయుట
యెంతవఱకు యుక్తమో విమర్శకులగు విద్వాంసులే గ్రహిం
తురు గాక. ఇఁకఁ గవిప్రయోగానుశాసనబుద్ధితోఁ గొందఱు
కొన్ని వ్యాకరణములను రచించియున్నారు గాని వారికి సైత
ము పాణినీయము కవిప్రయోగానుశాసకము కాదు గాన దాని
ననుసరింప నక్కఱ లేదన్న యభిప్రాయ మున్న ట్లగపడదు.
వారు తమ యావ్యాకరణములను బాణినీయము ననుసరించి
యే వ్రాసిరిగాని సంస్కృత వాఙ్మయస్థ మహాకవిప్రయోగము
లనెల్లఁ బరిశోధించి వాని యనుశాసనమును జేయఁబూని యుం
డలేదు. వారు పాణినీయవ్యాకరణప్రక్రియను గొంత సుళువుచే
యుచు నేవో యప్పటికిఁ దమకు స్ఫురించు నపాణినీయప్రయో
గములను గొన్నిటినిమాత్రమె సంగ్రహించుచు వచ్చిరే గాని
తమనాఁటికిఁ బ్రామాణికులై ప్రసిద్ధికెక్కియున్న మహాకవుల
గ్రంథములలోని ప్రయోగములనెల్ల సాకల్యముగవిమర్శించుచు
వానినెల్ల ననుశాసించుచుఁ దమతమ వ్యాకరణములను రచిం
చి యుండలేదు. కావుననె యవియును గావ్యనాటకాది వాఙ్మ

యస్థ ప్రయోగానుశాసనక్షమములు కాఁజాలకున్నవి. ఇంతే
యేల! సంస్కృతవ్యాకరణములచే సాధింపఁబడెడి వేనవేలు
శబ్దములు కావ్యవాఙ్మయములో నెచ్చటను వాడఁబడియుండ
లేదు. కావ్యవాఙ్మయస్థప్రయోగము లనేకములకు సంస్కృత
వ్యాకరణములచే సాధుత్వము సంగ్రహింపఁబడలేదు. ఇటిస్థితి
లో వానికిఁ బరస్పరసంబంధము నంగీకరించుట యర్థమా?
పై విషయములు తత్త్వజిజ్ఞాసువులకు విశదపఱచికొనుటకై
యిట నపాణినీయములను బాణినీయములుగ సాధించుట కర్వా
చీన వైయాకరణులు త్రొక్కినమార్గములను ముందుగ దిఙ్మా
త్రముగ నీక్రింద నుదాహరించుచున్నాను.

(౮౧) [1] "స్వాంగా చ్చోపసర్జనా దసంయోగోపధాత్."
(౪ అ. ౧ పా. ౫౪ సూ.)

అను సూత్రముచేత "కృశాంగి" మున్నగు మహాకవిప్రయో
గములలో నున్నశబ్దముల కపశబ్దత సిద్ధింపఁగాఁ గాశికావృత్తి
కారుఁడు "అంగ గాత్ర కంఠేభ్యో వక్తవ్యమ్" అని యిట్లు
చెప్పి కొన్నిటిని సంగ్రహించెను. అట్లయినను నవి యపశబ్ద
ములే యని వైయాకరణులలోని ప్రామాణికుల యాశయ
మనుచు భట్టోజీదీక్షితుఁడు వ్రాసెను.

"అత్రవృత్తిః" "అంగగాత్ర కంఠేభ్యో వక్తవ్యమ్"
(పుచ్ఛాచ్చ")
స్వంగీ స్వంగేత్యాది. ఏత చ్చానుక్తసముచ్చయార్థేన (సూత్రస్థ)
చకారేణ సంగ్రాహ్య మితి కేచిత్. భాష్యా ద్యనుక్తత్వా దప్రమాణ
మితి ప్రామాణికాః (సిద్ధాంతకౌముది. స్త్రీప్రత్య ౧౨౨ పు.)

ప్రామాణికులగు వైయాకరణుల నటుంచి కాశికావృత్తి నంగీకరించినను "స్థూలాంత్రీ" మున్నగు ముగ్ధబోధ వ్యాఖ్యానసమ్మతము లపాణినీయములై యుండిపోయినవిగదా. ముగ్ధబోధవ్యాఖ్యాకారులలో నొకఁడగు శ్రీరామతర్కవాగీశుని టీకలో నేత్రశబ్దమునకును నఙ్గాదులతోపాటుగ "ఈప్" త్యయము వచ్చునని వ్రాయఁబడియున్నది.

> "అం గాంత్ర దంత కంఠం చ, శృంగ కర్ణోష్ఠ మిత్యపి, పుచ్ఛ నేత్రం తథా గాత్రం, జంఘ మంగాది రీరితః." (ముగ్ధబోధ ౧౫౪ పుట.)

సంయోగోపధములలో "జీవ్" త్యయము వచ్చునవింత యధికముగఁ గావ్యభాషలో నగపడుచుండఁగాఁ బైపాణినిసూత్ర మెంతవఱకుఁ దదనుశాసనబుద్ధితో రచింపఁబడెనో బుద్ధిమంతు లూహింతురుగాక

II "కృఞ్ చాను ప్రయుజ్యతే లిటి."

అనుసూత్రపు తత్త్వబోధినిలో,

> "కథం తర్హి తం పాతయాం ప్రథమ మాస పపాత పశ్చాత్" (కాళిదాసుఁడు) ప్రమాద ఏ వాయమ్. న చ విపరీతప్రయోగ నివృత్తి మాత్రే సూత్రస్య తాత్పర్యాత్ పశ్చాత్ప్రయోగో వ్యవహితోఽపి న దుష్యతీతి వాచ్యమ్. విపర్యాస నివృత్త్యర్థం వ్యవహిత నివృత్త్యర్థం చేతి వార్తిక విరోధాత్."

అని యిట్టిప్రయోగముల కసాధుత్వము కల్పింపఁబడెను. పైసూత్రము నభిప్రాయమునే చెప్పుచున్న "భ్వస్కృఞామ్వమః" అను ముగ్ధబోధసూత్రపు వ్యాఖ్యానములో దుర్గాదాసుఁడు

"ఆఙ ఇతి పంచమ్యైవ పరతః ప్రయోగే సిద్ధే అనుగ్రహణం క్రియా విశేషణోపసర్గ వ్యవధానేపి ప్రయోగార్థమ్. తేన 'తంపాతయాం ప్రథమమాస పపాత పశ్చా' దితి రఘుః. 'ఉక్షాం ప్రచక్రు ర్నగరస్య మార్గా' నితిభట్టిః"

అని చెప్పెంచి సాధించి యున్నాఁడు. ఇఁకను "ప్రభ్రంశయాం యో నహుషం చకార" అను ప్రయోగాంతరము కుదురుపడ లేదు.

III. "అక్షా దూహిన్యా ముపసంఖ్యానమ్"

అనువార్తికము, గుణమును వారించి వృద్ధిని విధించి "అక్షౌహిణీ" అనురూపమును సాధించుటకే పుట్టెనని తోఁచకపోదు. అట్లయినను "అక్షోహిణీ" అను రూపముసైతము కవిప్రయుక్తమగుటంజేసి 'అక్ష' శబ్ద మూహినీశబ్దముతోఁ గూడినపుడు మాత్రమె పై వార్తికము ప్రవర్తించుననియు, 'అక్ష' శబ్ద మూహశబ్దముతోఁ గూడినపిదప 'ఇని' ప్రత్యయము చేసినచోఁ బైవార్తికము ప్రవర్తింపఁబోదు గాన 'అక్షోహిణీ' అనెడి గుణము వచ్చిన రూపము సాధువే యగు ననియుఁ, దత్త్వబోధినీకారుఁడు చెప్పెంచియున్నాఁడు. కాని వార్తికకారునకు 'అక్షౌహిణీ, అక్షోహిణీ' అను రూపద్వయమునకును సాధుత్వ ముపదేశించు తలంపే యున్నయెడల నాతఁడావార్తికమును వైకల్పికముగ నుపదేశించి యుండఁడా?

IV. ఆఙ్పూర్వకమగు హన్ ధాతువునకు స్వాంగకర్తృకత్వమునందే యాత్మనేపదము "ఆఙో యమ హనః" అనుసూ

త్రముచేత నియతమైయుండఁగాఁ బరాంగకర్మకత్వమున నా
నేపద మసాధువనుచు నీక్రింది కవి ప్రయోగముల సాధుత్వ
న క్రిందిరీతిని వైయాకరణులు చర్చించియున్నారు.

“ఆఙో౽యమ హనః” (౧. అధ్యా. 3 పాద ౨౮ సు

“ఆయచ్ఛతే, ఆహతే, అకర్మకాత్ స్వాంగకర్మ కాదిత్యేవ నే హ పర
శిర ఆహన్తి. కథం తర్హి “ఆహధ్వం మా రఘూత్తమ” మితి భట్టిః.
మాద ఏవాయ మితి భాగవృత్తిః ప్రాప్య త్యధ్యాహారో వా...”.

(తత్త్వబోధినీసహిత సిద్ధాంతకౌముది. ౪3౫ పు

“గాండీవీ కనకశిలానిభం భుజాభ్యా మాజఘ్నే విషమవిలోచనస్య :
ఇతి భారవౌ పరాంగ కర్మకత్వా దసాధు ఇతి భాగవృత్తి జుమర
చంద్రాః. వస్తుతస్తు గాండీవీ కనకశిలానిభం భుజాభ్యాం స్వం వక్షు
ఘ్నే, విషమ విలోచనస్యేతి అనాదరే షష్ఠీ. త మనాదృత్యేత్య స్వబల
క్యం సూచితవా నిత్యర్థః.” (ముగ్ధబోధ ౮౭౮ సూత్రము. వ్యాఖ

V. “విమాననా సుభ్రు కుతః పితు గృహే”

అను కాళిదాసప్రయోగమునందలి ‘సుభ్రు’ అనుచోటి సం
ధన హ్రస్వము ‘అపాణినీయము’ కాఁగా

“సుభ్రూ దీ ద్వ్య జంబార్థానాం ఘా స్వః”

అని యిట్లు (ముగ్ధ. ౧౫3 సూ.) వోపదేవుఁడు సాధిం
ఖన్నాఁడు.

VI. “త్రియంబకం సంయమినం దదర్శ”

అనుచోటి త్రియంబకశబ్ద మపశబ్దముగనే పరిగణింపఁ బడు
న్నది. ఆశ్లోకమునకు వ్యాఖ్యచేయు సందర్భమున

"మహాకవి ప్రయోగత్వా త్సోఢవ్యః"

అని మల్లినాథుఁడు వ్రాసియున్నాఁడు.

వేయేల! మనుచూర్గుఁడు మున్నగు వ్యధికరణ బహువ్రీహిప్రయోగములెల్ల నపాణినీయములె కదా. రామలక్ష్మణులు రావణేంద్రజిత్తులను జంపిరి మొదలగు చోటులలో యథాసంఖ్యార్థకములగు ద్వంద్వ ప్రయోగములెల్ల నపాణినీయములెకదా. త్రిలోకములు, పంచపాండవులు, చతుర్యుగములు త్రిపురుషులు మున్నగు ప్రయోగములెల్ల నపప్రయోగములే కదా. అద్యతనభూతము, అనద్యతన భూతము, అనద్యతనపరోక్షభూతము, మున్నగు నియమములు వీడిన ప్రయోగములెల్లఁ బాణినీయసమ్మతములు కావుగదా "ఇకోయణచి, సనాద్యంతా ధాతవః, సుప్తిఙంతం పదమ్" అనునవి మొదలగు పాణినిసూత్రప్రయోగములెల్ల సూత్రము లగుటచేఁగదా సాధువు లగుచున్నవి. ఇట్టివి పెక్కు గలవు. ఇట్టివానిసాధుత్వమును బాణినీయవ్యాకరణమును బట్టి విమర్శించుట యుక్తముకాదు గదా.

(రా౨) పైనుదాహరించిన సంస్కృత వైయాకరణమార్గమునె యనుసరించి యహోబలపండితాదులగు నాంధ్రలాక్షణికులు సైతము పెక్కు పెక్కు మార్గములను ద్రొక్కి యున్నారు.

(రా3) పాణినిముని శిష్టవ్యవహారస్థభాష నను శాసించిన సూత్రములచేత సాధ్యములగు శబ్దములకు, సామాన్యుఁడు

తన యెఱుకలోఁ బ్రయోగ మగపడకున్నంతమాత్రమున నప్రయుక్తతాదోషమును గల్పించుట సాహసమని యొకసందర్భమున మహాభాష్యమున వ్రాయఁబడెను. అనఁగా ననేకప్రదేశములలోనున్న సంస్కృతవాఙ్మయమున నేచ్చటనేని యట్టి వానికిఁ బ్రయోగమున్నపు డట్టివి, శిష్టవ్యవహారమున నైత ముండెడివనియు, నకారణముననె పాణినిముని వాని ననుశాసించియుండెననియు, నూహించుట కవకాశ ముండుటచేతను, నట్లనేకస్థలములలో నున్న సంస్కృతవాఙ్మయమున నెచ్చటను వానికి వాడుక లేదనుట సుకరము కాకుండుటచేతను, నట్లనుట సరికాదని మహాభాష్యకర్త యభిప్రాయముపడెను. కావుననే యట్లప్రయుక్తములని శంకింపఁబడినశబ్దములకుఁ బ్రయోగములను జూపెను.

"అ స్త్యప్రయుక్తః, సంతివై శబ్దా అప్రయుక్తాః, ఊష, తేర, చక్ర పేచేతి......సర్వే ఖల్వప్యేతే శబ్దా దేశాంతరేషు ప్రయుజ్యంతే...... మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః, సప్తద్వీపా వసుమతీ, త్రయో లోకాః, చత్వారో వేదాః, సాంగా స్సరహస్యా బహుధా భిన్నాః, ఏకశత మధ్వర్యు శాఖాః, సహస్ర వర్త్మా సామవేదః, ఏకవింశతిధా బాహ్వృచ్యమ్, నవధా థర్వణో వేదః, వాకోవాక్య, మితిహాసః పురాణం వైద్య మిత్యేతావా ఞ్ఛబ్దస్య ప్రయోగవిషయః, ఏతావంతం శబ్దస్య ప్రయోగ విషయ మననునిశమ్య సంత్యప్రయుక్తా ఇతి వచనం సాహసమాత్ర మేవ ......యేచాప్యేతే భవతాఽప్రయుక్తా అభిహితాః శబ్దాః ఏతేషా మపి ప్రయోగోదృశ్యతే. క్వ—వేదే. తద్యథా—సప్తాస్యే రేవతీ రేవ దూషం యద్వో రేవ తీ రేవత్యాం తమూష.(౧ అ. ౧ పా. ౧ ఆహ్ని).

(౮౪) పై సందర్భమునుబట్టి పాణినిమునిచే ననుశాసింపఁబడినపదము విరళప్రయుక్తమైనను దానిని వైదిక కర్మములలోఁ బ్రయోగించుటచేఁ బాపము సంభవింపనేరదని విశదమగుచున్నది. అట్టి విరళప్రయుక్తశబ్దముల ప్రయోగము వైదిక కర్మేతరస్థలములలోనిదగు కావ్యమునఁ బ్రయోగించుటవల్లఁ బుణ్యహాని లేకున్నను బాపము రాకున్నను గావ్యము రసాత్మకమై యుండవలసియుండుటచేత నట్టి విరళప్రయుక్తశబ్దములచే ఝటితి త్యర్థస్ఫురణమునకు భంగము కలిగి ప్రసాదగుణహైన్యమున సహృదయులకు రసాస్వాదప్రతిబంధము కల్గును గాన "దోషా స్తస్యాపకర్షకాః" అనుచొప్పున రసాపకర్షకతారూపాలంకారికదోషదూషితములై యట్టిశబ్దములు రసికజనాదరణీయములు కానేరవు. కాన వానిని గావ్యములలోఁ బ్రయోగింపరాదని నన్నయభట్టారకుఁడు కావ్యభాషామాత్రానుశాసక మగు చింతామణిలో నీక్రిందికీతిని జెప్పియున్నాఁడు. (౨౧—౨౨ వి)

"విరళాన్ పేచోపాదిక, శబ్దాన్ ప్రవ్యాహారంతు శబ్దజ్ఞాః। ఇహతు ప్రవ్యాహార్యం, సంకేతిత సుప్రసిద్ధ మేవ పదమ్." (సంజ్ఞా. ౧౨ శ్లో.)

నన్నయభట్టారకుని భారతభాగము సుప్రసిద్ధ శబ్దప్రయోగబ ధురమును బ్రసాదగుణభూషితమును నై యున్నదనుటకు సందేహము లేదుగదా. వేయేల ! అతఁ డట్టినియమముతోనె తనగ్రంథమును నడపఁబూనినట్లుగ స్వయముగఁ జెప్పికొనియే యున్నాఁడు.

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.
(భార. ఆది. ౧ ఆ. ౨

(౧౫) సంస్కృతకావ్యములందును నాంధ్రకావ్య
ములను దరువాతి మహాకవులు శ్లేషాదులకై యప్రసిద్ధ
లను సైతము ప్రయోగించుచు వచ్చుటచేతఁ గావలయు
థర్వణాచార్యుఁడు పై చింతామణికారిక నీక్రిందిరీతిని స
యున్నాఁడు. (౨౫ వి)

"సర్వే శబ్దాః ప్రయోక్తవ్యా, యది దోష వివర్జితాః,
అప్రయుక్తత్వ దోషస్తు, న విరుద్ధో మహాకవే ర్మతే." (అథర్వణ. సంజ్ఞా.3

(౧౬) మఱియు వెనుక నుదాహరించిన సంస్కృ
య్యాకరణసిద్ధాంతము ననుసరించి సంస్కృతవ్యాకరణ
లోఁగని మహాకవిప్రయోగములును నసాధువులే య
క్రిందిరీతిని సూత్రించియున్నాఁడు. (౨౫-వి)

"శాస్త్రప్రయోగ వచసోః, శ్శాస్త్రం బలవదుచ్యతే,
అనిష్పన్నే పదే తేన, ప్రయోగాశ్రయణం హితమ్." (అథర్వణ సంజ్ఞా.

ఇట్లు వికృతివివేకకారుఁడును సంస్కృత వై
ణుల సిద్ధాంతముననుసరించి సంస్కృతవ్యాకరణమునకు
నపుడు తెల్గు కావ్యములందలి మహాకవిప్రయుక్త సం
బ్దములును నపశబ్దములె యనియు, శాస్త్రవిరోధము

కవిప్రయోగములకుఁ బ్రామాణ్యమనియు, శాస్త్రకవిప్రయోగములకు విరోధము కలుగునపుడు శాస్త్రమునకుఁ బ్రామాణ్యము నంగీకరించి యాప్రయోగములను నిరసింపవలసినదే యనియు సిద్ధాంతము చేసియున్నాఁడు.

(౮౭) సంస్కృతవైయాకరణ సిద్ధాంతానురోధమున నట్లాతఁడు సంస్కృతవ్యాకరణవిషయమున మాత్రమే చెప్పెనని గ్రహింపక యహోబలపండితుఁడు

"ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంబె"
నిత్యాది కవిపితామహాద్యుక్తిస్తు నిర్మూలైవ. (అహో. ౩౧౯ పు.)
"మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి
పనిగొంటు నీవు ప్రాభవము కాదె"
ఇత్యాది శ్రీనాథవచనస్య ప్రామాదికత్వమేవే త్యవధేయమ్.(అహో. ౪౯౯.)
"సుతులఁ గనియెదుకొఱకు; నీవు ఘటించుకంబె"
ఇత్యాదీనాం భాస్కరతిక్కయజ్వాది వచనానాం కిం మూలమితి వయం న విద్మః." (అహో. ౯౦౦ పుట.)

అని యిట్లతిసాహసముగఁ బైయాథర్వణికసిద్ధాంతము నాచ్ఛికశబ్దవిషయమునందును సమన్వయించి యున్నాఁడు. పరిశీలింపఁగా సంస్కృతశబ్దములవిషయమున సైతము పయిసిద్ధాంతము సరికాదనుట సాహసము కానేరదు. వైదికకార్యోపయోగి శిష్టవ్యవహారభాషానుశాసక మగు పాణినీయమును బట్టి మహాకవిప్రయోగములు ప్రామాదికములనుట యుక్తము కాదు గదా.

(౮౮) అధునాతనాంధ్రపండితులు సైతము, పై మార్గ మునసే పోవుచున్నారు.

"పణిసనూను కణాద బాదరాయణ సూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింప."

"ఇందుఁ బ్రయోగింపఁబడిన పణిసనూను పద మసాధువు. కవిసార్వభౌముఁడును దన శృంగారనైషధమునందు

శా." ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్త శాస్త్రంబులోన్."

అనెను. పెద్దన యీత్రోవనె త్రొక్కెను. అష్టాధ్యాయి మొదలగు గ్రంథముల రచించిన వ్యాకరణశాస్త్రప్రవక్త పాణిని, 'పాణిన' మునియొక్క సంతానముగాని 'పణిన' మునిసంతానము కాఁడు. పణనం=పణః-పణోఽస్యాస్తీతిపణీ, నకారాంతమగు నీ'పణిన్' శబ్దముపై గోత్రాపత్యార్థమున 'అణ్' ప్రత్యయము రాఁగా 'పాణిన' అనురూప మేర్పడినది. పదపడి యువాపత్యార్థమున "ఇఞ్" ప్రత్యయము రాఁగా 'పాణిని' అనురూప మేర్పడినది. ఎట్లయినను బాణిని పాణినసూనుఁడగునుగాని పణిసనూనుఁడు గాఁడు. ఇది సమర్థింప వెరవు గావరాదు." (మనుచరిత్ర పీఠిక. వే॥ ప్ర. గారిది.)

కీర్తిశేషులగు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిలవారు సైత మీవిషయమున నిట్లే యభిప్రాయ పడుచు వ్యాఖ్యచేసిరి.

శా. "ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్తశాస్త్రంబులోఁ
దాతజ్ఞ్ స్థానులు చెప్పఁ డెవ్వి? యను చందంబొప్పఁ గా కాయఁగ
జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతం బిచ్చెఁ దు హీ తు హీ యని గృహారామ ప్రదేశంబులన్."

(శృంగారనైషధము. ౪ ఆ. ౧౯ పద్య).

" 'ఫణినాపత్యోక్తశాస్త్రంబు' అనుపదమునకు ఫణి. మునియొక్క అపత్యమైన పాణినిచేతఁ జెప్పఁబడిన వ్యాకరణ. శాస్త్రము" అని యర్థము చెప్పవలసి యున్నది. ఫణినశబ్దము. 'పాణిని' శబ్దమునకు ప్రకృతిగా నుపలబ్ధము కాలేదు. ఆంధ్ర కవితాపితామహులును మనుచరిత్రలో

'ఫణిసనూను కణాద బాదరాయణ సూత్ర,భంగి విద్వాంసు లుపన్యసింప'

అని ఫణిసనూనుశబ్దమును (పాణినిపరముగా) ప్రయోగించి యున్నారు. ప్రతులలో

'ఫణినాం పత్యుక్త' 'ఫణినా పత్యోక్త'

అని వ్రాఁతలు కనఁబడుచున్నవి. ఇందులకు 'ఫణిభవశాస్త్రే)' అని మూలములోని పదము. కౌముద్యాదిగ్రంథములందును. దద్వ్యాఖ్యలయందును 'పాణిని' శబ్దమునకు 'ఫణిన్' శబ్దము. మూలప్రకృతిగాఁ జెప్పఁబడియున్నది.

"ప్రోక్తాల్లుక్" (౪-౨-౬౪)
"గాథి విదథి కేశి గణి పణినశ్చ" (౬-౪-౧౬౫.)

ఇత్యాది సూత్రవృత్తులం దీక్రింది ప్రక్రియ చెప్పఁబడి య

పణనం=పణః...సోఽస్యాస్తీతిపణీ తస్య గోత్రాపత్యం పాణినః
యూన్యపత్యే ఇఞ్ పాణినిః.

రామభద్రయజ్వ పతంజలిచరితమునఁ 'పణిన్'
నే మూలప్రకృతిగాఁ జెప్పినాఁడు.

శ్లో. పణీతి కశ్చి న్మని రస్తి పూర్వం, స పాణినం నామ కుమార:
స తుల్యనామ్నా తనయేన సోపి, దాక్షీముదూఢాం దృఢ మభ
స పాణినో దక్షభువా పురంధ్ర్యా, రిపుః పురాణా మమయేన
కాలే ముని స్స్కంద ఇవప్రసూతో, హ్యం తయోః పాణిని రప్య
తపోభి రారాద్ధవతః కఠోరై, స్తస్య ప్రసన్న స్తుమశేందుచూడః
అఘోషయ ద్దండవిఘుట్టసేన, చండం కరస్థం డమరుం పురస్తాత్
శబ్దావళే ర్వ్యాకరణం చికీర్షో, స్తదా మునేః పాణిసంభవస్య
మృడస్య చండా డమరుప్రణాదా, శ్మాస్త్రాదిది సూత్రాణి చతు
ఇతీశ్వరానుగ్రహతో నిబధ్నన్, సూత్రాణి స వ్యాకృత శబ్దజా
సుప్తప్రయోగం కథయంతి యస్య, స్వర్లోక సోపాన పరంపరేతి.

ఇందును పణికొడుకు పాణినుఁడు మనుమ
పాణినుఁడే మునిమనుమఁడు "పాణిని" అని యో
పణిగోత్రాపత్యత్వముచే పాణినికి పాణినసంజ్ఞయు కలన

"పాణిని స్త్వాహికో దాక్షీ, పుత్త్రి శ్శాలఙ్కి పాణినా." (

అయినను మహాకవిప్రయోగములు గాన ప్రా
ములు గావను విశ్వాసముచే స్థితగతిచింతనగా ప్రక్రియ
వ్యము. ఎట్లన్న:—భారవిలో

'తవాభిధానా ద్వ్యథతే' (౧. ౨౮.)

అనుచో మల్లినాథసూరి

"నామైకదేశగ్రహణే నామగ్రహణమ్ ఇతి న్యాయాత్ తశ్చ వశ్చ తవౌ తార్క్ష్యవాసుకీ, తయోరభిధానం యస్మిన్ పదే తస్మాత్."

అనియును, రఘువంశములో

"అత్రానుగోదం మృగయానివృత్తః. (౧౩-౩౫)

అనుచో చారిత్రవర్ధనుఁడు

"శబ్దా అవయవేష్వపి వర్తంతే ఇతి న్యాయా దనుగోద మితిపదైకదేశప్రయోగోయమ్. భీమో భీమసేనః. సత్యా సత్యభామా ఇతి."

అనియును, వివరించిన ఫక్కికప్రకారము:—"పణినః(=పణియొక్క), నః(=నప్తా=మనుమఁడు), పణినః (పణినుఁడు). తార్క్ష్యుఁడనుటకు 'త' అనియు, వాసుకియనుటకు 'వ' అనియు భారవిలో గ్రహించినట్లు నప్తయనుటకు 'న' అని గ్రహించిన పణినుఁ డనఁగా పణికి మనుమఁ డగును. పణినునికొడుకు అనఁగా పణికి మునిమనుమఁడు పాణినియే గాన కవిమహర్షు లయిన శ్రీనాథ పెద్దనార్యుల 'పణినాపత్య' 'పణినసూను' శబ్దములు పాణినిం జెప్పును. 'శ కు బు గు శు చ రా ద్యాః' (బృహజ్జాతకము) 'సరిగమపధని' సంగీతము. ఇత్యాదియు పతదను గ్రాహకము (శృంగారనైషధ ౬౭౯,౬౬౦ పుట.)"

ఈవిషయము విచార్యమై యున్నది. భారవిలోవలె నిచట శ్లేషప్రసక్తి లేమింజేసి నామైకదేశగ్రహణమును జేయుట యప్రసక్తము. మఱియు నచట వర్ణసంకోచము చేయవలసినంతటి యిఱుకటమును లేదు. కాన నీ ఫక్కిక ప్రయోక్తృహృదయము కాదు. ఇంతియకాక పణిన శబ్దము వ్యాకరణసాధ్యము కాకపోలేదు. పణముకలవాఁడను నర్థమున "పణిన" శబ్దము సాధ్యమైనచో నిచట నేచిక్కును గలుగదు. కాని పాణినీయవ్యాకరణముచొప్పున నట్టిశబ్దము సాధ్యము కాకపోవుటచేతనే వీరు 'పణినసూను, పణినాపత్య' శబ్దములు సాధువులు కావనవలసి వచ్చెను. ఫలిన బర్హిణాది శబ్దములవలెనే యస్త్యర్థకమగు 'ఇన' ప్రత్యయము రాఁగా 'పణిన' శబ్దమును సాధువు కానోపునుగదా. 'ఫలబర్హాభ్యామినచ్' అను వార్త్తికమున ఫలబర్హశబ్దములు రెండు మాత్రమే పేర్కొనఁబడియుండుటచేత 'పణిన' శబ్దమపాణినీయమగుచున్నదని వీరియాశయము. కాని ముగ్ధబోధవ్యాకరణవ్యాఖ్యాతయగు శ్రీరామతర్కవాగీశుఁడు

> "ఫలాదేరినః" ఫలినఇతి. "ఫలం బర్హం పణో గర్భో మలం శృంగం చ కథ్యతే" (తద్ధిత. ౪౪౭ సూ.)

అని యిట్లు పణశబ్దమునకే గాక గర్భాదిశబ్దములకును నస్త్యర్థకమగు నినప్రత్యయము వచ్చుట ప్రయోగములందుఁ జూచియే కావలయును, బైరీతిని సూత్రించియున్నాఁడు. వంగదేశీ

డగు శ్రీరామ తర్కవాగీశుఁడు దానిసాధుత్వమును
ఙించియుండఁగా నాంధ్రదేశీయులగు మహాకవులు దానిని
గాగించియున్నారు. విదేశీయులగు వీరి ట్లేకరీతిని దాని
త్వము నంగీకరించుట నరయఁగా వారేవేని సంస్కృత
కవుల గ్రంథములలో నట్టి పణినాది శబ్దముల ప్రయోగ
ను జూచియే యున్నారని యెవ్వరికేని తోఁచకమానదు
. వెనుక నుదాహరించినరీతిని బాణినీయము కావ్యభాషా
సకము కామిఁజేసి యద్దానికి లొంగని ప్రయోగములా
వులు కావనుట న్యాయ్యము కాదు గదా.

(౮౯) పరిశీలింపఁగా మహావిద్వాంసులగు సంస్కృతవై
కరణులు పై విషయములను గ్రహింపలేనంతటి యసమర్థు
గారనుటకు సందేహము లేదు. మహాభాష్యకర్త యపశబ్ద
యోగము వైదిక కర్మములందుమాత్రమే చేయరాదనియు
విషయములలో నట్టినియమము లేదనియు, (౭౯. వి.)
ముగను గంఠోక్తముగను జెప్పుచుండఁగా మఱియు వెనుక
హరించినరీతిని గవిప్రయోగములను నిరసించియు నుండఁ
దానిని వారు గ్రహింపలేకుండు టెట్లు పొసఁగును ? ఇఁక
సంస్కృతకావ్యవాఙ్మయమెల్లఁ బరిశీలించి వ్యాకరణరచ
వేఱుగ జరపుట సుకరము కాకుండుటచేతఁ బాణినీయ
కి సంస్కృతకావ్య వాఙ్మయమునకును లక్షణముగా నుప
పఁజేయుచు నద్దాని ప్రామాణ్యమునకై పైమార్గము నవ

లంబించిరనియు నూహింపవచ్చును. ఇట్టియభిప్రాయము మన పూర్వపండితులకు సహజమయినదే. దేశకాలములనుబట్టి యాచారములు భిన్నభిన్నము లగుచుండఁగాఁ దత్తత్కాలములలోని ఋషులవంబరఁగెడి పండితులు తత్తద్విషయములను ధర్మశాస్త్రములుగ స్మరించియుండఁగా వానికిఁ బరమప్రామాణ్యసిద్ధికై యవియెల్ల నేకాభిప్రాయముతోనే యున్నవనియు, నవి పరమప్రమాణమును, నీశ్వరోపదిష్టమును నగుటచేతఁ బరస్పరభేదశూన్య మగువేదము మూలముగఁ గొని స్మరించిన వగుటంజేసి వానికిఁ బరస్పరభేద మెంతమాత్రమును లేదనియు, నిట్లుగ నేకవాక్యతను మనపూర్వులు సాధించి యుండలేదా ? ఇట్లే వ్యాకరణవిషయమునందును వారు మునిత్రయమువారి సిద్ధాంతములు దివ్యజ్ఞానకృతము లగుటంజేసి వానిలో న్యూనాధికభావము పరస్పరవిరోధములు వైయర్థ్యములు మున్నగు దోషము లెంతమాత్రమును లేవనియు, నట్టి సిద్ధాంతములు సంస్కృత భాషను సంపూర్ణముగ ననుశాసింపఁ జాలియున్న వనియు నిశ్చయించుకొని తమపాండిత్యబలమున నట్లు కుదురుపఱుచుటకు వింతవింత లగు వ్యాఖ్యానములను జేయుచువచ్చిరని గ్రహింపనగును. అట్టివ్యాఖ్యలు కొన్ని పైని జూపఁబడి యున్నవి.

(౯౦) శాస్త్రమునకు సాకల్యముగాఁ బ్రామాణ్యము సిద్ధించుటకును శాస్త్రమునందేవిధమగు కొఱంతయును లేద

నుమాట స్థిరపడుటకును శాస్త్రమునకుఁ బరిపూర్ణత దృఢ
పడుటకును శాస్త్రము పరమేశ్వరమూలకమనియు, ననాది
యనియు, నపౌరుషేయమనియు, శాస్త్రకర్త సర్వజ్ఞుఁడనియు,
నీశ్వరవరలబ్ధవిద్యావైభవుఁడనియు, దివ్యజ్ఞానసంపన్నుఁడనియుఁ
జెప్పుట పురాణయుగమువారి కలవాటు. అట్టి యలవాటుచొ
ప్పుననే "అ ఇ ఉణ్" అనునది మొదలగు వర్ణసమామ్నాయ
సూత్రము లీశ్వరుఁడు ఢక్కను వాయించుటలో జనించిన వని
యు, వ్యాకరణ మిట్లీశ్వరమూలకమనియు, నిది వేదాంగమని
యు, లోకమునం దీశబ్దశాస్త్రము వెలయుటకై యా వర్ణ
సమామ్నాయ సూత్రముల నీశ్వరుఁడు పాణినికిఁ బ్రసాదించె
ననియు, వైయాకరణులు చెప్పుచున్నారు. (చూడుఁడు. శేఖ
రములోని "మాహేశ్వరాణిసూత్రాణి" అను దానివాఖ్య) పై
విషయములు కొన్ని వెరుక నుదాహరించిన రామభద్రయజ్వ
గారి శ్లోకములలోను గలవు. (౮౭ - వి)

పాణినీయము శిష్టవ్యవహారమాత్రమూలకమని యంగీ
కరించునపు డట్టిభాషతోనున్న వాఙ్మయ మంతగా లేమింజేసి
పై వాక్యములుకొన్ని నిర్బాధములు కావచ్చును. కాని వైయా
కరణులు పాణినీయమును గావ్యభాషానుశాసకముగ నంగీక
రించుచుఁ గావ్యములలోఁ బ్రయుక్తములయియున్నవి పాణి
నీయసూత్రసాధ్యములు కానపుడును గాశికాకారాదులు పూ
రించినవాని నంగీకరించునపుడును బై రీతి నెట్లు ప్రసంగింప

సాహసించిరో తెలియుకున్నది ఇంకను వార్తికకార పూరణము లును సూత్రాప్రత్యాఖ్యానములు మఃవివక్షలును విభక్తివిప రిణామాదికమును బాధకము లేయగునుగదా. మఱియు శబ్దశా స్త్రము నీశ్వరప్రసాదమహిమచేఁ బాణినిముని క్రొత్తగా నవత రింపఁజేసెననుట యెట్లు పొసఁగును ? (౭౮. ౯)

పైరీతిని బాణినీయమునకుఁ దా మంగీకరించిన ఘనతకు భంగము లేకుండుటకయి పైవిరోధములను వారించుటకై తర్వాతివారు

"సూత్రే ష్వేవ హి యత్సర్వం యద్వృత్తౌ యచ్చ వార్తికే."

అను నొకసిద్ధాంతమును సైత మంగీకరించి సూత్రములలోని చకారాదుల కనుక్తసముచ్చయార్థకత్వమును గల్పించియు, వాశబ్దాదులనుబట్టి పెక్కువ్యవస్థలను జేసియు, వార్తికకా రాదుల పూరణములనెల్ల సాధించి వానిని బాణినిసూత్రసా ధ్యములనుగా నిర్ణయింపసాగిరి.

"విభాషా ప్రకరణే తీయస్య జి త్సూపసంఖ్యానమ్."

అనువార్తికము సూత్రకృదభిప్రేతమే యనియు, 'విభాషాజసి' అనుసూత్రమునకు యోగవిభాగము చేసికొని యీయర్థమును సంపాదింపవలెనని మాత్రమే వార్తికతాత్పర్యమనియు, న్యా సాపరనామక కాశికావివరణపంజిక యను గ్రంథములో వ్రాయఁబడెను.

"విభాషాజసి' ఇత్యత్ర విభాషేతి యోగ విభాగః క్రియతే, తత్రచ సర్వాదీని, ద్వంద్వ ఇతి చ నివృత్తమ్. తేన తీయస్య విభాషా సర్వనామసంజ్ఞా భవిష్యతీతి. నచైవ మతిప్రసంగః. యోగవిభాగా దిష్టసిద్ధేః. నాపివిభాషా ద్వితీయా తృతీయాభ్యామి త్యస్య వైయర్థ్యా పత్తిః. ప్రపంచార్థత్వాత్. తతోజసీతి ద్వితీయో యోగః. అత్ర విభాషాగ్రహణం ద్వంద్వగ్రహణం చానువర్తతే." (౧-౧-౩౬.సూ)

జస్ప్రత్యయాధార కార్యము చేయవలసినపుడు ద్వంద్వమునకు సర్వనామసంజ్ఞ విభాషయని తెలుపుటకై 'విభాషాజసి' అని సూత్రించెనని భట్టోజీదీక్షితుఁడు

"జసాధారం యత్కార్యం శిభావాఖ్యం తత్ర కర్తవ్యే ద్వంద్వే ఉక్తసంజ్ఞా వా స్యాత్."

అని మహాభాష్యానుసారముగ వృత్తిని రచించెను, న్యాసకారులయర్థము భాష్యవిరుద్ధ మగుటచేతనే యప్రమాణమని దృఢముగాఁ జెప్పవచ్చును. సూత్రకర్త యీయర్థమును గోరియుండ లేదనుటయు స్పష్టమే. సూత్రకర్తకే యిట్టియాశయమున్నయెడల "విభాషా ద్వితీయ తృతీయాభ్యామ్." అని యిట్లు పుంలింగములకును సిద్ధించునట్లు సూత్రమును రచించియుండునుగదా. ఇట్లే

గ్రామ్య పశుసంఘే ష్వతరుణేషు స్త్రీ" (౧ అ. ౨ పా. ౭౩ సూ.)
"నాసి కోదర గోష్ఠ జంఘా దంత కర్ణ శృంగాచ్చ."

అనునవి మొదలగుసూత్రములకును వింతవింతయర్థములు వ్రాయఁబడినవి. గ్రంథవిస్తరభీతిచే వాని నిట విమర్శింపలేదు.

మఱియుఁ బైవార్తికకార వృత్తికారాదులు పూరించిన విషయములెల్లఁ బాణిన్యాచార్యులవారెఱిఁగియెఱిఁగి ముందుఁ బుట్టఁబోవు వార్తికకారాదులు పూరింతురనువిషయమును దివ్యదృష్టిచేఁ దెలిసికొని యట్లావిషయములను జెప్పక విడిచియుండిరని చెప్పుసంప్రదాయమును గలదు.

> "యది పూర్వమని రుత్తరమనితాత్పర్యం నజానీయాత్ తర్హి ప్రత్యాఖ్యానస్య భాష్యకృత్కృతత్వేన తత్రపక్షే తత్సిద్ధ్యర్థం సూత్రకారకృత మకారాదేశ విధాన మసంగతం స్యాదితి నిరుక్తమ్"......"అత్రారుచిబీజంతు మహర్షీణాం సర్వజ్ఞత్వ భంగః. అతోఽస్మిన్ శాస్త్రే ఉత్తరముని తాత్పర్యానుసారేణైవ పూర్వముని స్తాత్పర్య మవధారణీయ మితి బోధ్యమ్,"

అని యిట్లు దీపకకారుఁడు వ్రాసియున్నాఁడు ('నబహువ్రీహౌ' అనుసూత్రపు శేఖరము వ్యాఖ్య.)

(౯౧) ఇట్టిరీతినే యాంధ్రకౌముది మున్నగు కొన్ని యాంధ్రవ్యాకరణములలోసైత మాంధ్రవ్యాకరణ తత్కర్తలకు మహత్త్వము కల్పింపఁబడినది.

> "ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశంభునా,
> యుద్ధ్వా త్రయోదశయుగాన్ హత్వా తం రాక్షసోత్తమమ్,
> అవస త్తత్ర ఋషిభి ర్యుతో గోదావరీతటే,
> తత్కాలప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతమ్,
> తత్రత్యా స్త త్సమాలాపా స్తత్కాలేన హాశే ర్భటాః,

కాలేన మహతా సర్వం తత్సమం స్వల్పబుద్ధిభిః,
అస్ఫుటోచ్చారితా నీతి తద్భవా నీతి సమ్మతిః,
బ్రహ్మణా నిర్మితా వాచః పూర్వ మాంధ్రేశితు ర్హ్వరేః,
అచ్ఛా ఇతి చ కథ్యంతే సుప్తిఙ్ ధాతుసమన్వితాః.

... ... ... ...

త్రిలింగశాస్త్ర విహితస్య లక్షణస్యాపి ప్రయోగేణహైన్యం నకా
రయే దితి నాగరాజః... ... ...
యుగ భేదా దాంధ్రభాషా చార్యభేదః ప్రకీర్త్యతే,
కృతే సుధాయనః ప్రోక్త స్త్రేతాయాం శుకనాభకః."

(ఆంధ్రకౌముది.)

"నను సంస్కృత ప్రాకృత వ్యాకరణయో రార్ష త్వేన భవతి ప్రామా
ణ్యమ్, నన్నయాథర్వణయో రిదానీంతనత్వేన కథం తత్ప్రణీతయోః
ప్రామాణ్యం స్యాత్......నానృషిః కావ్యకరణ చాతుర్యధుర్య
త్వం సంభవత్యేవ ఖలు. నానృషిః కురుతే కావ్య మిత్యభియుక్తోక్తేః
అనితరసాధారణవ్యాకరణ నిర్మాణ పటుతయా పండితకవీంద్ర
ప్రథమగణ్యత్వేన చ పరిప్రాప్తం సార్వజ్ఞ్యం తయోరిదానీంతనత్వ
మాత్రేణ కథం నివార్యేత? అతఏవ బ్రహ్మదేవానాం పదవీః కవీనా
మిత్యోపనిషదే వచనే పదజ్ఞస్య విశిష్యేశ్వర భూతి సత్తా ప్రతి
పాదితా." (అహో. ౧౧౦ పుట.)

(౯౨) సంస్కృతవైయాకరణులు మునిత్రయమువారి
మనుశాసనమునే కావ్యాదివాఙ్మయస్థ సంస్కృతభాష కను
శాసనముగా స్థిరపఱిచివేయుటచేతను నట్టియనుశాసనము
నుల్లంఘింపరాదని యాలంకారికులు చ్యుతసంస్కారతాదోష

సందర్భముచే నియమించుటచేతను నట్టి పాణినీయానుశాసనముచే సాధింపఁబడెడి రూపములెల్లఁ బ్రయోగార్హములే యనియు, దానికి లొంగని మహాకవిప్రయోగములుసైతము దుష్టములే యనియు, నొకసిద్ధాంత మేర్పడినది. ఈసిద్ధాంతముచొప్పున ననేకములగు కృతకశబ్దములు వైయాకరణులచే సృజింపఁబడుచున్నవి.

"యథేష్టం నామధాతుషు" అనువార్తికమున యథేష్టమ్మని యున్నది గాన నామధాతువులకెల్ల సన్నిమిత్తకద్విత్వము యథేష్టముగా సంభవింపవలసినదే యయ్యెను. "పుపుత్రీయిషతి, పుతిత్రీయిషతి" అని యిట్లు భట్టోజీదీక్షితు లుదాహరించిరి. వోపదేవుఁ డంతతోఁ దృప్తినందక "లిధోర్యథేష్టం ద్విః..." అని సూత్రించి పై యుదాహరణములనే గాక "పుపుతిత్రీయియిషిషతి" అనియు నుదాహరించెను.

పైరీతినున్న సంస్కృతవ్యాకరణపద్ధతి ననుసరించియే యద్యతనులు కొందఱు నూతనశబ్దములను సృజించుచుఁ దెనుఁగునఁ దత్సమములుగా నంగీకరించుచున్నారు.

"ఇచ్చటఁ బాండురాజశబ్దమునకుఁ బాండురోగ మితనియందుఁ బ్రకాశించు నన్న వ్యుత్పత్తియందు నధికరణార్థంబున 'ఘఞ్' ప్రత్యయము వచ్చినది. కావున నిచటఁ బాండు

రాజశబ్దము 'పాండురోగము ప్రకాశించువాఁడా!' అనిన విశేష ణార్థ మిచ్చును. కాని "పాండునామము గలరాజా" యనిన నృపాదివిశేష్యార్థం బియ్యనేరదు. విశేష్యార్థకంబై ప్రసిద్ధంబైన రాజశబ్ద జకారంబు దంత్యంబని వ్యాకరణకర్తల తాత్పర్యంబు కాని విశేషణార్థకంబైన రాజశబ్ద జకారంబు దంత్యంబు కానేర దనియే వారితాత్పర్యము" (బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక) ఇట్టి 'రాజుఁడు' శబ్దమెచ్చటనైనఁ గలదా?

ఇట్టి భాషాసంక్షోభమునకు బీజము సంస్కృతవైయా కరణులుచేసిన వింతసిద్ధాంతమే గదా.

(౯ 3) పై సందర్భమునుబట్టి నన్నయభట్టారకుఁడు కావ్య భాషమాత్రమే వ్యాకరణనియమబద్ధము కావలెనని తలంచె ననియుఁ దరువాతివారు గ్రంథమాత్రమెల్ల వ్యాకరణసంస్కృ తమయి యుండవలెనని తలంచిరనియు, నాంధ్రవ్యాకరణసిద్ధాం తములకెల్ల సంస్కృతవ్యాకరణసిద్ధాంతములే చాలవఱకు మూలములనియు విశదమగుచున్నది గదా.

---

# ఆంధ్రశబ్దచింతామణివిషయ పరిశోధనము.



## III

### చింతామణి నిగూఢాశయములు.

(౯౪) విచక్షణులారా! ఈవఱకు నేను విన్నవించు కొన్న రెండుభాగములందును నాంధ్రశబ్దచింతామణి నన్నయ భట్టారకరచితమనియు, నన్నయభట్టారకుఁడు కావ్యభాషకు సంస్కార మావశ్యక మనుతలంపుతోఁ జింతామణిని రచించి తద నుసారముగనే తన భారతభాగము నాంధ్రీకరించెననియు, నాంధ్రవ్యాకరణసిద్ధాంతములు పెక్కు సంస్కృతవ్యాకరణ సిద్ధాంతానుసారులనియు విశదపఱిచికొని యున్నాను.

పురాతనమగు నీ యాంధ్రశబ్దచింతామణికిఁ గర్తయగు నన్నయభట్టారకుఁడు వివరణోదాహరణాదికములను జూపియుండకుండుటచేతను, నాతనికిఁబిమ్మట నయినువందల యేండ్లు దాఁటువఱకును దానికి సామాన్యమగు వ్యాఖ్యానమయినఁ బుట్టకుండుటచేతను, నట్టికాలవ్యవధానమున నాంధ్రవ్యాకరణ సిద్ధాంతములు మిక్కిలిగ మాఱియుండుటచేతను, నట్లు మార్పు నొందిన సిద్ధాంతముల కలవాటుపడిన యాంధ్రపండితులు చిర కాలమునకుఁ జింతామణికి వ్యాఖ్యలు వ్రాయనారంభించుటచే

తను, నాంధ్రశబ్దచింతామణి సూత్రాభిప్రాయములు పెక్కు-చోట్ల బయల్పడియుండ లేదనిచెప్పుట సాహసము కాదు. చింతామణికిఁ దొలుత సంక్షిప్తముగ వ్యాఖ్యానము వ్రాసిన పదునేడవశతాబ్దమువాఁడగు బాలసరస్వతి, విపులమగు వ్యాఖ్యానము వ్రాసిన యహోబలపండితుఁడు, మున్నగువారెల్లఁ దమతమకాలములలోఁ బ్రసిద్ధములై యున్న యాంధ్రవ్యాకరణసిద్ధాంతముల కనుకూలముగ (33 వి.) నాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానములు చేయసాగిరి. కాఁగా ననేకములగు చింతామణి సూత్రముల యభిప్రాయము లడఁగియుండి నిగూఢములు కావలసి వచ్చెను. ఈభాగమున నట్టి నిగూఢాశయములలోఁ గొన్నిటిని జూపుచున్నాను.

(౯౬) ఈసందర్భమున నన్నయభట్టరచితమగు నాంధ్రభారతభాగము చాలవఱకుఁ దోడ్పడఁజాలి యున్నదన వచ్చును. కాని నన్నయభట్టారకునిచేతఁగాని, యాతని సమకాలములోని లేఖకులచేతఁగాని వ్రాయఁబడిన నన్నయభారతభాగపుమాతృకలు లభింపనేరవు సరియే కదా తుదికి మూఁడు వందలయేండ్లకన్నఁ గ్రిందటి పరంపరాసంబంధముగల మాతృకలునైతము లభించుట దుర్ఘటమనువిషయము తాళపత్రమాతృకాపరిశోధకుల కెల్లరకును విదితమే గదా. ఇంతియగాక యాయాకాలములలోని లేఖకులు వారివారికిఁ గల యాంధ్రవ్యాకరణజ్ఞానము ననుసరించి భారతాదిగ్రంథము

లను సవరించియు, వ్యావహారికభాషావాసనచేఁ బ్రవేశించెడి మార్పులకుఁ బాల్పటిచియు వ్రాయుచు వచ్చిరనియుఁ దాళపత్రమాతృకాపరిశోధకులకుఁ దెలియనివిషయము కాదు. వేయేల! అప్పకవినాఁటికే యిట్టిదురవస్థ యాంధ్రవాఙ్మయమునకు సంభవించినట్లుగ నాతని యీక్రిందిపద్యము విశదీకరించుచున్నది.

ఉ. నన్నయముఖ్య సత్కవి జనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడపెట్టఁ దక్కువై
యున్నెడఁ జూచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవలె
ల్లన్నిజమంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే.

(అప్పక. ౧ ఆ. ౨౦౨ ప.)

పైరీతిని బండితలేఖకులును లక్షణవేత్తలును జేసినసవరణములే గాక యపండితలేఖకకృతప్రమాదములు సైతము తాళపత్రమాతృకలలో లెక్కకు మీఱియున్నవనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు గదా. ఇంతియగాక రేఫఱకారములయు, నర్ధానుస్వార సరళాదేశములయు, లేఖనము తాళపత్రమాతృకలలోఁ జాలవఱకు లేదని చెప్పనగును. అట్టి తాళపత్రమాతృకల నాధారముగఁ జేసికొని యర్వాచీనులు ముద్రించుటలో నహోబలపండితీయాదుల ననుసరించిరనియు, ఇంకను దర్పాతివారు బాలవ్యాకరణము ననుసరించి భారతాది గ్రంథములను సంస్కరించి ముద్రించిరనియు నాంధ్రభాషాపరిశోధకులకు విదితమే.

పై రీతిని నన్నయభారతభాగ మత్యంతసంక్షుభిత మగుట చేత నయ్యది పూర్ణముగఁ జింతామణ్యర్థనిర్ణయసందర్భమున నుపచరింపఁ జాలకున్నది. అట్లయినను నందలి ఛందోయతి ప్రాసనిబద్ధసలములనుబట్టియు, సయుక్తికములగు నమ్మఁదగిన యితర కారణములనుబట్టియు, జింతామణిలోని నిగూఢాశయములను గొన్నిటి నీసందర్భమున యథాశక్తిగ విశదపఱుచుచున్నాను. తాళపత్రమాతృకాపాఠభేదములు నైత మీవిషయమునఁ గొంతవఱకు సహాయము లగుచున్నవి.

(౯౬)అనాదిషు విభక్తి ష్వాత్వేతి సూత్రార్థవిమర్శము ౧.

ఈ సూత్రమునకు "ప్రథమేతరవిభక్తి ప్రత్యయముల యందున్న యుకారమునకు సంధివికల్ప"మని సామాన్యముగ నొక్కవిధముగనే చింతామణి వ్యాఖ్యానకర్తలెల్లరును నర్థము చేసి "మమ్మునేలు, మమ్మేలు" మొదలగువాని నుదాహరించియున్నారు.

అహోబలపండితుఁడు "రాముఁ" అను దానిలోని యుకారము ద్వితీయాప్రత్యయస్థము కామింజేసి "రాముఁ + అభిరాముఁ" అనుచోట ననాదిష్విత్యాది ప్రకృతసూత్ర సిద్ధ వికల్పమునకుఁ బ్రసక్తిలేదనియు, నింక నిత్యమగు నుకార సంధియే రావలసియున్నదనియు శంకించుకొని

"యద్యప్యనుత ఇత్యనేన 'రాము నభిరాముఁ దలఁచెద' నిత్యాదౌ ఉకారసంధిః ప్రాప్తః. తథాపి వివక్షితద్వితీయార్థ ప్రతీత్యభావ ప్రసంగః

స్యాదితి స నివార్యః. "ప్రాంశుపయోదనీలతను భాసితు నుజ్జ్వల దండ ధారు" నిత్యాదిప్రయోగాత్." (అహో. ౧౭౫ పు.)

అని యిట్లుచటిసంధిలో నకారము లోపించినయెడల ద్వితీయార్థప్రతీతికి భంగము రావలసివచ్చుననెడి యనుపపత్తిని జూపి "రామభిరాము" ననెడి యనిష్టరూపమును వారించెను.

పరిశీలింపఁగా నచటిసంధ్యభావము సమ్మతమేయైనను నహోబలపండితుఁడుచూపిన యనుపపత్తిమాత్రము సరియైనది కాదని చెప్పకతీరదు. "రామునిన్" అను రూపములోని ద్వితీయాప్రత్యయమగు 'ని' అనునది "లుక్చస్యాత్" అను సూత్రముచే నీవలకే లోపించినది. ఇఁక నద్దానితో సహజము గనుండెడి "తిజ్మధ్యేత్యాది" సూత్రసిద్ధద్రుత మచటిద్వితీయను సూచించును గాన నది లేనిచో నచటిద్వితీయాప్రతీతి కలుగకపోవలసి వచ్చుననిగదా యాతఁ డనుపపత్తిని జూపెను. అట్లయినచో "రామున్+స్తుతించెద" అనుచోఁ గల్గు 'రాము స్తుతించెద' అనులోపసంధియు నసాధు వనవలసి వచ్చును. కాన నాతఁ డిచ్చిన యనుపపత్తి యుక్తమైయుండ లేదు. ద్వితీయార్థము నచటిసందర్భమే బోధించును. కాఁగా "రామభిరాము" అనుచోటి యనిష్టసంధి యాతఁడు చెప్పిన మార్గమున వారించుట సరికాదు.

కానఁ బ్రథమేతర విభక్త్యంతశబ్దముల తుదియుకార ములలోఁ బ్రత్యయస్థకారములకే వైకల్పికసంధి వచ్చునని

యుఁ దక్కిన యుకారములకు సంధి రానేరదనియు, "అనాదిషు విభక్తిషూత్వా" అను నీసూత్రమునకు వ్యవస్థావాచియగు వాశబ్దముచే నర్థముచేయుట నన్నయభట్టారకహృదయమని యెన్ననగును. అట్లయినచో "తనుభాసితునుజ్జ్వల" అను నాతని ప్రయోగముతోపాటు "రామునభిరాము" మున్నగు ప్రయోగములెల్ల సాధువులు కాఁగలవు.

చింతామణిలోని సంధిప్రక్రియ దిక్ ప్రదర్శనార్థక మగుటచేత సామాన్యముగాఁ బ్రథమేతరవిభక్తుల యుకారపు సంధిమాత్రమే సూత్రింపఁబడినది గాని "నన్నుౝ, మమ్ముౝ" మొదలగువానిసంధి యచట వివక్షించియున్నట్లే యగపడదు. మఱియు వాని నుదాహరించుటలో "నన్నేలుౝ, నన్ను నేలుౝ" అను ద్వైరూప్యము 'అనాదిష్వి'త్యాదిసూత్రముచే సంధి తదభావములలో వరుసగా లభించుచున్నట్లుదాహరించుట ప్రామాదికమనక తీరదు. "న్నుమ్మౌ హ్రస్వ శ్చాదే రమి శసిచ" అను చింతామణి సూత్రముచొప్పున "అమ్ శస్" ప్రత్యయములు పరమగుచుండఁగా వచ్చెడి "నన్ను" మున్నగువానిలోని "న్ను, మ్ము" అనునవి ద్వితీయాప్రత్యయములు కానేరవుగదా.

(౯౭) ఆంధ్రశబ్దచింతామణి యాచ్ఛికశబ్దవిషయక విధానప్రధానము కామింజేసి 'నన్నుౝ' మొదలగువానివిషయమున నద్దానినిబట్టి సంధిప్రక్రియను వివరింపకుండుటయే యుక్త

ము. ఒకపక్షమున నట్లు వివరింపఁదలఁచినపు డీక్రిందిరీతిని దల
చుట యుక్తమని తోఁచుచున్నది.

తే. "నన్ను నీనర్హు లెల్లనిం దున్నవారు" (భార. ఆది. ౪. ఆ. ౧౪౯ ప
మత్త. "నిన్ను నిప్పుడ దండతాడితుఁ జేసెదన్" (భా. ఆది. ౧. ఆ. ౧౫౪
క. "నన్నేల యుపేక్షించితిరి..." (భార. ఆది. ౭. ఆ. ౧౦౬ )

అనునవి మొదలగు నన్నయభట్టారకప్రయోగములనుబట్టి పై
వ్రాసిన 'నన్నేలుఁ' 'నన్ను నేలుఁ' అనెడి ద్వైవిధ్యవ
నన్నయభట్టసమ్మతమే యనుటకుమాత్రము సందియము లేద

అస్మదర్థకమగు 'నా' శబ్దమునకు 'న్ను ద్వ్యాశ్ర హ్రస
శ్చాదే రమి శసిచ' అనుసూత్రముచే 'న్ను' అనునది చేరి ప్ర
స్వము రాఁగా 'నన్ను' అని సిద్ధించును. పిదప "నిరమోహ
హాతామ్" అనుసూత్రము నియమమునుబట్టి చేయఁబడిన ను
త్యయప్రాప్తి యోగ్యత లేనిశబ్దముల 'అమ్మునకు' 'ను' వచ
ను" అను వ్యాఖ్యానముచొప్పున 'నన్ను' అనుదానికిఁ బరమ
దున్న 'అమ్' ప్రత్యయమునకు 'ను' అనునది రాఁగా 'నన్ను
ను' అనురూప మేర్పడును. తరువాత "తిజ్మధ్యే" త్యా
సూత్రముచేత ద్రుతముచేరఁగా "నన్నునున్" అనురూ
మేర్పడును. పిదప 'నిరమోహహాతామ్' అను సూత్రము
వచ్చు నినుల లోపమును జెప్పుచున్న 'లుక్చస్యాత్' అన
సూత్రముచే వైభాషిక మగులోపము రాఁగా 'నన్నుఁ
అనెడిపాక్షిక రూపముసైతము మేర్పడును.

వ. "అమ్మనిపుత్త్రునియందు నాహృదయంబు తద్దయుఁ దగిలియున్నయది.

ఉ. "నన్నునుఁ గౌఁగిలించుకొని నాహృదయంబునకు న్నిజాస్య మా
సన్నము సేసి......" (భార-అర. ౩ ఆ. ౧౦౭ప.)

అను నన్నయభట్టారకప్రయోగమునుబట్టి "నన్నునుఁ" అను దానిలోని 'ను' అనునది సముచ్చయార్థక 'ను' శబ్దము కాదనియు ద్వితీయా 'ను' ప్రత్యయమే యనియు నంగీకరింపక తీరదు గదా. ఇందలి 'ను' అనునది "నన్నున్" అను దానిలోని ద్రుతముయొక్క స్వత్వరూప మనరాదు. నన్నయభట్టారకమతమున ద్రుతము నకారమాత్రరూపమే యని సిద్ధాంతీకరింపఁ బడుచున్నది. (విష ౧౩౩—౧౩౭).

పై సందర్భముచొప్పున నేర్పడిన "నన్నునుఁ" అను దానికి 'ఏలున్' అనునది పరమగునపుడు 'అనాదిష్వి' త్యాది ప్రకృతసూత్రముచొప్పున "నన్ను నేలు, నన్నును నేలు" అను సంధి తదభావపక్ష రూపద్వయ మేర్పడును. ఇఁక "నన్నుఁ + ఏలు" "ననుఁ + ఏలు" అనువానిసంధిలో నచటి తుది యుకారములు ద్వితీయాప్రత్యయస్థములు కామింజేసి 'రామునభిరాము' అను స్థలమునందువలెనే "నన్ను నేలు, ననునేలు" అను సంధ్యభావరూపములే యేర్పడును. 'ననునేలు' అనుచోటిసంధ్యభావము "మమునేలు" అనునది మొదలగు చోటులందువలెనే ద్విత్వములో నొకవర్ణము లోపించినకారణమున సంభవించుననియుఁ జెప్పఁదగును గాని

142 'నన్నున్ + ఏలు=నన్నేలు' అను నుదాహృతి సరికాదు. (౯౮- వి.)

యీసందర్భమునఁ బైమార్గమే ముఖ్యముగ నెన్నఁదగినదని గ్రహింపవలెను.

(౯౮) 'నన్నేలు' మున్నగురూపములును నన్నయభట్టారకసమ్మతములు కాకపోలేదు గాని వానిప్రక్రియను మాత్ర మీక్రిందివిధమున గ్రహించుట తత్సమ్మతమని యెన్నఁదగును. "నను౯, నిను౯, తను౯" అనువాని సంక్షేపరూపములుగా నన్నయభట్టప్రయోగములలో నగపడుచున్న "న౯, ని౯, త౯" అనువాని కచ్చుపరమగునపు డీక్రింది నన్నయభట్టారకప్రయోగములలో నగపడుచున్న ద్రుతద్విత్వము రాఁగా 'నన్నేలు' మున్నగురూపములు సిద్ధించుచున్నవని గ్రహింపవలయును, ఇట్టి ద్రుతద్విత్వము నన్నయభట్టప్రయోగములలో నగపడుచున్నను జింతామణిలో నాతఁడు "లుక్ సంశ్లేషౌ నాచి" అని సంశ్లేషమును (ద్రుతము వెనుకటి యచ్చునంటియుండుట) నిషేధించియుండుటచేత నీద్రుతద్విత్వరూపసంశ్లేషమును యథేష్టముగాఁ జేయరాదనియుఁ బ్రయుక్తముమాత్రమే గ్రాహ్యమనియుఁ, బ్రామాణికు లభిప్రాయపడుచున్నారు. కావుననే "నన్నయభట్టారకుఁడు 'అన్నిష్టసఖినూఁది యున్నదాని' అనిప్రయోగించి 'లుక్ సంశ్లేషౌ నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్య సూచనార్థంబని యెఱుంగునది." అని యిట్లు త్రిలింగలక్షణశేషమునఁ గీర్తిశేషులగు శ్రీమా౯ బహుజనపల్లి సీతారామా

వారు వ్రాసియున్నారు. (ప్రౌఢ. సంధి. 3 సూ.) ఇట్టి అభిప్రాయమునే "లుక్సంశ్లేషా" విత్యాదిసూత్రమును సందర్భమున నథర్వణాచార్యుఁ డీక్రిందిరీతిని వివరించి డు.

"వా ద్విత్వం క్వచిచ్ఛిష్టం పరప్రాణేన సంగతేః."

(వికృ. అజం. ౨౭ సూ.)

ాగజపెబుద్ధి." (భార. ఆది. ౬ ఆ. ౪౫ ప.)

న్వినుచున్న వారలకు" (భార. ఆది. 3 ఆ. ౯ ప.)

ను పెక్కుచోట్ల నన్నయభట్టు ప్రయోగించియుండు ౯, నగ, తగ" అనునవి యభీష్టముగాఁ బ్రయో వరూపములే యైయున్నవి. ఇఁక నన్నయభట్టుచేసిన వములు:—

ఇష్టసఖి నూఁది యున్నదాని." (భా. ఆది. 3 ఆ. ౧౪౦ ప.)

, న్నేటితరంగలగ." (భార. ఆది. ౮ ఆ. ౭౯ ప.)

న్నసుర గర్వించి." (భార. ఆది. 3 ఆ. 3 ప.)

, ప్రయోగములందు "అన్న + ఇష్టసఖి" అని పదచ్ఛే సమాధానముచెప్పుటకు వీలులేదు. 'అనునిష్టసఖి' బ్రయోగించుటయే నన్నయసంప్రదాయము గాని ష్టసఖి" అనురీతి నిట్టియర్థమునఁ బ్రయోగించుట సంప్రదాయము కాదు. "జనమేజయుఁడన్ జనపా భార. ఆది-౧ ఆ. ౮3 ప.) అని యిట్లు పెక్కుచోట్ల

నన్నయభట్టు "అను" అనుదాని సంశ్లేషరూపమగు "అన్" అనుదానిని బ్రయోగించియుండుటచేత " అన్ + ఇష్టసఖి " అనుచ్ఛేదముతోనే పైప్రయోగముల నాతఁడు ప్రయోగించెనని గ్రహించుట యుక్తము. పై రీతిని సమాధానము చెప్పుటకు వీలుపడనిచోట్లను సయితము నన్నయభట్టారకుఁడు ద్రుతద్విత్వమును బ్రయోగించియున్నాఁడు.

మత్తకోకిల. "... ... మదీయభాషిత మెన్నఁడు
న్నేని మోఘము గాదు ద్ధరణీరవిందు లెఱుంగఁగన్."
(భార. ఆది. ౭ ఆ ౧౮౨)

ఉ. "... ... ... మునీంద్ర నీకుఁ జ
న్నే నలినాక్షులందు మదినిల్వఁగ..." (భార. ఆది. ౮ ఆ. ౧౭౯ ప.)

పైప్రయోగములలోని "చన్నే" అనుచోట "చన్ + ఏ" అని చ్ఛేదముచేయునది. "విప్రసతికి నూఱు వేఁడఁ జన్ వరములు" (భార-సభా-౨ ఆ. ౨౬౩ ప.) అని నన్నయభట్టు ప్రయోగించియుండుటచేత 'చన్' అనునది 'చనున్' అనుదాని రూపాంతర మగుటలో వివాదము లేదు. ఈసందర్భమును బట్టి "ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు చను చేరు కొనుశబ్దములు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వాని కడ యచ్చులకు లోపంబు విభాష నగును" (ప్రౌఢ. క్రియా. ౨ సూ.) అను ప్రౌఢవ్యాకరణసూత్రములో 'చను' ధాతువును జేర్చుట సరికాదని స్పష్టపడుచున్నది.

దక్కినచోట్ల 'ల' అనునది రాదనియు, ననఁగా 'నీ నా తా' అను మూఁడుశబ్దముల ద్వితీయాబహువచనశస్సున కాదేశముగాఁ గాని, 'నీ నా తా మన' అను నాలుగుశబ్దముల తృతీయాదిబహువచనములకు ముం దాగమముగాఁగాని, "ల" అనునది రాదనియు వ్యాఖ్యానము చేసికొనవలసి యున్నది. ఇట్టివ్యాఖ్యానము నన్నయభట్టారకాభిప్రాయానుకూలమే యనుట కాతని యీ క్రిందిప్రయోగములు ప్రమాణము లగుచున్నవి.

"దూషించు మనల." (భార. ఆది. ౬ ఆ ౧౫౭ ప.)
"తమ్ముఁజేసిన" (భార. అరణ్య. 3 ఆ. ౨౭౯ ప.)
"మిమ్మందఱ." (భార. ఆది. ౨ ఆ. 3౪ ప.)
"మనవినత." (భార. ఆది. ౨ ఆ: 3౪ ప.)
"మాపల్కు." (భార. ఆది. ౨ ఆ. ౧౪౫ ప.)
"మీకునాత్మజుఁడు." (భార. ఆది. ౨ ఆ. ౧౪౭ ప.)

'మమ్ములన్, మిమ్ములన్, తమ్ములన్' అను రూపములను నన్నయభట్టారకుఁ డెచ్చటను బ్రయోగించియుండలేదు.

పై సందర్భమునుబట్టి 'మమ్ము, మిమ్ము, తమ్ము' అను వానితుదిని ద్వితీయాబహువచన లప్రత్యయము రానేరదనియు, నిఁక నచటి ద్వితీయాబహువచన శస్ప్రత్యయము "నపదా న్యవ్యయ సు ప్తి జ్యాఙ్వ తుమునామ్" అను చింతామణిసూత్రముచొప్పున నిలువరానిదగుటం జేసి లోపించుననియు, నట్టిలోపముచేతనే "మమ్ము, మిమ్ము, తమ్ము" అనునవి ద్వితీ

యాంబహువచనాంతము లగుచున్నవనియు, వానికి "తిజ్మధ్యే" త్యాదిసూత్రముచే గ్రుతాంతత్వము సిద్ధించుచున్నదనియుఁ, జింతామణ్యనుకూలముగా వానిప్రక్రియ నెన్నవగును. కావు ననే యివి తక్కినవిభక్త్యంతములకు విలక్షణము లయియున్న వని గ్రహింప నగును. కాఁగా వీనితుదియుకారమును ద్వితీయా ప్రత్యయసంబంధిఁగ నంగీకరించి 'అనాదిష్వి'త్యాది ప్రకృత సూత్రముచేఁ బాక్షికసంధిని జేయఁగా "మమ్మేలు, మమ్ము నేలు" అనునవి వరుసగా సంధిప్రాప్తి తదభావరూప పక్షద్వ యోదాహరణము లగుటలో విరోధము లేదు.

"మిమ్మందఱ" (భార. ఆది. ౨ ఆ. 3౪ ప.)
"మిమ్మిట్లునూచి." (భార. ఆది. ౨ ఆ. ౧౪౭ ప.)
"తమ్మును త్తముల్;" (భార. ఆది. ౧ ఆ. ౧౫౦ వ.)

అని యిట్లు నన్నయభట్టారకుఁడు వీనిసంధి తదభావములను బ్రయోగించియున్నాఁడు.

ఇఁక నాచ్ఛికశబ్దద్విత్వములో నొకవర్ణము లోపించు నపుడు పరిశిష్టవర్ణముపై నిల్చియున్న యచ్చు పరరూపసంధి నందకుండుట యచ్చాంధ్రభాషాసంప్రదాయ మగుటంజేసి "మమునేలు, మిమునేలు, తమునేలు" అనుచోటులందు సంధి ప్రాప్తి పక్షరూపము లుండనేరవని గ్రహింప నగును. చింతా మణి తత్సమభాషానుశాసనప్రధాన మగుటంజేసి యిట్టి యా చ్ఛికవిశేషవిషయముల నుపదేశింపకుండుట శంకాస్పదము కానేరదని యెన్నవగును.

## నిత్య మనుత్తమపురుషక్రియా స్వితి ఇతిసూత్రార్థ విమర్శనము ౨.

(౧౦౦) ఉత్తమపురుషేతరక్రియల యికారమునకు సంధినిత్యమని దీనికర్థము. ఇందుఁ బఖ్యదస్తయగు నుత్తమపురుషేకారము కిమాదిగణములోని దగుటచేత నద్దానికి "ప్రాయ స్తుస్యాత్ కిమాదికస్యేతః" అనుచొప్పునఁ దఱుచుగ సంధి యగుటయుఁ గ్వాచిత్కముగాఁ గాకుండుటయుఁ గలదని యెన్నఁదగును. దీనికి సరిగనే నన్నయభట్టభారతభాగమున మధ్యమప్రథమపురుషముల యికారముల కెల్లయెడలను సంహితలో నిత్యసంధియే యగపడుచున్నది. ఉత్తమపురుషక్రియల యికారమునకుఁ దఱుచుగ సంధియగుటయుఁ గ్వాచిత్కముగ లేకుండుటయు నగపడుచున్నది.

సీ. ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు,
నల్లచేసితి రేని నాకుదాసి. (భార. ఆది. ౨ ఆ. ౩౪ ప.)

క. ...అ, పారప్రారంభులై రపరిమితశక్తిన్. (భార. ఆది. ౨ ఆ. ౧౪ ప.)

ఆ. వె. జంటపన్నిదంబు సఱచితి మిట్లుగా. (భా. ఆది. ౨ ఆ ౩౪ ప.)

క. ...ఈ, త్రిలోకముల కధిపుఁ జూచితిమి యొకయెుకక౯.
(భార. ఆది. ౫ ఆ. ౨౩౯ ప.)

తే. ఇందు సుఖముండితిమి యొరు లెఱుఁగకుండ.
(భార. ఆది. ౬ ఆ. ౨౪౨ ప.)

తే. అన్య లెఱుఁగమిఁజేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతిఁదప్పి

యొఱుఁగనంటిని నిందఱ కిప్పు డెఱుఁగఁ
జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ. (భా. ఆది. ౪ ఆ. ౧౦౮ ప.)

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల దెలింగొంగితి సుదాత్తరసాన్వితకావ్యనాటక
క్రమములు పెక్కుసూచితి జగత్పరిపూజ్యము లైనయీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితో.

(భార. ఆది. ౧ ఆ. ౧౦ ప.)

పై సూత్రములకు బాలసరస్వతి చాలవఱకుఁ బైరీతిగనే టీక వ్రాసియున్నాఁడు.

"అనుత్తమపురుష=ఉత్తమపురుషవ్యతిరిక్తమైన, క్రియాసు=క్రియల యందలి, ఇతః=ఇకారమునకు, నిత్యమ్=నిత్యముగా సంధికలదు. చ రసురులు. వ్రాసెచి రమరులు. ఉత్తమపురుషకైన."

(బాలస-పరిషత్తువారి పుస్తకము

(౧౦౧) అప్పకవి యుత్తమపురుషక్రియలలోని యికారములలోఁ గళలగు నికారములకు సంధినిత్యమనియు, ద్రుతప్రకృతికములగు నికారములకు సంధిలేదనియు, "నిత్యమి"త్యాది ప్రకృతసూత్రమున కర్థము చేసియున్నాఁడు.

తే. పుడమి నూత్రోక్త ముత్తమపురుష మనుమఁ
దత్పురుషమెల్లఁ గొనరాదు తద్బహూక్తి
మున్న తిబ్మధ్యములతోడ నెన్నకతన
నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటించు. (౫ ఆ. ౬౨ ప.)

తే. వనిని దీవించిరఁట మునీశ్వరులు నిన్ను
రవిజు నేలితి వఁట నీవు రామచంద్ర
మీరు కట్టితిరఁట కపులార జలధి
వింటి మీవార్త మేమన వెలయునిట్లు. (౫ అ-౬౩ ప)

క. గరుడధ్వజ ప్రథమోత్తమ
పురుషైకవచనములెల్ల భూతార్థమునన్
ధరనగును ద్రుతప్రకృ తులు
భరియించె నుపేంద్రుఁడేను బ్రదికితి ననఁగన్. (౫ ఆ ౬౭)

ఇంతియకాక ప్రథమపురుషేకారమునకు సంధిచేయక శ్రీనాథుఁడు పొరపడెననియు నీతఁడు వ్రాసియున్నాఁడు.

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణినిశ్శృంగార నైషధంబునఁ గూర్చుం
డిరి యొండొరు ననికానక, పరపురుషక్రియలఁ బ్రకృతిభావము కలదే.
(అప్ప. 5 ఆ. 64 ప.)

(౧౦౨) అహోబలపండితుఁడు

"ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవే చ్చ్యుతిః,
నిత్య మన్యస్య వికృతౌ......"

అను నథర్వణకారిక నుదాహరించి యట్టి శ్రీనాథుని ప్రయో
గము ప్రామాదికమనుట సరికాదని యప్పకవిప్రసంగమును
సించెను. మఱియు నితఁడు "వినుతించి రమరులు, చేసితి
మ్యతుపూజ, కంటి వతనిరూపము," అని యిట్లు ప్రథమ
మధ్య మేకారసంధినిత్యత నుదాహరించి యికారాంతోత్తమ

పురుషక్రియల నెల్ల ననఁగా ద్రుతప్రకృతికములను సైతము కిమాదులలోఁ జేర్చి "ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః" అనుదానిలోని ప్రాయశ్శబ్దపుస్వారస్యమును బాటింపక వానికి వికల్పసంధి నంగీకరించి "చేసితి నచ్యుతార్చనము, చేసితచ్యుతార్చనము" అని యి ట్లుదాహరించెను. ఇట్లే కిమాదిసూత్రోదాహరణసందర్భములోనె యితను "కొలిచితినబ్ధిజన్, కొలిచితబ్ధిజన్" అని యుదాహరించెను.

"అనాదిషు విభ క్తిష్వాతో వా" "నస్యా త్తద్ధర్మోతః" "చోర్వాస్యా ద్వ ర్తమానవిహితస్య" అనునవి మొదలగు చింతామణిసూత్రములనుబట్టియుఁ, బయినుదాహరించిన యాతనిప్రయోగములనుబట్టియు, ద్రుతపరక స్వరసంధి నన్నయభట్టమతమని విశదపడుచుండుటచేత ద్రుతప్రకృతికత్వమును స్వరసంధిప్రతిబంధకముగా నప్పకవి వివరించుట కేవలము ననంగతము. అట్లే కళలగు నికారాంతోత్తమపురుషక్రియల యికారసంధ్యభావము సైతము పైనుదాహరించినరీతిని నన్నయభట్టప్రయోగములలో నగపడుచుండుటంజేసి యట్టివానిసంధి నిత్యమని యప్పకవి వ్రాయుటయుఁ గేవలము ప్రామాదికమై యున్నది.

ఉత్తమపురుషేకారసంధ్యభావము చూపుటలో "కొలిచితినంబను" అని బాలసరస్వతియు 'బ్రతికితిననఁగన్' అని యప్పకవియు, "కొలిచితి నబ్ధిజన్, చేసితి నచ్యుతార్చనములు"

అని యహోబలపండితుఁడును, నిత్యమిత్యాదిప్రకృతసూత్రమున కుదాహరణముల నిచ్చియున్నారు. వీనినిబట్టి ద్రుతప్రకృతికము లగు నుత్తమపురుషక్రియల సంపూర్ణరూపములు "కొలిచితినిన్, బ్రతికితినిన్, చేసితినిన్" అని నన్నయభట్టమతమున నుండునని యు, నక్కారణమునఁ దా ముదాహరించిన యుదాహరణము లుత్తమపురుషైకారసంధి జరిగినపక్షములోనివే యనియు, నిఁక సంధ్యభావపక్షమున " కొలిచితిని నంబను, బ్రతికితిని ననఁగన్, కొలిచితిని నభిజన్, చేసితిని నచ్యుతార్చనములు " అని యి ట్లుండవలసి యుండుననియు, వీరు గ్రహింపలేదని విశదమగు చున్నది.

"ఉత్వయుతౌ వనకారౌ, స్యాతాం మధ్యోత్త మైకవచ నానామ్ " అను సూత్రముచేతను, " భూతా దుతాం పరేషా మిత్ " అను సూత్రముచేతను, చింతామణిసాధించిన భూత కాలికోత్తమ పురుషైకవచన ప్రత్యయము 'ని' అనునది య గును. "తిఙ్మధ్యశేషషష్ఠీ ... అన్యేద్రుతప్రకృతయః " అనుసూ త్రములచే నయ్యది ద్రుతప్రకృతికముగాన " నిన్ " అనియేర్ప డును. కాఁగా "కొలిచితినిన్" మొదలగురూపములే నన్నయ భట్టసాధిత భూతకాలికోత్తమపురుషైకవచన సంపూర్ణరూపము లగుచున్నవి. పిమ్మట " వాక్యాంతగతపదానాంచ " అను సూత్రముచే వానితుది నకారము లోపించునపుడు " కొలిచి తిని " అనునది మొదలగురూపము లేర్పడును. పిదప "కవిభల్ల

సై్యఃక్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే” అనుసూత్రము చెప్పిన నట్టిక్రియల యుకారజన్యేకారము లోపించునపుడు “కొలిచితిఁ” మొదలగురూపము లేర్పడును. వీనితుది నకారములును మరల “వాక్యాంతగత పదానాంచ” అనుసూత్రముచే లోపించునపుడు “కొలిచితి“ మొదలగురూపము లేర్పడును. ఇట్టి సంక్షేపరూపపరంపర యున్నను “ కొలిచితబ్ధిజఁ ” అను రీతిసంధులు నన్నయభట్టభారతభాగమున నెచ్చటనైన మచ్చునకైన నగపడకుండుటంజేసి యాతని చింతామణిసూత్రమున కుదాహరణము నిచ్చునపు డుత్తమపురుషేకార సంధిపక్షమున నట్టివాని నహోబలపతి యుదాహరించుట సరికాదు. ఇఁక నుత్తమపురుషేకార సంధిపక్షమున “కొలిచితి నబ్ధిజన్,” మొదలగువానిని, సంధ్యభావపక్షమున “కొలిచితిని నబ్ధిజఁ” మున్నగువానినిమాత్రమే యుదాహరించుట యుక్తమని గ్రహింపవలసియున్నది. “ప్రాయస్తుస్యాత్ కిమాదికస్యేత్వః” అనుదానిలోని ప్రాయశ్శబ్దమునకు సరిగ సంధిజరిగినరూపము లే నన్నయభారతభాగమున నెచ్చటఁజూచినను నగపడుచున్నవి. వెనుక నుదాహరించిన

“అంటిని నిండఱను” (భార. ఆది. ౪ ఆ. ౧౦౮.)

మున్నగు సంధ్యభావపక్షోదాహరణములు నన్నయభారతభాగమున మిక్కిలి యరుదనుటకు సందేహము లేదు. ఇట్టి స్థితిలో నన్నయభట్టారకుఁ డెచ్చటనైనఁ బ్రయోగింపని “కొలిచితబ్ధి

జన్" మున్నగునవి ప్రాయస్సంధిపక్షోదాహరణలనియు, నన్నయభట్టభారతభాగమున నెల్లయెడలను బ్రచురముగఁ బ్రయోగింపఁబడిన "కాలిచిత్తినబిడ్జ్" మున్నగునవి యనునుగ నుండఁదగిన సంధ్యభావపక్షమునందలియుదాహరణములనియు, నహోబలపండితుఁ డుదాహరించుట కేవలము నసంగతమైయున్నది. ఈసందర్భములోని నన్నయభట్టారకాభిప్రాయములను స్వకాలికాంధ్రవాఙ్మయప్రయోగానురోధమున ననరించుచున్నను నధర్వణుఁడు పై కారికలో నహోబలపతి యసంగతోదాహరణములను సాధించుట కవకాశ మీయలేదు.

పయి నుదాహరించిన భూతకాలి కోత్తమపురు షైకవచనక్రియారూపవిషయమునందలి నన్నయభారతభాగాంధ్రశబ్దచింతామణుల యైకమత్య మొక్కటియే తద్గ్రంథద్వయమునకుం గలసంబంధమును సిద్ధాంతీకరించుచున్న దనుటకు సందేహము లేదు. తిక్కన కాలమువాఁ డగు కేతనమంత్రి సైతము

క. "పరువడి తినియుం దిమియున్
బొరయు నుభయవచనములకు భూతక్రియలన్" (ఆంధ్రభాషాభూ. ౧౪౦ప.)

అని యిట్లు భూతోత్తమైకవచనమున, 'తిని' అనురూపమునే సాధించెను గాని "తిన్జ్" అనురూపమును సాధించి యుండ లేదు. కాఁగా దీనిచొప్పున వెనుక నుదాహరించిన "అంటెని నిండజకు" అను నన్నయభట్టప్రయోగము భూతార్థక క్రియా

సంధ్యభావపక్షమున సమన్వితమె కానేరదు గదా. నన్నయ భారతభాగాంధ్రశబ్దచింతామణులకుఁ గలయనేకములగు నిట్టి యాంతరంగికసంబంధములే వాని యేకకర్తృకత్వమును రాద్ధాంతీకరింపఁజాలునని విమర్శకు లెన్నుదురు గాక !

(౧౦౩) కీర్తిశేషులగు రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమయాంధ్రకవులచరిత్రమునఁ జింతామణి నన్నయభట్టవిరచితము కాదని చూపెడిసందర్భములో నీసూత్రమును వినుదాహరించియున్నారు. నిత్యమిత్యాదిప్రకృతసూత్రము ప్రథమపురుషక్రియల యికారమునకు నిత్యసంధిని విధించుచుండఁగా నన్నయభట్టు తన భారతభాగమందలి యీక్రింది పద్యమున సంధ్యభావమును బ్రయోగించియుండుటంజేసి చింతామణి నన్నయభట్టరచితము కానేరదని వ్రాసిరి.

"ఆ. వె. అంతఁ గొందఱ అధికహాస్యంబుసేసిరి
అడవి నేమిగోసె దనిరి కొంద, ఱు..." (ఆంధ్రక-రివైజ్డ్. ౪౭)

ఈపద్యము నన్నయభారతారణ్యపర్వమున నున్నది. (౭ ఆ. ౧౦౩ ప.) నా రుదాహరింపలేదుగాని యిట్లే నన్నయభట్టారకుఁడు మఱొక్కచోటసయితము ప్రయోగించియున్నాఁడు.

"ఆ. వె. క్రమమువడసి యొక్కసమయంబు సేసిరి
ఒనర దాని తెలుఁగు వినుము తల్లి." (భార. ఆది-౬ ఆ. ౨౬౭ ప.

పై రెండుస్థలములందలి సంధ్యభావమును వాక్యాంతగతమైన పాదాంతమందే యగపడుచున్నది. పాదాంతమున వా

క్యాంతసంహిత వైకల్పిక మగుటచేత నచట సంధి చేయఁబడకుం డుటకుఁ గారణాంతరము వెలయుచున్నది. కావున నట్టిప్రయోగములఁబట్టి ప్రథమపురుషేకారసంధి వైకల్పికత్వమును గల్పించుట యుక్తముకాదు. అట్లే కల్పించినచో నీక్రిందిపద్యమున నన్నయభట్టారకుఁ డుకారమునకుసయితము పాదాంతమున సంధి చేయమింజేసి యుకారసంధికిని వైకల్పికత్వము నన్నయభట్టారకాభిప్రేతమని కేవలము విరుద్ధముగ నంగీకరింపవలసి వచ్చును గదా.

తే. గీ. సర్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావు
ఎఱుఁగుమెల్ల ధర్మమ్ములకెందుఁ బెద్ద
యండ్రు సత్యంబె ధర్మజ్ఞులైన మునులు.(భార. ఆది. ౪ ఆ. ౯౬ ప.)

(నేఁటివారు సవరించిరిగాని తాళపత్త్ర మాతృకలందును నిట్టిపాఠమే గలదు.)

పయిసందర్భమునుబట్టి పాదమధ్యమున నుత్తమపురుషేకారసంధ్యభావమును బైరీతిని జూపినట్లే ప్రథమపురుషేకారసంధ్యభావమును సైతము పాదమధ్యమునఁ జూపినంగాని యాంధ్రకవులచరిత్రకారులు కృతార్థులుకానోపరని విమర్శకు లెన్నదురు గాక ! అట్టిప్రయోగములు నన్నయభారతభాగమున శశవిషాణప్రాయము లనియు విశ్వసింతురు గాక !

(౧౦౪) బాలవ్యాకరణకర్త మధ్యమపురుషక్రియాల యికారమునకు మాత్రమే నిత్యసంధిని సూత్రించి తక్కిన ప్రథమోత్తమపురుషక్రియల యికారమునకు బాక్షికసంధిని

సూత్రించెను. బాలవ్యాకరణవ్యాఖ్యాతయగు గుప్తార్థప్రకాశి కాకర్త శతుస్సూత్రవ్యాఖ్యానసందర్భమున నిత్య మిత్యాదిప్రకృత సూత్రమును నుదాహరించి దానిలోని పురుషశబ్దము ప్రథమ పురుషమును బోధించు చున్నదనియు, నక్కారణమున "ఉత్త మప్రథమపురుషక్రియల ఇకారంబునకుఁ దక్క మధ్యమపురు షేకారంబునకు సంధి నిత్యము"(బాలవ్యా-గు-ప్ర- ౨౫ పుట.) గావచ్చుననియు, నుత్తమపురుషేకారముతోపాటు ప్రథమపురు షేకారమునకును సంధిపాక్షికమే యనియు, నన్నయభట్టతా త్పర్యమును నసంగతముగ నిర్ణయంచెను. మఱియుఁ బయిసూ త్రమున కట్టియర్థ మూహించియే యథర్వణాచార్యాదులు "ప్ర థమే చోత్తమే చైవ' ఇత్యాది పూర్వోక్తకారికను వివరించి యుండిరి." (బాలవ్యా. గు. ప్ర ౨౫ పు.) అని కేవలము ప్రా మాదికముగ వ్రాసెను. ఇంతియగాక నిత్యమిత్యాది ప్రకృత సూత్రమునకుఁ బ్రాచీన వ్యాఖ్యాతలును దనవలెనే వ్యాఖ్యలు చేసిరనియు నతిసాహసముగ వ్రాసెను. (బాల. వ్యా. గు. ప్ర ౨౫ పుట) చింతామణిలో లేనివిషయములనుమాత్రమే వికృతి వివేకము పూరించుచుండుననిదైన గుప్తార్థప్రకాశికాకర్త గ్రహిం చియుండకుండుట యెంతయు శోచనీయము. నన్నయభట్టు సూత్రమున కీయర్థమునే యథర్వణాచార్యుఁడు చేసికొనుట యేమి? మరల నద్దానినే యాతఁడు సూత్రించుటేమి? ఇంతి యగాక పైనుదాహరించిన రీతిని బాలసరస్వత్యప్పకవ్యహోబ లపండితులు నిత్యమిత్యాది ప్రకృతసూత్రమున కర్థము వ్రాయు

టలోఁ బ్రథమపురుషేకారసంధినిత్యతను గంఠోక్తముగఁ జెప్పి యట్లే యుదాహరించియుండఁగా వారు తనవలెనే వ్యాఖ్యచేసిరని వ్రాయుట కీతఁ డెట్లు సాహసించెనో తెలియకున్నది. ఇఁక నీతఁడుచేసిన చింతామణిసూత్రార్థము నన్నయభట్టారకప్రయోగములకుఁ బయినుదాహరించినరీతిని గేవలము విరుద్ధమై యుండుటచేత నప్రమాణమగుచున్నదనుటకు సందేహము లేదు.

పయి నుదాహరించినరీతినున్న ప్రథమపురుషక్రియేకార సంధి నిత్యతావిషయమునం గల నన్నయభారతభాగాంధ్ర శబ్ద చింతామణుల యాంతరంగికసంబంధముసైతము వానియేకకర్తృకత్వమునకుఁ బ్రబలాధారమై యున్నది. ప్రథమపురుషేకార సంధి నిత్యత చింతామణిప్రోక్తమనుటకు 'ప్రథమేచోత్తమే చే' త్యాద్యథర్వణకారికయే ప్రబలసాక్షి యగుచున్నది గదా.

నస్యాత్తద్ధర్మోక్త ఇతిసూత్రార్థ విమర్శనము. 3

(౧౦౫) తద్ధర్మార్థక ధాతూకారమున కచ్చుపరమగునపుడు సంధి లేదని యర్థము. ఉ. చేయుఁ + ఎల్లప్పుడు = చేయునెల్లప్పుడు. చేయుఁ + అట్టిది = చేయునట్టిది. చేయుదు మిప్పుడు మున్నగు స్థలములందలి యుకారము ధాతునిష్ఠముగాక ప్రత్యయస్థ మగుటంజేసి యచటి సంధి నిర్బాధమని యెఱుంగునది.

(౧౦౬) అప్పకవి యీసందర్భమునసైతము స్వరసంధికి ద్రుతప్రకృతికత్వమే ప్రతిబంధకమని తలఁచి తద్ధర్మప్రథమోత్తమైకవచనముల యుకారములు (చేయుఁ, చేయుదుఁ),

ద్రుతప్రకృతికము లగుటచేతఁ బరరూపసంధి గలుగదనియుఁ దక్కిన తద్ధర్మక్రియల యుకారములు కళలుగాన (చేయుదుము. ము) వానికిఁ బ్రాణసంధి ఘటిల్లుననియుఁ జింతామణి విరుద్ధముగ వివరించియున్నాఁడు.

తే. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్య
పురుషముల నేకవచనముల్ పోవ విడిచి
కడమపదములు తజ్జర్మధ్యకములు గానఁ
గొమ్ములను బ్రాణసంధులు గూర్చుటొప్పు. (అప్పక. ౫౪ ౬౯పద్యము.)

మఱియు నీతని చింతామణిపాఠములలోఁ బునరుక్తముగ "ధాతుపదసంభవానాం విశేషణానా ముత స్తథా ను మచి" అనెడి యధికపాఠ మొకటి యగపడుచున్నది. దీనివలన లభించు నర్థము నస్యాదిత్యాదిప్రకృతసూత్రముచేతనే పైని వ్రాసినరీతిని లభించుచున్నది.

అప్పకవి "ద్రుతస్య సర్వత్రలుక్ సమాసేషు" అను సూత్రమున కపార్థమును జేసికొనియుండుటంబట్టి యాతఁడు, సామాసికద్రుతలోపము రాఁగా ధాతుజవిశేషణముల కచ్చుపరమగునపుడు సంధ్యభావస్థలములలో వానినడుమ లఘుయకారము నిల్చుచున్నదనియు, ధాతుజవిశేషణములు తిజ్మధ్యేత్యాది సూత్రముచొప్పున ద్రుతప్రకృతికములే యనియుఁ జెప్పెడి చింతామణియాశయమును సరిగ గ్రహింపలేదని తోఁచుచున్నది. కావుననే పైనుదాహరించిన ధాతుపదేత్యాది

సూత్రసందర్భములోని యాతని యీక్రిందివివరణ ముకారాంత
తద్ధర్మార్థకవిశేషణములు కళ లనుతలంపునఁ జేయఁబడెను.

తే. క్షితిని బైపదములకు విశేషణంబు
లగు క్రియాపదముల తుది నమరుశబ్దంగ
మునకు వచ్చు నాగమమయి పొల్లుద్రుతము
ప్రాణపరమైన గర్మధారయమునందు.

క. ...చను నతఁడు... (అప్పక. ౫ ఆ. ౮౭, ౮౮ ప).

ఇట్టి యప్పకవీయరచనమున భ్రమించుటచేతనే కావలయు బాలవ్యాకరణకర్తృప్రభృ త్యధునాతనులెల్ల ధాతుజవిశేషణములు కళలనియు, నకారణమునఁ దద్ధర్మార్థకవిశేషణోకారమున కచ్చుపరమగునపుడు నకారాగమము వచ్చుననియు సూత్రించుచు వచ్చిరి. బాలవ్యాకరణకర్త పైనుదాహరించినరీతిని దద్ధర్మార్థకవిశేషణములను గళలుగా సూత్రించియుండుటచేత నాతఁడు సూత్రించిన "తద్ధర్మార్థకవిశేషణోకారమున కచ్చుపరమగునపుడు నకారమువచ్చును" (బాల. సంధి. 33) అనుసూత్ర మంతగా విరుద్ధము కాకున్నను నద్దానిని జదివిన సంస్కారబలమున "నస్యా త్తద్ధర్మోత్కః" అనెడి ప్రకృతసూత్రమునను నట్టియభిప్రాయమునే కల్పించుచు దానికిసరిగఁ బైసూత్రమును "నస్స్యా త్తద్ధర్మోత్కః" అను నాకారముతో నుదాహరించుచున్న యధునాతనచింతామణివ్యాఖ్యాతల భ్రమ ప్రమాదము లెంతయు నయుక్తములై యున్నవి. (చూ. పారనంది రామశాస్త్రులవారి యుద్ద్యోతినీవ్యాఖ్య.)

" 'అనాదిషు విభక్తి ష్వాత్తో వా' 'చోర్వాస్యాత్' ఇతి ప్రాప్తే
విభాషారంభేణ ద్రుత పూర్వప్రాణసంధే రిష్టత్వేన జ్ఞాపనాత్."
(అహో. ౧౮౫ పుట.)

అను సహోబలపండితీయము చెప్పిన ద్రుతపూర్వస్వర పరరూప సంధి చింతామణిసమ్మత మగుటచేత "అనుతః" అను పర్యుదాసము చెప్పిన నుకారసంధి నిత్యమగుటంజేసి 'చేయున్ + ఎల్లప్పుడు' మొదలగు తద్ధర్మార్థక సమాపక క్రియోకారములకు నిత్యసంధి ప్రాప్తించుచుండఁగా 'నస్యాది'త్యాది ప్రకృతసూత్రము వారించుచున్నదనియు, సూత్రములోని 'న' అనునది నఞర్థకమగు న శబ్దముగాని ద్రుతాగమాత్మకముగాదనియు గ్రహింపవలెను. "చేయున్ + అట్టి" మొదలగు తద్ధర్మార్థకవిశేషణస్థలములలో సైతము సంధినిషేధ వ్యాఖ్యాన సామర్థ్యముచేతనే సామాసికద్రుతలోపము రానేరదు. కానఁ దత్రత్యద్రుతముచేతనే చేయునట్టిమున్నగు రూపములసిద్ధి యగుచుండుటంజేసి నకారపునర్విధాన మనావశ్యకమగుచున్నది. ఇఁక నధునాతనవ్యాఖ్యాతల ప్రామాణికవ్యాఖ్యల చెప్పిన 'నస్యాది'త్యాది ప్రకృతసూత్రమును దద్ధర్మార్థకవిశేషణముల సంధిలో నకారమును విధించుదానినిగనే యంగీకరించినచోఁ జింతామణి ద్రుతపూర్వస్వరసంధిని సమ్మతించునదగుటంజేసి తద్ధర్మార్థక సమాపకక్రియల సంధిలో "చేయెల్లప్పుడు" (చేయున్ + ఎల్లప్పుడు) మొదలగు ననిష్టరూపములు చింతామణిపక్షమున దుర్వారములే కావలసివచ్చును.

"ఆచాంసంధా ప్రుతో౽ద్వృశ్య శ్రసితో౽పిచ సదాభవేత్."

అను నథర్వణకారికయుఁ, జింతామణిలో ప్రుతపూర్వస్వరసంధి సమ్మతిని వివరించుచునే యున్నది. వేయేల! "నస్యా" దిత్యాది ప్రకృతసూత్రములో 'న' అనునదిమాత్రమే నన్నయాభిప్రేత మనియు, "నః" అనునది కాదనియు, నచట సంధిలేదన్నయర్థమే సందర్భశుద్ధిగ సంగతమగుననియు, నకారాగమము వచ్చునన్న యర్థమున కచటఁ బూర్వోత్తరసందర్భశుద్ధియే లేనందున నట్టి పాఠ మచటఁ గేవలము నసంగతమే యగుననియు, నీక్రింద నుదాహరించు నచటిచింతామణిసూత్రపు సందర్భమే నొక్కి-వక్కాణింపఁజాలియున్నది.

శ్లో. "సంధి ర్నాచో౽చ్యనుతో వాతో నాదిషు విభక్తి ష్వాతో వా,
నిత్య మనుత్తమపురుషక్రియాస్వితః పరిమితౌ సమస్తానామ్.

శ్లో. నస్యా త్తద్ధర్మోఽత శ్చేర్వా స్యా ద్వర్తమాన విహితస్య,
తద్వ త్తదాదిజస్య ప్రాయస్తు స్యా త్కి-మాదికస్యేతః"

(ఆంధ్రశ. సంధి. ౧-౨ శ్లో.)

పై సందర్భమునందెల్ల "సంధివచ్చును, రాదు, వికల్పముగావచ్చును"అను రీతిని బరరూపసంధివిషయకమగు ప్రస్తావము మాత్రమే యర్థ మగునుగాని వానినడుమ నొకసూత్రమున నకారాగమము వచ్చునని యర్థముగాదని సంస్కృతభాషాసంప్రదాయము తెలిసిన బుద్ధిమంతుల కెవ్వరికైనఁ దోఁచకమానదుగదా. కావున "నస్యా" దిత్యాది ప్రకృతసూత్రమునకు

"తద్ధర్మార్థక ధాతూకారసంధి" రాదనియే యర్థము చేయక తీరదు.

(౧౦౭) కావుననే బాలసరస్వత్యాహోబలపండితులు సైతము "నస్యా" దిత్యాదిపాఠమునే యంగీకరించి యీక్రింది రీతిని వ్యాఖ్య చేసియున్నారు. "తద్ధర్మేతః=క్రియలయొక్క తద్ధర్మార్థమందలి, ఉతః=ఉకారమునకు, నస్యాత్=సంధి లేదు. రక్షించునంబ, పోషించునీశ్వరి" (బాలసరస్వతీయము. లిఖత మాతృక.)

"తద్ధర్మేకార స్యాచి సంధి ర్నస్యాత్." తద్ధర్మపదేన తద్ధర్మక్రియా తజ్జ స్యవిశేషణం చ గృహ్యతే. ఉ. వెలయు నతని కీర్తి, ఒనర్చునంబుజాక్షి."
(అహో. ౧౯౨ పుట.)

అని యిట్లుగ నహోబలపండితుఁడు తద్ధర్మార్థకక్రియలయొక్కయుఁ, దద్ధర్మార్థక విశేషణములయొక్కయు, నుకారమునకు సంధినిషేధమును వివరించియున్నాఁడు. ఈపక్షమున

"సద్ధర్మమార్గంబు సలుపుదయ్య... సేవింతె... చింతింతె"
(భార. సభా. ౧ ఆ. ౨౬ ప.)

మొదలగు నన్నయభట్ట సంధిప్రయోగములను జింతామణి సాధింపనేర దనుశంక రాఁగా నద్దానికి సమాధానముగా "నస్యా"దిత్యాది ప్రకృతసూత్రములోని తద్ధర్మశబ్దము ప్రథమోత్తమపురుషైక వచనమాత్రపరమే యని యీక్రింద యథర్వణకారిక నుదాహరించుచు నహోబలపతి వ్యాఖ్య చేసియున్నాఁడు.

"ద్వితీయాచార్యేణాపి తద్ధర్మస్య భూతాద్యవిషయకత్వ మేవోక్తమ్, ప్రథమోత్తమైకవచనాంతయో ర్నాంతయోః పదయోరేవ తద్ధర్మ సంజ్ఞకత్వ ముక్తమ్—ఘటింతు ర్విత్యాదావపి నాంతత్వాభావా న్న తద్ధర్మసంజ్ఞా, వాగనుశాసనమతే త్వేషాం తద్ధర్మార్థకత్వ మేవేతి."
(అహోబల. ౪౫౯ పుట.)

"ఘటింతుమనిశము ఇత్యాదౌ సంధి ర్నస్యాత్, నస్యాత్తద్ధర్మేత ఇతి నిషేధా దితిచేన్న. తత్ర ప్రథమోత్తమపురు షైకవచనద్వయ మేవ గృహ్యతే. నాన్యత్ ప్రయోగవిరోధాత్."
"ప్రథమ శ్చోత్తమశ్చైవ తాసు తద్ధర్మసంజ్ఞకౌ,
భూతాద్యవిషయౌ తత్ర చైకత్వార్థాభిధాయకౌ,
ఉదంతౌ చ సదా నాంతౌ నసంధి స్తత్ర కల్ప్యతే.
ఇత్యథర్వణభాషితాచ్చేతి" (అహో. ౪౨౧ పుట.)

పై రీతిని ప్రయోగబాధ కలుగుటచేతఁ దద్ధర్మార్థకక్రియలలోఁ బ్రథమోత్తమపురుషైక వచనక్రియలకుమాత్రమే తద్ధర్మసంజ్ఞ కలదని యర్థమును సంకోచపఱుచుకొనునపుడు 'నస్యా' దిత్యాది ప్రకృతసూత్రముచేతఁ దద్ధర్మార్థకవిశేషణోకారసంధి యథర్వణమతమున వారింపఁబడనింజేసి

"ఇది వచ్చునుపాయము." (భార. ఆది. ౧ ఆ. ౧౫౦ ప.)

మున్నగు నన్నయప్రయోగములు సంగ్రహింపఁ బడనేరవు. మీఁదు మిక్కిలి "వచ్చుపాయము" మున్నగు ననిష్టరూపములు దుర్వారము లగుచున్నవి.

కాఁగా 'నస్యా' దిత్యాది ప్రకృతసూత్రమున కహో బలపండితాదులు చేసినవ్యాఖ్య సరికాదనియు, నేను మో

మొదట వ్రాసినచోఁ (౧౦౫. వి.) దద్ధర్మార్థకధాతూకారమునకు సంధిరాదనునర్థమే నన్నయభట్టారకాభిప్రేతము కాఁగలదనియు నెన్నవలెను. ఇట్టియర్థము నంగీకరించునపుడు "రక్షింతురు, రక్షింతువు, రక్షింతునన్, రక్షింతుము" మొదలగువానిలోని యుకారములు ప్రత్యయస్థము లగుటం జేసి వాని విషయమున సంధినిషేధసూత్రము ప్రవర్తింపనేరదనియు, నిఁక 'రక్షించున్' అనెడి ప్రథమపురుషైకవచనములోను దద్ధర్మాద్యర్థకవిశేషణములోను నున్న 'ఉకారము' ధాతుసంబంధియే యగుటం జేసి యచటమాత్రము సంధినిషేధము కలుగఁగా 'రక్షించు నెల్లప్పుడు, రక్షించునట్టి' అనురూపములు సిద్ధించుననియు, 'రక్షించెల్లప్పుడు' మున్నగు ననిష్టరూపములు పుట్టనేరవనియు గ్రహింపవలెను. 'రక్షింతునన్' అనునది చింతామణిప్రక్రియచోఁ దద్ధర్మాద్యర్థకోత్తమ పురుషైకవచన సంపూర్ణరూప మగుటం జేసి యపుడు సంధిప్రాప్తించినను "రక్షింతు నెల్లప్పుడు" మొదలగు సాధురూపములే సిద్ధించును. ఇఁక నద్దాని సంక్షేపరూపమగు "రక్షింతుఁ" అనుదానిలోని దువర్ణస్థానీయమగు 'తు' అనునది, ప్రత్యయము పరమగుచుండఁగా ధాతువును జేరినదగుటం జేసి యచట సంధినిషేధమే ప్రాప్తించునని వ్యాఖ్యానము చేసికొనవలసియున్నది.

(౧౦౮) చింతామణి క్రియాపరిచ్ఛేదము తత్సమవిషయప్రధాన మగుటచేతను నందు 'ఎడి, ఎడు' అనునవి తద్ధర్మార్థక

ప్రత్యయములుగా నుపదేశింపఁబడి యుండకుండుటచేతను నిం
తియ కాక నన్నయ భారతభాగమున నట్టి తత్సమరూపముల
కెచ్చటనైనఁ బ్రయోగము లేకుండుటచేతను "రక్షించెదున్"
అనుచోట సంధినిషేధము పైసూత్రమున సంగ్రహింపఁబడ
కుండుట విరుద్ధము కానేరదు. లేదా 'డి, దు' లు ధాతువునె
చేరినవగుటచే ('రక్షింతున్' అనుచోటి 'తు' వలెనె) సంధిని
షేధము లభించుచున్న దనియైన నెన్ననగును.

పునరాగమః క్రియాణాం పర్యాప్తో మన్మతే తు సంకేత

ఇతి సూత్రార్థవిమర్శనము.

(౧౦౯). "క్వచిద్ధేతుమత్సు కా ధాతోర్గ్రహణమ్. 'ప్రస్థాపించె రాజన్యులన్'
'అర్థవేదయో రాపుగ్వక్తవ్యః, అర్థంకరోత్యాచష్టే వా. అర్థాపయతీతి
పాణినీయమ్' అర్థాపి, ఉత్థాపి, అధ్యాపి, ఏతద్విశేషగ్రహణం వాగ
నుశాసనానామభిప్రేతమ్. పునరాగమః క్రియాణా మిత్యుక్తేః. పున ర
పూర్వవిశేషేణేతి పునరవ్యయార్థవిజ్ఞానాత్, విశేషాగమః క్రియా
ణా మితిహి తదర్థః, అతఏవ 'అవధారుదేపి' ఇతి రూపం నిర్బా
ధమ్ 'అవధరింపుము' ఇతి తదర్థః." (అహో. ౪౬౮ పుట.)

"వ్యాఖ్యాత మేత త్సూత్ర మధస్తాదేవ. ఘటింపుచున్నాఁడు. ఇత్యత్ర
దీర్ఘోప్యనేనైవసిధ్యతీతి న కశ్చి త్కళంకః...పర్యాప్తః=పూర్ణః,
సుప్రసిద్ధ ఇతి యావత్, మన్మ తే తు సంకేతః పర్యాప్తోభవతి, య
త్సంకేతితం శిష్టప్రయోగారూఢం పదం తత్ ప్రయోజ్య మిత్య
త్ర నాస్మాక మభినివేశః. శాస్త్రస్యతు దిక్ప్రదర్శనార్థత్వేన సార్థక్య
మితిభావః." (అహో. ౪౯౪ పుట.)

(౧౧౦) పరిశీలింపఁగా నహోబలపతిచేసిన పై వ్యాఖ్య యు నుదాహృతులును నన్నయాభిప్రేతములై యుండ లేదని తోఁచుచున్నది. ఆచ్ఛికక్రియారూపసాధనమున కీసూత్ర మెంత మాత్రమును బ్రారంభింపఁబడియుండలే దని గ్రహింపవలసి యున్నది. తత్సమక్రియలలో నతిప్రచురముగా నున్న తిజంత రూపములను మాత్ర మీవఱకు సాధించియుండుట చేతను, దనకును మఱికొన్ని తిజంతరూపములు క్వాచిత్కముగా సమ్మతములై యున్నను నీవఱకు సాధించి యుండకుండుటచేతను నట్టి క్వాచిత్కరూపముల కెల్ల సూత్రవిధానము చేయుట దిక్ప్రదర్శన మాత్రోపదిష్ట చింతామణి రచనోద్దేశము కాకుండుటచేతను బ్రయోగారూఢములైన యట్టి క్వాచిత్క రూపములను నీసూత్రముచే సంగ్రహించుకొనవలె నని నన్నయభట్టారకుఁడు తలంచియుండె నని గ్రహింపవలసియున్నది. అనఁగా నట్టి క్వాచిత్కతత్సమక్రియారూపములను సాధించుసందర్భమున నావఱకుఁ జెప్పఁబడిన ప్రక్రియ నాధారముగఁ జేసికొని వర్ణకవిశేషములను మరల నాగమములుగాఁ జేర్చుకొనుచున్నచో (పునః=మరల, ఆగమః=వర్ణవిశేషాగమము) నట్టి క్వాచిత్కతత్సమక్రియారూపములు సిద్ధించునని తాత్పర్యము. చింతామణి దిక్ప్రదర్శనార్థక మగుటంజేసి యట్టి క్వాచిత్కరూపములు పండితవ్యవహారస్థములై ప్రయోగారూఢములైనచో గ్రహింపవలసినదే (సంకేతః=వాడుక, పర్యాప్తః=

పైసందర్భమును బట్టి 'పునరాగమ' ఇత్యాదిసూత్రము చింతామణిక్రియాపరిచ్ఛేదముచే సాధింపఁబడనట్టియుఁ, గాదా చిత్కముగా నన్నయభట్టారకునకును బ్రయోగించుటలో విరోధము లేనట్టియుఁ దత్సమక్రియారూపములను సంగ్రహించుటకే నన్నయభట్టుచే సూత్రింపఁబడిన దనుటకు సందేహము లేదు. అట్లు సంగ్రహించుటలోనయిత మావఱకుఁ జెప్పఁబడియున్న క్రియాపరిచ్ఛేదములోని తిజంతప్రక్రియ నాధారముగఁ జేసికొని ప్రయోగప్రసిద్ధిని బట్టి వర్ణవిశేషాగమయోజనముచే నట్టిరూపములను సంగ్రహించుకొనవలెనని యాసూత్రమును బట్టి నన్నయభట్టారకాభిప్రాయము విశదమగుచున్నది. ఇట్లే క్రియాపరిచ్ఛేదమునందలి యీసూత్రమువఱకును గల ప్రక్రియచే సాధింపఁబడిన రూపములపైని మరల, గొంత తెలుచుగావచ్చుచుండెడి వర్ణాగమములను గొన్నింటి నీసూత్రమునకుఁ దరువాత దీనికిఁ బ్రపంచముగనే వివరించి తుట్టతుద నల్లు చెప్పఁబడిన తత్సమక్రియాకార్యములనెల్ల దేశ్యధాతువుల కతిదేశించి వానికింకను ననేకములగు నాగమాదివిశేషములు గలుగునని చెప్పి యంతటితో గ్రంథమును ముగించెను. పైరీతిని నన్నయభట్ట భారతభాగమునఁగ్వాచిత్కములుగఁ బ్రయుక్తములయి యున్న సంస్కృతసమక్రియారూపముల నిట'పునరాగమ'ఇత్యాదిసూత్రముచే సాధించి చూపుచున్నాను.

(౧౧౧) 'వ్యతిరేకాదా భావిని చాత్ స్యాత్' అను సూత్రముచే వ్యతిరేకార్థమునందుఁ గ్రియల తుదిని హ్రస్వాకా

రము నిల్చు నని చెప్పఁబడియున్నది. అట్టి "అత్త్వము" చేసిన
తెలుచుగ వాడుచున్న "రక్షింపనున్" అనురీతిగల సమాప
క్రియలను, 'రక్షింపని' అనుజాతిగల యసమాపకక్రియలన
జింతామణికర్త సాధించి యున్నాఁడు. కాని క్త్వాచిత్కముగ
దానుసైతము ప్రయోగించియున్న 'తేజరిల్లమి, రక్షింపమి
లంఘింపమి' అనెడి వ్యతిరేకభావార్థకరూపములను 'భేదింపక
శంకింపక' అనుజాతిగల వ్యతిరేకక్త్వార్థక రూపములను సాధి
చియుండలేదు. కావున వ్యతిరేకార్థమునందుఁ బైని వ్రాసి
"వ్యతిరేకాదా'విత్యాది సూత్రముచే 'అత్త్వము' చేసికొ
మరల 'పునరాగమ' ఇత్యాదిసూత్రముచేత భావార్థమున 'ప
అనుదానిని "క్త్వా"ర్థమున 'క' అనుదానిని జేర్చి 'అనుబాధే
త్యాదిసూత్రముచే 'ప'త్వముచేయుఁగా నట్టిరూపములు సిద్ధి
చుచున్న వని గ్రహింపనగును.

సీ. "త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁ జేసి..." (భార. ఆది. ౧ ఆ. ౧౪౧ ప
క. "శరణువేఁడిన రక్షిం, పమియును..." (భార. అర. ౧ ఆ. ౧౭౦ ప
క. "వాక్యము లంఘింపమికి..." (భార. అర. ౩ ఆ. ౧౪౩ ప
క. "మనమున భేదింపక..." (భార. ఆది. ౫ ఆ. ౧౬౨ ప
క. "పంపందగుఁ దగదని శం, కింపక..." (భార. సభా. ౧ ఆ. ౨౮౦ ప

పైరీతినే వ్యతిరేకార్థమునందు 'అత్త్వము' చేసిన పిదప
ప్రార్థనార్థమున 'ఏకత్వేఽథే' త్యాది సూత్రముచే 'ము' ప
మైయుండఁగా "పునరాగమ" ఇత్యాది సూత్రముచే '

అనుదానిని జేర్చి నన్నయభట్టారకుఁ డొక్కచో మాత్రము ప్రయోగించియున్న "విచారింపకుము" అను వ్యతిరేకప్రార్థ నార్థకరూపమును సంగ్రహింపవలయును.

క. బహురథగజవాహనభట
సహితులు బలవంతు లని విచారింపకు నీ...(భార. అర. ౧ ఆ.౨౫౪ప.)

పైవిధముననే 'ము' అనెడి తిఙ్పరమగునపు డేర్పడిన "విచారింతుము" అనుచోట "పునరాగమ" ఇత్యాది ప్రకృత సూత్రముచే "అ" అనుదానిని జేర్చి సంధించినచో 'విచారింతము' అనెడి రూపమును, నట్లే సాధించిన 'పరిగ్రహింతము' అనెడిరూపమును సంగ్రహింపనగును.

క. "తరుణిని బరిగ్రహింతము..." (భార ఆది. ౭. ఆ. ౨౧౬ ప.)
క. "ధీరమతి విదురుతోడ విచారింతము..." (భార. సభా. ౨ ఆ. ౧౨౪ప.)

పై రీతినే 'తద్ధర్మవర్తమానే' త్యాదిసూత్రముచే 'రక్షించు' మున్నగు రూపము లేర్పడియుండఁగా నట్టివానిపై నవఁగా 'అపేక్షించు, ఉద్భవిల్లు' అనువానిపైని భావార్థవివక్షయందు 'డు' అనుదానిని జేర్చి నన్నయభట్టారకుఁడు ప్రయోగించి యున్న "అపేక్షించుడు, ఉద్భవిల్లుడు" అను రూపములను సంగ్రహింపవలయును. ఇట్టి భావార్థమునందే

"భావే టవర్గకోంతే సర్వేషాంచ క్రియాపదానాం స్యాత్"

అనుసూత్రముచే విధింపఁబడిన టవర్గకము సార్వత్రికమనియుఁ, గ్వాచిత్కముగా నీ 'డు' అనునదియు రావచ్చుననియు సూత్రములోని 'సర్వేషాంచ' అనునది సూచించుచున్నది.

శా. "అదుర్యోధనుఁ డుద్ధవిల్లుడును గ్రవ్యాదారవంబుల్......"
(భార. ఆది. ౫ ఆ. ౧౦౬

సీ. "కడకతో నఁజుల్లు కదుగఁగ సమకట్టి, జల మపేక్షించుడు సంభ్ర
(భార. అర. ౨ ఆ. ౧౯౭

(చూడుఁడు. వి. ౫౮)

పై మార్గముననే 'దు తివర్ణకా' విత్యాదిసూత్రము దువర్ణము రాఁగా 'పునరాగమ' ఇత్యాదిసూత్రము చొ "ఏత్వాత్వములు" చేసి క్వాచిత్కముగ నన్నయభట్టారక ప్రయోగించియున్న "పరిభ్రమించెద, ప్రసాదించెదు" అను పములను సంగ్రహింపనగును.

క. "కానలఁ బరిభ్రమించెద......" (భార. అర. ౨ ఆ. ౧౦౫

క. "త్ర్యంబక నాకు నభీష్టవరంబు ప్రసాదించెదేని......"
(భార. అర. ౧ ఆ. ౩౨

ఇట్లు తద్ధర్మార్థమున 'ఎద' వచ్చురూపములు నన్న భట్టారకునిగద్యములలో మఱినాల్గుచోటులం దగపడుచున "రచియించెద" (ఆది ౧ ఆ. ౨౧ గ.) "వివరించెద" (ఆది ఆ. ౭౩ గ.) "ధరియించెద" (అర. ౩ ఆ. ౮౨ గ.) "జీవించె (ఆది. ౭ ఆ. ౫౧ గ.)

ఇంక "రక్షించు" అనురీతిగల తద్ధర్మాద్యర్థకవి రూపములు "తద్ధర్మవర్తమానాతీతాగామ్యర్థకాః క్రియాజ్ఞేయ అనుసూత్రముచొప్పున సంగ్రహించుకొనవలసి యు

ధాతువునకే తద్ధర్మన ర్తమానాద్యర్థములు గలవని పైసూత్రము బోధించుచున్నది. ఆయాయర్థములందుఁ బ్రత్యయాంతరములను దిగిగి గ్రంథకర్త విధించునప్పుడుమాత్రమే వానితో వానికి నిత్యసంబంధ ముండితీరవలయును. కాఁగా "భూతార్థానాం తు నః" అను సూత్రముచే భూతార్థమున న ప్రత్యయమును, "వసతి" రిత్యాదిసూత్రముచేత వర్తమానార్థమున నుండుధాత్వనుబంధమును 'అస్తి' రిత్యాదిసూత్రముచే భవిష్యదర్థమున 'కలుగు' ధాత్వనుబంధమును 'ప్రతిషేధవాచినాం నిః' అనుసూత్రముచే వ్యతిరేకార్థమున 'ని' ప్రత్యయమును విధింపఁబడుటచేత నాయాయర్థములలో నాయాప్రత్యయాములతోడనే ప్రయోగించి తీరవలయుననుట నిశ్చయము. ఇఁకఁ దద్ధర్మార్థమునందన్ననో యట్టి ప్రత్యయాదులు చెప్పఁబడలేదు. పురుషవచనాదిభేదములను దెల్పుటలో 'దు, ను, ము' మున్నగునవి చెప్పఁబడినను దద్వివక్ష లేనప్పుడవి రావలసిన ప్రసక్తియుండదుగదా. భూతము వ్యతిరేకము మున్నగు నర్థములలో వచ్చెడి పైనిర్వాసిన 'న, ని' మున్నగు వానితోఁగూడి "రక్షించిన, రక్షింపని" మున్నగువ వెల్లు ప్రథమాలోపమునఁ బదములగుచుఁ బ్రయోగార్హత నందుచున్నవో యట్లే స్వార్థేంచుగాగమముతోఁగూడిన యీతద్ధర్మార్థక ధాతువులును బదములగుచుఁ బ్రయోగార్హత నందుచున్నవని గ్రహించవలెను. అట్లుగాక భూతార్థాములందు న ప్రత్యయా

దులు చేరినట్లే యీతద్ధర్మార్థమునను నేదేని ప్రత్యయము చేరక ధాతుమాత్రము ప్రయోగార్హత నంద నేరదను పక్షమున నట్టి వానిపై 'పునరాగమ' ఇత్యాది ప్రకృతసూత్రము చేత 'ఉ' అనుదానిని నిలిపి తద్ధర్మార్థకవిశేషణముగా గ్రహింపవలయును. పిదప నిదియుఁ దక్కిన ధాతుజవిశేషణములతోఁ పాటు 'తిజ్మ ధ్యే' త్యాదిసూత్రముచే ద్రుతప్రకృతిక మగుచున్నదని గ్రహింపవలెను. నన్నయభట్టారకుఁ డిట్టితద్ధర్మార్థకవిశేషణ తత్సమరూపములను బ్రయోగించియు నున్నాఁడు.

ఉ. ...ధాత్రిఁ బరిభ్రమించు బలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.
(భార. ఆది. ౧ ఆ. ౧౦౮ ప.)

క. "శరణనినవారిఁ గరుణా
కరులయి రక్షించు పురుషకార్యాన్వితులే..." (భార.ఆది ౧ఆ.౧౩౭ప.)

ఇంక నన్నయభట్టభారతభాగమున 'రక్షించెడు, రక్షించెడి, రక్షించెడున్, రక్షించుతన్, అనుజాతిగల తత్సమరూపము లగపడలేదు. కావున నట్టివానిని జింతామణిచొప్పున సాధించుకొనవలసిన యావశ్యకత లేదు.

పైనుదాహరించినవానిలో, 'క, మి' అనునవియు బునరాగమసూత్రముచే సాధింపఁదగినవని యొకచో నహోబలపండితుఁడు వ్యాఖ్యచేసియున్నాఁడు. (అహో ౪౯౭ పుట) కాని యచట, 'డు, డి' అనునవియుఁ బునరాగమసూత్రము

చేతనే సాధింపఁదగు ననుట యొంతమాత్రమును సరికాదను టకు సందేహము లేదు. బాలసరస్వతి యీసూత్రమున కర్థము సరిగా గ్రహింపఁజాలక కావలయు దీనియర్థము సంప్రదాయ వేద్యమని వ్రాసియున్నాఁడు.

"తద్ధర్మ వర్తమానా, తీతాగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః తత్ర ద్వితీయతుర్యో, యా తౌ స్త స్సానుబంధకా వేవ. వసతి రనుబంధక స్స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర, అస్తి రనుబంధక స్స్యా ద్యత్ర ల్నృడర్థో వివక్షితో ధాతోః"

రితి సూత్రార్థవిమర్శనము. ౫౭.

(౧౧౨) వీనికి బాలసరస్వతి యీక్రిందిరీతిని వ్యాఖ్యా నము చేసియున్నాఁడు.

'క్రియాః=ఈమూఁడువిధములైన క్రియాపదములున్నూ, తద్ధర్మవర్తమా నాతీతాగామ్యర్థకాః—తద్ధర్మ=తద్ధర్మమున్నూ వర్తమాన=వర్తమానమున్నూ,అతీత=అతీతమున్ను, ఆగామి= భవిష్యత్తున్ను అయినషువంటివిన్ని, అర్థకాః=అర్థములు గల వాటినిగాను, జ్ఞేయాః=తెలియదగినది. తద్ధర్మము లనగాభూత భవిష్యద్వర్తమానములకంటె విలక్షణమైనషువంటి యొకా నొకధాతువ. ఆధాతువయొక్క అర్థమని దానికి అన్వర్థసంజ్ఞ ... ......' 'తత్ర=ఆఅర్థచతుష్టయ వాచకక్రియలలోను, ద్వి తీయతుర్యా=రెండోదీ నాలుగోదిన్నయిన, వర్తమానభవిష్య

దర్థములు, యౌ=ఏవో, తౌ=అవి, సానుబంధకావేవ=అను
ధములతో కూడుకొన్నవయియ్యేవే, స్తః=అవును. ... ...
... ... ... ... ... ...,"యత్ర=యెక్కడను, ధాతోః=ధా
వుకు, లడర్థః=వర్తమానార్థము, వివక్షితః=చెప్పబడుచున్నదో
తత్ర=అక్కడను, వసతిః='వసనివాసే' అనేధాత్వర్థము, అ
బంధకః=అనుబంధకము, స్యాత్=అగును. అనగా నిత్యము
సంబంధియై యుండుననుట, యత్ర=యెక్కడను, ధాతోః=
తువుకు, లృడర్థః=భవిష్యదర్థము, వివక్షితః=చెప్పబడుచు
దో, తత్ర=అక్కడను, అస్తిః='అసభువి' అనేధాత్వర్థము, అ
బంధకః=అనుబంధకము, స్యాత్ = అవును ... అనగా ల
సూచకమైన వర్తమానార్థమును చెప్పే క్రియాపదముపై
'ఉన్న' అనేపదమున్ను, లృడర్థసూచకమైన భవిష్యదర్థము
చెప్పే క్రియాపదముపైని 'కల' అనేపదమున్ను ఉండుననుట
(బాలసరస్వతీయము. రావుసాహేబు గిడుగు వేంకట రా
మూర్తిపంతులవారి తాళపత్రమాతృక. ౨. 3 తాటాకులు

అహోబలపండితుఁడును బైయభిప్రాయములతో
వ్యాఖ్యానము చేసియున్నాఁడు. తద్ధర్మార్థవిషయమునమా
మీాక్రిందిరీతిని విశేషించి వ్రాసియున్నాఁడు.

"తత్రాచార్యైః కాలమవివక్షిత్వైవ ధాత్వర్థమాత్రే వివక్షాక్రియ
అతఏవ తద్ధర్మ ఇత్యన్వర్థసంజ్ఞా, తస్య ధాతోః ధర్మః వాచ్యార్థమ
మితి. (అహో. ౪౫౯ పు

(౧౧౩) "వ్యతిరేకార్థే లృటి లటి డుజ్' స్యాత్" 'వ్యతిరేకార్థే=వ్యతిరేకమందున్ను, లృటి= భవిష్యదర్థమందున్ను, లటి=వర్తమానార్థమందున్ను, డుజ్ స్యాత్ =డుజ్ వర్ణకమవును. జిత్తు గనుక అర్ధబిందుయుక్త మవును. పూర్వసూత్రానువృత్తి చేత, ప్రథమైకవచనానకు అని తెలిసేది. ఘటింపడు, ఘటింప గలడు. ఘటింపుచున్నాడు.' (బాలసరస్వతీయము, లిఖిత మాతృక, ౪౯ కాగితము) 'ఘటింపఁడు, చేయఁడు, ఘటింపఁ గలఁడు, ఘటింపుచున్నాఁడు' (అహో. ౪౭౯ పు.)

పై సందర్భమునుబట్టి బాలసరస్వత్యహోబలపతులు 'ఘటింపఁగలఁడు, ఘటించుచున్నాఁడు' అనువానిలోని 'కలఁడు, ఉన్నాఁడు' అనురూపములను సైతము చింతామణి సాధించుచున్నదని యభిప్రాయపడినట్లు స్పష్టపడుచున్నది. కాని 'వసతి రనుబంధక' ఇత్యాది సూత్రములోని 'వసతి' శబ్దముచే 'ఉండు' ధాతు వనుబంధక మగుననునర్థము లభించునుగాని 'ఉన్న' శబ్ద మనుబంధక మగుననునర్థము లభింపనేరదు. అట్లే 'అస్తిరనుబంధక' ఇత్యాదిసూత్రములోని 'అస్తి' శబ్దముచే 'కలుగు' ధాతు వనుబంధక మగుననునర్థము లభించును గాని 'కల' శబ్ద మనుబంధక మగుననునర్థము లభింపనేరదు. కాఁగా 'ఉండు' అను ధాతువునుండి వచ్చెడి 'ఉన్న' అనురూపమును చింతామణి యెట్లు సాధింపలేదో యట్లే 'ఉన్నాఁడు' అను చోటి దీర్ఘమును సైతము 'పునరాగమ' ఇత్యాదిసూత్రముచే

సాధింపఁ దలంచి యుండలేదనియే చెప్పనగును. కానఁ దత్సూ
త్రవ్యాఖ్యానావసరమున 'ఘటింపుచున్నాఁడు' - 'ఇత్యత్ర దీ
ప్యనేనైవ సిధ్యతి' (అహో ౪౯౪ పుట) అని యిట్లహో
బలపతి వ్రాసినవ్రాఁత సరికాదని గ్రహింపనగును.

"అత్త్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాం చ, వర్ణాగ
విశేషః పురుషే, ష్వర్థేషు చాపి వచనేషు."

అను చింతామణిగ్రంథము తుదిసూత్రమునుబట్టి 'ఉన్నాఁ
కలఁడు' మొదలగు దేశ్యక్రియలను జింతామణికర్త సా
పఁబూననే లేదని విశదమగుచునే యున్నదిగదా.
'ఉండు, కలుగు,' అనునవి వర్తమానభావ్యర్థములం దనుః
కములుగా నిల్చునని మాత్రమే గ్రహింపవలసియున్నది. పు
భేదములను దెల్పు ప్రత్యయముల నుపదేశించు సందర్భము
దక్కిన లకారములతోపాటు వర్తమానభావ్యర్థకములగు 'ల
ల్ృట్' అనువానిచోటనైతము 'డుజ్ఞు' మున్నగునవి చెప్ప
నంతమాత్రమున నట్టిదేశ్యక్రియలను జింతామణి సాధి
చున్న దనుకొనవలసిన యావశ్యకత లేదు. ఇంకను నం
సాధింపఁదలంచినపుడు 'రక్షించుచుండు + డు = రక్షి
చున్నవాఁడు. రక్షింపఁగలుగు + డు = రక్షింపఁగలఁడు'
యిట్లుగ "అత్త్వాది తత్సమానా" మిత్యాదిసూత్రముచేతనే
విశేషాగమాదులను గల్పించుకొని సాధించుకొనుట యు
యుండును. అట్లు వానినుండి 'అస్మ ద్యుష్మ ద్వాచ్యా' దిశ

సూత్రముచొప్పున 'రక్షించుచున్నవాఁడను, రక్షించుచున్న వాఁడవు' మొదలగురూపములను సాధించుకొనుట యుక్తము. కాని బాలసరస్వ త్యహోబలపండితులు సాధించినట్లు 'రక్షింపు చున్నాను, రక్షింపుచున్నావు, మొదలగురూపములను సాధించుట యెంతమాత్రమును యుక్తముకాదు. అట్లు చింతామణి సూత్రములనుబట్టి సాధించుట కవకాశమును లేదు. మఱియు నన్నయభట్టభారతభాగములో నెచ్చటను 'ఉన్నాఁడు, ఉన్నావు, ఉన్నాను,' అనురీతిగల ప్రయోగములు మచ్చునకైన లేవు. నన్నయభట్టారకుఁ డెచ్చటఁ బ్రయోగించినను 'ఉన్నవాఁడు, ఉన్నవాఁడవు, ఉన్నవాఁడను' అనురీతిగల ప్రయోగములనే ప్రయోగించుచు వచ్చెను.

ఉ. విప్రుఁడ నున్నవాఁడ...... (భార. ఆది. ౨ ఆ. ౬౪ ప.)

సీ. ......తపంబు సేయు చున్నవాఁడవు (భా. అర. ౨ ఆ. ౩౨౧ ప.)

ఆ-వె. ... రోహిణీ, యుక్తుఁడై శశాంకుఁ డున్నవాఁడు.

(భార. ఆది ౭ ఆ. ౨౮౨ ప.)

ఇట్లు పైనివ్రాసిన 'ఉన్నాఁడు' మున్నగు రూపములను జింతామణి సాధించుచున్నదనుట కవకాశమే లేకయుండఁగా వానిని సద్దానిచే నప్రమాణముగను నసంగతముగను బ్రక్రియ నుగల్పించి సాధింపసాహసించుటయేగాక మీఁదుమిక్కిలిగ నట్టిరూపములు నవ్యములనియు, నట్టి నన్నయానమ్మతము లగువానిని జింతామణి సాధించుచున్న కారణమున నది నన్న

యకర్తృకము కాదనియు నాధునికులు వాదించుచుండుట
యెంత యన్యాయ్యమో విమర్శకులు గ్రహింతురు గాక.

(౧౧౪) ఇంకొకవిశేషము—పైసందర్భములో బాల
సరస్వత్యహోబలపండితులు "నుతింపుచున్నాఁడు, ఘటింపుచు
న్నాఁడు" అని యిట్లు పత్వమును జేసి యుదాహరించియు
న్నారు. నన్నయభట్టభారతభాగమునం దెచ్చటను వర్తమానా
ర్థమునందు "పత్వము" వచ్చుటను నిర్ణయించు ప్రయోగములు
లేవు. వానిని జింతామణి సాధించుచున్నదనుటకును నం దవ
కాశము లేదు.

శ్లో. వసతి రనుబంధకః స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర
అస్తి రనుబంధకః స్యా ద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోః.

శ్లో. భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమో ణోశ్చ
అనుబంధ ప్రార్థనయో ర్ణా వ్యతిరేకాదికే చ చోః పః స్యాత్.

(ఆంధ్రశబ్ద. క్రియా.)

అను చింతామణిసూత్రములలో "అనుబంధప్రార్థనయోః"
అని చెప్పఁబడియున్నది గాన వర్తమానార్థమున వసత్యనుబం
ధము పరమగుచున్నపుడు "పత్వము" వచ్చు నని బాలసర
స్వత్యహోబలపండితు లభిప్రాయపడుట కేవలము ప్రామాణి
కమై యున్నది.

"చు రితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్."
అను చింతామణిసూత్రముచేత విధింపఁబడిన 'చు' ప్రత్యయ

ధించుగాగమ 'చు' వర్ణమునకును షసత్వానుబంధమునకును
మధ్యను నిలిచియుండుటచేత నచట విధించుగాగమ చువర్ణకము
నకు షసత్వానుబంధపరకత్వము లేమింజేసి "అనుబంధ ప్రార్థ
నయో" రిత్యాదిసూత్రముచే నెంతమాత్రమును 'షత్వము'
సిద్ధింపనేరదు. అట్లయినచో "రక్షింపఁగలఁడు, రక్షింపని"
మున్నగుచోటులందు "వ్యతిరేకాదా భావిని చాత్ స్యాత్"
అనుసూత్రముచే విధింపఁబడిన 'అత్త్వము' 'షత్వ' ప్రతిబంధ
కము కాదా యని శంకించుకొననక్కఱలేదు. చింతామణికర్త
యిట్టి యనుపపత్తిని వారించుటకే కావలయు 'అనుబంధ ప్రార్థ
నయో' రిత్యాదిసూత్రమునకుఁ బూర్వమున 'చుఁరితి క్రియా
పదానా' మిత్యాదిసూత్రముచే 'చు' ప్రత్యయమును విధించి
యున్నాఁడు. అత్త్వవిధానమన్ననో షత్వముచేసిన తరువాతఁ
జేయనగునను నుద్దేశముతోఁ బత్వశాస్త్రమునకుఁ దర్వాత
నుపదేశించెను.

ఇట్టిస్థితిలో లేనిపోని యర్థములను జేసికొని నన్నయ
భట్టసమ్మతములు కాని ప్రయోగములను జింతామణిచే సాధిం
చుచు నక్కఱలేనిమునఁ జింతామణి నన్నయకర్తృకము కా
దని యాధునికులు సిద్ధాంతముచేసికొనుట యెంతయు నయు
క్తముగదా.

## "సర్వత్రాజ్వ త్కార్యం జ్ఞేయం య" స్యేతి సూత్రార్థవిమర్శనము. ౬

(౧౧౫) సంస్కృతసమేతరమైన శబ్దము మొదటనున్న యకారమునకు సంధివిషయమున నెల్లయెడలను నచ్చువంటి సంధికార్యము సంభవించును. అనఁగా నట్టియకారము పరపదాదినుండఁగా స్వరసంధిగాని ద్రుతసంధిగాని జరుగునపు డా యకారము లోపింపనిచో స్వరసదృశకార్యము రానేరదుగాన నట్టి యకారము లోపింపఁగా దానిమీఁది స్వరము నిల్చునని యర్థము. ఉ. అది + యేది = అది + ఏది = అదేది. అతఁడు + యెవఁడు = అతఁడు + ఎవఁడు = అతఁడెవఁడు. వచ్చెన్ + యెవఁడు = వచ్చెన్ + ఎవఁడు = వచ్చెనెవఁడు. మొ.

"అద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః."

అను సూత్రముచేతఁ బదాదియకారము సూచితమగుచుండఁగ నట్టిపదాదియకారము సంధించునపుడు "అతఁడు యెవరు వచ్చె యెప్పుడు, వచ్చె న్యెప్పుడు" మొదలగు ననిష్టరూపములు పుట్టకుండ నీసూత్రమును నన్నయభట్టు రచించె న యెన్నునది.

(౧౧౬) "సర్వత్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః, లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు."

అను చింతామణి కారికను సూత్రములుగా విభాగించుటల నథర్వణాచార్యు లాదిగాఁగల యాంధ్రవైయాకరణు లెల్లరు

ముం దుదాహరింపఁబోవురీతిని విభాగించియున్నను నట్టివిభాగమునఁ గొన్ని లోపములు సంభవించియుండుటంజేసి యట్టివిభాగము నన్నయభట్టాభిప్రేతము కాదని తోఁచి నే నీక్రిందిరీతిని విభాగించు చున్నాను.

౧. సర్వ త్రాజ్య త్వార్యం జ్ఞేయం యస్య.

౨. ద్రుతప్రకృతికేభ్యో లుక్ సంశ్లేషౌ నాచి.

3. ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు.

పై మూఁడుసూత్రములలో మొదటిదాని కర్థము పైని వ్రాయఁబడినదే యున్నది. ఇఁక రెండవసూత్రమునకు "ద్రుతప్రకృతికములకంటెఁ బరమం దచ్చుండునపు డా నకారమునకు లోపసంశ్లేషములు రావ"ని యర్థమును గ్రహింపవలెను. అర్థవిషయమున నిం దేమియు మార్పు లేదు. మూఁడవసూత్రమున నేవిషయమునందును మార్పులేదు.

(౧౧౭) 'యెవడు' మొదలగువాని యుచ్చారణములోఁ బదాది యకారము వెలయుచుండుటచేతను, దత్సమేతరాంధ్రభాషకు వ్యవహారమే మూలమనుట నన్నయభట్ట సిద్ధాంత మగుటచేతను, నయ్యది యంగీకార్యమనుట యసంగతము కానేరదు. ఈయభిప్రాయమునే బాలసరస్వతి విశదీకరించియున్నాఁడు.

"వోయి, యెత్వము రాజెప్పనేల? అజ్యత్వార్యము వచ్చుననేల? ఆదియందు యకారములేదు; అచ్చే అంటేచాలదా ? అంటేచాలదు.

ప్రయోజనాంతరము లేకున్నను ఉచ్చారణవిరోధ మగుచున్నది. కనుక యెకార మెకారము గానేరదు."

(బాలసరస్వతీయము, లిఖితమాతృక. సంధి. ౨౧ కాకితము.)

తొలుతఁ బదాదిని యకారము నంగీకరించి సంధికాలమున దానికి లోపమును జెప్పికొనుటకన్నఁ బదాదియకారమునే యంగీకరింపక 'హరి యతఁడు' మున్నగుచోటుల కయి సూత్రింపక తీరని

"య శ్రుతి మార్యా లఘు యం ప్రవదంతి ప్రాణతః పరం ప్రాణమ్"

అను సూత్రముచేతనే 'అదియేది' మొదలగు చోటులందు సైతము లఘుయకారాగమమును జేసికొనుటలోఁ బ్రక్రియాలాఘవము గలదనుమాట సత్యము కాకపోలేదు. అట్లయినను దినకాలములో 'యెవరు, యేది' మున్నగుశబ్దములలోఁ బదాదిని యకారమును బండితులు సైతము స్పష్టముగా నుచ్చరించుచుండుటచేతను, నచట యకార మున్నదనుటలో బాధయేమియు లేకుండుటచేతను నాచ్ఛికభాషకు లోకవ్యవహారమే మూలమనునిశ్చయముతోనున్న నన్నయభట్టు ప్రక్రియాగౌరవమును బాటింపక పదాదియకారము నంగీకరించియుండును. చింతామణివంటి ప్రౌఢగ్రంథమును రచించిన యాతఁడు పదాదియకారాంగీకారమునఁ బ్రక్రియాగౌరవ మున్నదని తెలిసికొనలేనంతటి యప్రౌఢుఁడనుట పరమసాహసము గదా.

(౧౧౮) క్రమక్రమముగాఁ దరువాతి యాంధ్రవైయాకరణులు ప్రక్రియాగౌరవశంకచేతను నట్టి యకారము లేదన్నను

బాధ లేకుండుటచేతను సద్దానిని, నిరసించుచు వచ్చిరి. మఱియు
నిట్టియెడల వ్యవహారమునే ప్రమాణముగా నంగీకరించునపుడు
పదాది యకారమునువలెనే 'వ్రాయు' మొదలగు చోటులందుఁ
బ్రసిద్ధమైయున్న పదాదివకారమును సైత మంగీకరింప వలసివ
చ్చునని శంకించుకొని పదాదిని యకార వకారములు రెండును
నుండవని సూత్రింపసాగిరి. కాని 'యెవరు యేరు' మున్నగు తె
లుఁగుశబ్దములకు సరిగఁ దమిళమున 'యాఱు' మున్నగు పాలా
దిశబ్దములు (కన్నడమున ఆఱు,) వెలయుచుండుటం జేసియు
'ఊరు' మొదలగు తెనుఁగుశబ్దములకు బదులుగా వానియందు
'ఊర్' మొదలగు స్వరాదిశబ్దములే వెలయుచుండుటంజేసియు
'యెవరు' మొదలగు వానిలోని పదాదియకారము సహజమే
యనియుఁ బదాదివకార మట్టిదిగాక యపభ్రష్టోచ్చారణసిద్ధమ
నియు నన్నయభట్టు నిర్ణయించుట కవకాశ మగపడుచున్నది.

(౧౧౯) ఇట్టిస్థితిలోఁ బదాదిని యకార వకారము లుండ
వని నన్నయభట్టారకుఁడే చెప్పినట్లుగ నప్పకవియో లేక యం
తకుముందటి మఱెవ్వరో యీక్రింది ప్రక్షిప్తపాఠమును
జింతామణిలోఁ జొనుపుట కేవలము నసంగతము సాహసమూ
లకము నై యున్నది.

"వికృతిపదాదౌ ప్రథమాంతస్థస్స తృతీయానునాసికా న స్తః"
(అప్పకవీయము. ౨ ఆ. ౬౫.)

"క్వచిదపి న స్త ఉదోతౌ దంతోష్ఠ భవస్య వికృతిశబ్దాదౌ"
(అప్పకవీయము. ౨ ఆ. ౨౨౧)

ప్రక్షిప్తపాఠకర్త లిట్టికారికలను జొన్పుట విరోధింప
కుండ జాగ్రత్తపడి పదాదియకారస్థితి నంగీకరించెడి

"అద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః"

అనెడి సూత్రమును సైతము

"అద్యః క్రియాసు భూతాద్యర్థ సముద్ద్యోతినం వినా సర్వః"

అనురీతిగా మార్చి యచటివిరోధమును వారించికొనిరి. ఇంతియ
గాక యిట్టి సవరణమువల్ల 'రక్షించుకొనియెఁ, రక్షింపఁబ
యెఁ, పోయెఁ, మొదలగు భూతార్థక్రియలయందువలె
"పోయెదన్, రక్షించుకొనియెదన్, పోయెడున్, పోయెడిన్
మున్నగు తద్ధర్మాద్యర్థకములలోని యకారమును నెత్వవిశి
మయియుండు నని యుపదేశించెడి న్యూనార్థపూరణము సయి
ము సంభవించెనని యాదిశబ్దస్వారస్యమును వెలయించిరి.

(౧౨౦) తక్కినవిశేషము లట్లుండఁగా నీప్రక్షిప్త పా
మునం దర్థవ్యక్తియే యగపడకున్నది. ప్రతిషిద్ధములలో
యత్తానిర్ణయమును జేయక యాదిశబ్దమును నిల్పి పరిశి
భాగమున సర్వశబ్దమును బ్రయోగించుట సరియైయుండ లేద
చింతామణివంటి ప్రౌఢగ్రంథమును వ్రాసినయాతఁడే యాసు
త్రమును రచించుచో భూతార్థకయకారములును దద్ధర్మార్థ
యకారములును తప్పఁ దక్కినయకారములెల్ల 'అ'కారయు
ములై యుండునను నర్థము స్పష్టముగా లభించురీతిని సూత్రి
చియుండఁడా? పరిశీలింపఁగా 'భూతార్థద్యోతిన మాద్యగం
నా' అనియే నన్నయభట్టోపదిష్టమైయుండఁగాఁ బై విరో

భాసములను మనమున నెంచి ప్రక్షిప్తపాఠకర్త లట్టిపాఠమును సవరించుటలో ఛందః ప్రతిబంధమున నీరీతిని 'భూతాద్యర్థ సముద్ద్యోతినమ్' అని మాత్రమే సవరింపఁగల్గిరని విమర్శకు లకుఁ దోఁచక మానదుగదా.

వేయేల! చింతామణిలోనే పదాదిని ణకార యకారము లును, వు వూ వొ వోలును నుండవని ప్రక్షిప్తపాఠకర్తృపాఠ ములచొప్పునఁ జెప్పఁబడియున్న యెడల నద్దానిలో లేనివిషయ ములనుమాత్రమే చెప్పుచు సవరించెడి నియమముతోఁ బుట్టి యున్న (వి. ౫౮.) వికృతివివేకములో 'వికృత్యాదా భవే న్నణః' అని పునరుక్తముగ మరలఁ జెప్పఁబడియుండునా ? మఱియుఁ బదాది యకారమునకు సర్వత్రేత్యాదిసూత్రముచేఁ జేయఁబడి నయజ్వద్భాషమునకు 'ధ్రుతప్రకృతికేభ్యో లుక్సంశ్లేషా నాచి' అను ననంతరసూత్రములోఁ జెప్పబడిన లుక్సంశ్లేషాభావసం పత్తికై యకారలోపముఁ జేయుట తాత్పర్యమను క్లిష్టమార్గ మునఁ జింతామణినుండి సంపాదింపఁదగిన యర్థమును వివరిం చుచుఁ జింతామణ్యంగీకృతపదాది యకారాంగీకారోపన్యా సపూర్వక మగు పదాదిస్థ యకారలోపపూర్వక స్వరమాత్రా వశిష్టతావిధానమును జింతామణి వివరణమగు వికృతివివేక మిూక్రిందిరీతిని జేసియుండునా ?

(౧౨౧) శ్లో. "వికృత్యాది గతో వోఽత్ర స్యా చ్ఛబ్దాంతర యోగతః,
ప్రాణమాత్రావశేష స్స్యా దత్ర శ్రీకవిసమ్మతేః."
(వికృతి. సంధి. ౨౨ సూ.)

ఈయథర్వణసూత్రము పైరీతిని జింతామణ్యభిప్రాయమును వివరించుటయే గాక యాసూత్రములోని యాక్రింద నుదాహరించెడి వేఱొకవిధమగు న్యూనతను బూరించుచును న్నది. చింతామణిలోని 'సర్వత్రాజ్వది'త్యాది శ్లోకమును సూత్రములుగా విభజించుటలో నథర్వణుఁ డాదిగాఁగల చింతామణి వివరణకర్తలెల్ల నీక్రిందిరీతిని విఱిచియున్నారు.

౧. సర్వత్రాజ్వ త్వార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః

౨. లుక్సంశ్లేషానాచి.

3. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు.

ఈరీతిని విభజించుటచేత ద్రుతప్రకృతికములకంటెఁ బరముగనున్న యకారమునకు మాత్రమే యజ్వద్భావము సంభవించుటంజేసి 'అతఁడు + యెవ్వఁడు' మొదలగు నుకారాంతసంధిస్థలములలో నజ్వద్భావము లేనందున స్వరావశిష్టత సిద్ధింపకుండఁగా 'అతఁ డెవ్వఁడు' మున్నగు సాధురూపములు సిద్ధింపక 'అతఁడుయెవ్వఁడు' మొదలగు ననిష్టరూపములు దుర్వారము లగుచున్నవి. అట్టిలోపములు వారించుటకై వికృతిపదాది నున్నయకార మేశబ్దముతో (శబ్దాంతరయోగతః) సంధింపవలసియున్నను నయ్యది లోపించి ప్రాణమాత్రావశిష్టతను బొందుననియు నట్లు సర్వత్ర లోపించుట శ్రీకవియన మహాకవియగు నన్నయభట్టునకు సమ్మతమే యనియు నథర్వణాచార్యుఁడు 'సర్వత్రాజ్వ'దిత్యాది ప్రకృతసూత్రమును 'వికృత్యాదిగతోయోఽత్రే'త్యాదికారికతో సవరించి యున్నాఁడు.

పై సందర్భమునుబట్టి యథర్వణాచార్యునినాఁటికే చిం
తామణిలోఁ బదాదియకారాంగీకారమును దెల్పు 'భూ
తార్థద్యోతిన మాద్యగ'మిత్యాదిపాఠ ముండెడిదనియు నక్కా
రణముననే యథర్వణుఁడు పైరీతిని దానిని వివరించియు సవరిం
చియు నుండెననియు నట్లగుటంజేసి పదాదిని యకారాదు
లుండనేరవని తెల్పెడి యప్పకవీయోదాహృత 'వికృతపదాదా'
విత్యాది సూత్రములును 'భూతాద్యర్థసముద్ద్యోతిన' మ్మను
పాఠమును నర్వాచీనకృతప్రక్షిప్తములే కాని నన్నయప్రోక్త
ములు కావనియు, విమర్శకులగు విద్వాంసులకు గోచరిం
పక మానదుగదా. ఒకప్పు డహోబలపతి యనుకొన్నట్లు
'వికృత్యాదిగతో యోత్రే' త్యాదికారిక శ్రీకవియను వేఱొక
పండితుని మతమే యైనను నాతఁడాసూత్రముచే 'సర్వత్రా
జ్వది' త్యాది చింతామణిసూత్రమును సవరించుటచేత నథ
ర్వణునినాఁటికే 'సర్వత్రాజ్వది' త్యాది సూత్రము చింతా
మణిలో నున్నదనెడి సిద్ధాంతమునకు భంగము గలుగనేరదు
గదా.

(౧౨౨) పైరీతిని బ్రమాదభూయిష్ఠమై యున్న 'భూతా
ద్యర్థే'త్యాదిపాఠమును బాగుగఁ బరిశీలింపని యహోబలపండి
తుఁడు పైని వ్రాయఁబడిన పూర్వపక్షపు యుక్తుల నుదాహ
రించుచు

"అప్పకవి పుస్తకపాఠఏవ సాధు రితి ప్రతిభాతి" (అహో. ౧౫౫ పుట.)

అని వ్రాయుట యుక్తమైయుండలేదు.

పదాదియకార నిరాసకములగు నప్పకవీయస్థిత 'వికృతి పదాదా'విత్యాది ప్రక్షిప్తసూత్రములు చింతామణిలో నుండునపుడు పదాదియకారమున కజ్వద్భావము నుపదేశించెడి 'సర్వత్రాజ్వది'త్యాది ప్రకృతసూత్ర ముండ నేరదుగదా. అట్లయినను నట్టిసూత్రమును దాని వివరణమును నప్పకవీయమునందు మూఁడవ యాశ్వాసమున వెలయుచు నేయున్నవి. కాఁగాఁ బదాదియకార నిరాసకములగు 'వికృతిపదాదా' విత్యాదిసూత్రములు నిర్వివాదముగఁ బ్రక్షిప్తములని చెప్పఁదగియున్నది. కావుననే యెవ్వరో యప్పకవీయ మాతృకలలోని యిట్టి సందర్భరాహిత్యము నాలోచించి'సర్వత్రాజ్వ'దిత్యాదిప్రకృతసూత్రమును దాని వివరణపద్యములను నప్పకవీయమునుండి బహిష్కరించుటయు నట్టి మాతృకయే యహోబలపండితునకు దొరకుటయు సంభవించెనా యని

"సర్వ త్రాజ్వ త్కార్య మితి సూత్రంతు తత్పుస్తకే న దృశ్యత ఏవ." (అహో ౧౫౫ పుట.)

అనెడి యహోబలపతివాక్యముచే నాలోచి పవలసి యున్నది.

అప్పకవి 'సర్వత్రాజ్వ'దిత్యాది ప్రకృతసూత్రము నీక్రిందిరీతిని సందర్భపఱుచుటకు యత్నించియున్నాఁడు.

లోకవ్యవహారమునఁ బదాదియకారము సుప్రసిద్ధముగ నుండుటంజేసి యట్లు కావ్యభాషలో నుండరాదనుటకై నన్నయభట్టు పదాదిని యకార ముండరాదని 'వికృతిపదాదా'

విత్యాది సూత్రమును సూత్రించెననియు, నిఁక నట్లు వాడుక లోనున్న 'యెవరు' మున్నగుశబ్దములను గావ్యములలో వాడు నపుడు సంధిలో నచటి పరపదాది యకారము పోయి స్వరము మాత్రమే నిల్చి యచ్చువలెనే సంధించునని తెలుపుటకై 'సర్వత్రాజ్వ'గిత్యాది ప్రకృత సూత్రమును సూత్రించె ననియు, సమన్వయించుచు నప్పకవి యీక్రిందిరీతిని వివరించియున్నాఁడు.

ఉ. ఆరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకార ముండ దా
తీరునఁ బల్కు వ్రాఁత గణుతింపఁగ నచ్చగు దాని డాఁపలన్
నీరజనాభ నాంతములు నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె
న్నార నితండు చైద్యవసుధాధిపు నేపడఁగించె నేఁడనన్.

(అప్ప ౫ఆ.౪౦ప.)

ఈపక్షమున యకారముతోపాటుగ వకారముసైతము పదాదిని వ్యవహారమున నుండుటచేత దానివిషయమునందును నిట్లు చెప్పకున్నచోఁ గుదురుపడ దను నుద్దేశముతో వకార విషయమునసైత మీక్రిందిరీతిని వివరించియున్నాఁడు.

క. శృంగాంత్యనక్రయుగముల
సాంగత్యము వాకు నాంధ్ర సంస్కృతముల నా
దిం గలుగ దట్టివ్రాఁత ధ
రం గలయు ద్రుతాంతములను బ్రాణము లట్లన్.

క. ముంగా మురువులు నాలుగు
నుంగరములు మూఁడు నేడు నొడ్డాణంబుల్ (అప్ప. ౫ ఆ. ౪౩ ప.)

(౧౨౩.) నన్నయభట్టారకుని కాలమునాఁటి వాడుకలోఁ గూడ యకారము వకారముతో సమానముగా నుండెననుకొన్నను, లోఁ గూడ నిప్పటివలెనే పదాదివకారము గూడ మున్నదనియే యంగీకరించినను నాతఁడు పదాది యకార వకారములను సమ్మతింపనపు డట్టివ్యావహారికపదాది యకార వకారము లపభాషితములని త్రోసివేయుట సహజముకాని, యట్టి వ్యవహారస్థరూపములను బ్రకృతులనుగాఁ జేసికొని వానినుండి కావ్యభాషారూపసాధనప్రక్రియను సూత్రించుట సహజము కాదు గదా. ఈరీతిని వ్యావహారికశబ్దములనుండి కావ్యభాషా శబ్దములను నన్నయభట్టారకుఁడు మఱెచ్చట నైన సాధించెనా? నన్నయభట్టే గాక మఱెవ్వరైన నట్లు సాధించిరా? కాఁగాఁ బదాదియకారాంగీకారమును దెల్పు నిట్టి సూత్రములు చింతామణిలో నుండఁగా వానిని దన మతమునకు సరిగ సమన్వయించుటకు మార్గాంతరము లేక యీయుపమార్గమున నాతఁడు వివరించె నని గ్రహింపనగును. ఇఁక నన్నయభట్టారకుఁడే వెనుక నుదాహరించిన 'వికృతిపదాదా' విత్యాది పదాదియకార వకార నిరాసక సూత్రములను రచించియున్న యెడల నప్పకవివలెనే తుల్యన్యాయమున 'సర్వత్రాజ్వ' దిత్యాది ప్రకృతసూత్రసందర్భమున వకారమునకును నజ్వద్భావమును సూత్రించి యుండఁడా ? అట్లు సూత్రింపకుండుటయే 'క్వచిదపిన స్త' ఇత్యాది సూత్రమును దానితోఁపాటు 'వికృతిపదాదా' విత్యాది సూత్రమును నన్నయభట్టారకుఁడు

రచించియుండలే దనుటకుఁ బ్రబలనిదర్శన మగుచున్నది గదా. నిజముగాఁ బ్రక్షిప్తపాఠకర్తలే మఱికొంచెము జాగ్రత్తపడి "సర్వత్రాజ్వ" ఇత్యాది ప్రకృతసూత్రములో యకారమునకు వలెనే వకారమునకును నజ్వద్భావము విధింపఁబడినట్లు యకారముతో పాటు వకారమును సైతము చొప్పించియున్నచో నీమార్గము చాలవఱకు నభేద్యమై యుండియుండునుగదా. కాఁగాఁ జింతామణిలో వకారవిషయము లేకుండుటయు నద్దాని విస్మరణ మగు నప్పకవీయములోఁ బైనుదాహరించినరీతి నయ్యది యుండుటయుఁ బైనివ్రాసిన నాయూహను స్థిరపఱుచుచున్న వనఁదగును.

(౧౨౮) మఱియు "పదాది నీయక్షరము లుండును; ఈయక్షరములుండవు" అని చెప్పుట చింతామణి పద్ధతి కాదు. అట్టియుద్దేశమే గ్రంథకర్తకున్నయెడల బొత్తిగాఁ బదాదినుండని ణకారాదులనుసయితము చెప్పియుండఁడా? కాఁగా 'వికృతిపదాదా' విత్యాదులు చింతామణి స్వరసములు కానేరవు. ఇఁకఁ జింతామణిలోని పదాది యకారాంగీకారమును దెల్పు సూత్రమున్ననో వేఱొకసందేహమును దీర్చుట కుపదేశింపఁబడెను గాని పదాదిని యకార ముండునని చెప్పుట కుపదేశింపఁబడలేదు. యకారముపైనుండు 'అ, ఎ' అనునవి పరస్పరము మాఱుచుండును. కావున, 'పోయెన్, యెన్నఁడు' మొదలగుచోట్ల 'పోయను, యన్నఁడు' అని యిట్లు 'అత్వ' విశిష్ట యకారోచ్చారణము వ్యవహారములో వినఁబడుచుండుటచేత నట్టియెడల

సందేహమును దీర్చుటకయి 'అద్యః క్రియా' స్వేత్యాది సూత్ర
మును నన్నయభట్టు సూత్రించియుండును. ఇట్లే సందేహనిర్ణ
యార్థముగ 'చ,జ' ల దంత్య తాలవ్యతలు చింతామణిలో
నిరూపింపఁబడలేదా? భూతార్థములందును బదాదిని నిల్చెడి
యకారముమాత్రమే 'ఎ' కారవిశిష్టమై యుండుననియుఁ దక్కి
నచోటులందలి యకారము 'అ' కారవిశిష్టమై యుండుననియు
నిచట సందేహనిర్ణయము చేయఁబడినది. యకారముపై నున్న
'అ' కారమా? లేక 'ఎ' కారమా? అను సందేహము గల
గునపుడే యీ సూత్రము నుపయోగింపవలెనుగాని యట్టిస
దేహము పొడమనిచోట్ల నుపయోగింపరాదు. ఇందు యకా
ముపై నేయేస్వరము లెప్పుడెప్పు డుండునో యనువిషయమ
సమగ్రముగఁ జెప్పఁబడియుండలేదు. అట్లుచెప్పుట చింతామ
యుద్దేశముకాదు. అట్లేకాక దీనిని సమగ్రముగ నెన్ని యె
యెడల నుపయోగించినచో, 'చెయిది, చెయువులు, చేయుఁ
మున్నగు ననేకస్థలములం దిత్యాదులతోఁ గూడిన యకార
లెల్ల బాధితములే యగునుగదా.

## ద్రుతాభ్యో న ఇత్యాదిసూత్రార్థ విమర్శనము. ౭.

(౧౭౬) పొల్లు నకారము ద్రుతసంజ్ఞ గలదని పైస
త్రమునకర్థము. ద్రుతి యనఁగా ద్రవీభావము. సందర్భవశమ
నిట వర్ణలోపమని యర్థము గ్రహింపనగును. ప్రకృతి నిష్ఠ
నను బ్రత్యయాది నిష్ఠమైనను స్వరవిశిష్టమగు నకారమునం

స్వరము ద్రుతినన(గా లోపమును బొందినచో నట్టి స్వరద్రుతి నందిన పరిశిష్టనకారము ద్రుతమను నన్వర్థసంజ్ఞను బొందుచు న్నదని తాత్పర్యము.

"కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చో ల్లోప ఇష్యతే హ్యేషు, ప్రథమైకవచనమాత్రే విక్రుతౌ నాంతాదయోపి కథ్యంతే"

(ఆంధ్రశబ్ద. హలం. ౬౧ శ్లో.)

అనుసూత్రముచేత(గాని, 'అపిశబ్దార్థస్యైతః' అనుసూత్రముచేత(గాని, మఱియేదైన నితరవిధమున(గాని పదములయొక్క తుది నున్న స్వరవిశిష్ట నకారముమీ(దిస్వరము లోపింప(గా మిగిలిన నకారపు(బొల్లు ద్రుత మనిపించుకొన( దగియుండును. ఉ. గురువుఁ = (గురువును). సీతఁ = (సీతను). రక్షించితిఁ = (రక్షించితిని) చేయుదుఁ = (చేయుదును). నేఁ = (నేను). తాఁ = (తాను). నఁ = (నను). నిఁ = (నిను). తన్ = (తను). ఎందేఁ = (ఎందేని). రాముఁడుఁ = (రాముఁడును) మొ.

పై రీతిని స్వరలోపమందిన నకారము లేగాక పదముల తుదిని సహజముగ నిల్చియుండెడి నకారపు( బొల్లులును ముం దుదాహరించురీతిని ద్రుతినన(గా లోపము నంద(దగినవగు టచే ద్రుతము ననిపించుకొనును. ఇట్టి ద్రుతములతో(గూడిన పదములు ద్రుతప్రకృతికము లనెడి యన్వర్థసంజ్ఞను బొందు చున్నవి. వీనిలో( బయిని వ్రాసినరీతిని బదముతుదిని సహజ ముగా ద్రుతము నిల్చియుండెడి స్థలములు చింతామణిలోని యీక్రిందిసూత్రముచేత( బేర్కొన(బడుచున్నవి.

"తిజ్మధ్యశేష షష్ఠీ సు స్కర్మప్రవచనీయజ విభక్తీః, కించి త్ప్రిశంసనా ద్భుత సంతాప యదా తదా కి మేనాంశ్చ, క్త్వా కిల తూష్ణీ మాద్యా నభిదధతి కళా ద్రుతో న యేషాం స్యాత్. అన్యే ద్రుతప్రకృతయో యే ష్వ ర్హ్యానుజీవితద్రుతా నిత్యమ్"

అట్టి శబ్దముల తుది నుండెడి ద్రుతము

"వాక్యాంతగతపదానాంచ" (ఆంధ్రశబ్ద. సంధి. ౩౧ శ్లో.)

"లుగ్వా ద్రుతప్రకృతికా త్పరతః సరళే స్థిరే చ నస్య స్యాత్"

(ఆంధ్రశబ్ద. సంధి. ౨౬ శ్లో.

అను సూత్రములచొప్పునను మఱికొన్ని విధములను ద్రవిభా మనఁగా లోపమును బొందుచుండును. ఇట్లు ప్రకృతినిబొందెడి దగుటచేత నిట్టిపొల్లు నకారపు ద్రుతత్వమున్నైత నుద్ధరంతమే యనఁదగును.

నన్నయభట్టారకుఁడు పైరీతిని 'తిజ్మధ్యే'త్యాదిసూ మునఁ గళాశబ్దములను బేర్కొని తద్భిన్నముల కన్నిటికిని ద్రు ప్రకృతికత్వము నుపదేశించుటచేతఁ జింతామణిచే సాధింప బడెడి కళాభిన్న సుప్తిఙాది ప్రత్యయాంతములకెల్లఁ దుది ద్రుత మనఁగాఁ బొల్లు నకారము నిల్చుచుండును. ఉ. 'రావ నిన్'రామునిచేతన్, సీతనున్, చేసినన్, చేయుచున్, రక్షిం నున్, రక్షించితినిన్, రక్షించెన్, రక్షించున్, ఉనున్, ను (అదియునుంగాక, దివంబునుంబోలె) మొ.

(౧౯౮) పైనుదాహరించిన ద్రుతస్వరూపము క్రమక్ర
నుత్తరోత్తరవ్యాకరణములలో వింతవింతరీతులను
డినది. తుదికిఁ ద్రిలింగలక్షణశేషమునం దీక్రిందరీతిని
౦డినది.

౦బసాధారణంబు ద్రుతంబు" "ప్రత్యయాగమావ్యయాత్మకంబై
విశిష్టమైన నకారంబు ద్రుతసంజ్ఞికం బని యర్థము......శబ్దశాస
"ద్రుతాఖ్యోనః' అని కేవల నకార గ్రహణముచేయుట ద్రుతము
సత్వసిద్ధికై యని తెలియవలయును." (ప్రౌఢవ్యా సంజ్ఞ. ౭ సూ.)
౦యి త్రిలింగలక్షణశేషప్రసంగమునుబట్టి ద్రుత ముకా
కార స్వరూపమనియు, నవ్యయములందు మాత్రమే
స్థ 'ను' శబ్దము ద్రుతమనిపించుకొనుననియుఁ దక్కిన
౦దెల్లఁ బ్రత్యయాగమములందలి 'ను' అనునదిమాత్ర
మనిపించుకొనుననియు నవ్యయేతరముల యవయవ
ము ద్రుత మెంతమాత్రము కాదనియు విశదమగుచు
కారంబుమీఁది కునువు క్రియావిభక్తులయుత్వంబున
౦' అనుబాలవ్యాకరణసూత్రముచొప్పున (తత్స ౨౮.)
తమగు 'ను' అనుదాని యుకార మికారమైనం గావ
౦న నట్టిది ద్రుతమైనం గావచ్చునుగాని 'ఏని' మున్నగు
ము లంమును, 'తెల్లనివాఁడు' మున్నగువానిలోని
మందును గల 'ఇత్వ' విశిష్ట ని వర్ణమెన్నఁడును ద్రుత
నేరదనియుఁ బయి త్రిలింగలక్షణశేషసందర్భమువలన
గుచున్నది.

చింతామణి విరుద్ధమగు నిట్టి సిద్ధాంతమునకు బాలసర స్వతీయాదులలో నాధారమేమియుఁ గానరాదు గాని యప్ప కవీయములోని యీక్రిందిసందర్భము కొంతవఱకు మూలమై యుండవచ్చును.

తే. గీ. "గూను నెమ్మేను మెడనాను మీను పేను
ప్రాను పఱిచెను బులిబోను మఱియు నిట్లు
భువి నకారంబుతోఁగూడఁ బుట్టు శబ్ద
ములు ద్రుతప్రకృతులుగావు మునిశరణ్య." (అప్ప. ౫ ఆ. ౨౬ ప.)

(౧౨౭) బాగుగాఁ బరిశీలించినచో నెట్లును నీసిద్ధాంత ము నిలువఁదగియుండలేదు. 'ముంజేయి=మును+చేయి, చెంగ ల్వ=చెన్ను+కల్వ,' మొదలగుచోటులందు శబ్దావయవ నకార మునకే ద్రుతకార్యము లగపడుచున్నవి గదా. అట్లయినను నిట్టియెడలఁ బై యాధునికులు

'ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.'

లుప్తశేషంబునకుం బరుషములు పరమగునపుడు నుగాగమం బగు"
(బాలవ్యా. సంధి. 36, 37 సూ.)

అని యిట్లున్న నకారములకు లోపము చెప్పి యాచోట నాగ మ నకారములను నిల్పి ద్రుతత్వమును సంపాదించుకొనుచున్నా రు. ఇట్టిమార్గము కృతక మనిపించుకొనునేగాని సహజ మని పించుకొననేరదు గదా.

౧౨౮. వేయేల ! పయిరీతిని గృతకమార్గములను గల్పించుకొనెడి వీరున్నైతము 'కందోయి' మొదలగు తావులందుఁదమ ద్రుతిసిద్ధాంతమును గోల్పోయిరే గదా.

"వర్గయుక్స్వరశేషంబులు పరములగునపు డొకానొకచో ద్రుతంబునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. ......కన్ + దోయి=కందోయి."

(బాలవ్యా. సంధి. ౧౯ సూ.)

పయిచోటనున్న నకారము కన్ను శబ్దములోనిదనియే యంగీకరించి దానికి ద్రుతత్వమును నైత మంగీకరించియున్నారు. (చూడుఁడు. బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక. సంధి ౨౨ సూత్రపువ్యాఖ్య.)

కం. "కందోయి చల్లగా నిటు, కందోయి నృపాల..."(సారంగ. 3 ఆ.)

అని యిట్టిచటి ద్రుతకార్యమగు నిందుసున్న ప్రాసనిబద్ధమై మార్పరానిదై యున్నది గదా.

ఇఁక నిట్టిచోట్లఁ బై యాధునికులు సరిగఁ బ్రక్రియను జూపలేకపోయిరనియు, నట్టియెడలనయిత మాగమ నకారమును సంపాదించుమార్గము గలదనియు, నీక్రిందిరీతి నెవ్వరేని ప్రక్రియ చూప నవకాశ మగపడుచున్నది. 'కన్ను+దోయి' అనుచో 'సమాసంబులయం దుదంతంబు లగు...' అను (బాల. వ్యా. సంధి. ౨౬ సూ.) సూత్రముచే సామాసిక ద్రుతాగమము వచ్చుననియు, నట్టిసమాసములో 'న్ను' అనుభాగము సామాసికలోపము (ప్రౌఢ. సమా. 3౬ సూ.) నందుననియు,

నట్టియెడల నాగమనకారమే నిల్చును గాన ద్రుతకార్యములు రానగుననియుఁ బ్రక్రియను జూపవచ్చును. కాని యీమార్గము సైతము బొత్తిగాఁ గృతకమగుచు శబ్దతత్వశాస్త్రపద్ధతికి విలక్షణమగుచు నిరాకరణయోగ్యము కాకమానదుగదా. అట్లయినను నాధునికు లిట్టి యపమార్గమును ద్రొక్కుటయే వెనుదీయలేదు. 'తన్నున్, నన్నున్, నిన్నున్' అనుచోటులందుఁ బ్రౌఢవ్యాకరణకర్త వానిలోని 'న్ను' అనుభాగము లోపించి ద్వితీయావిభక్తి ప్రత్యయ నకారమే మిగిలియున్నదని నిరూపింపలేదా? (ప్రౌఢశబ్ద. 23 సూ.) అట్టిచోటి నకారము 'న్ను' అనుభాగములోనిదే యనియు, నచటి ద్వితీయావిభక్తి నకారము మొదటనే లోపించినదనియుఁ జెప్పుట యుక్తము గదా.

పయిరీతినే 'ఏను' (అయిదు) శబ్దములోని 'ను' శబ్దము ప్రత్యయాగమావ్యయాత్మకము కాకున్నను బ్రకృతిసిద్ధమే యైనను సమాసములో నుకారలోపము రాఁగాఁ బరిశిష్టనకారము ద్రుతమే యగుచుఁ బరమందున్న పరుషమునకు సరళాదేశము నొదవించుచు నర్ధబిందురూపము నందుచున్నది. అట్టి స్థలములలోని 'ను' శబ్దపు ద్రుతత్వమునుగూర్చి యేమియును స్మరింపకయే ప్రౌఢవ్యాకరణకర్త యీ 'ను' అనుదాని చోట బిందువు నిల్పి సరళాదేశముతో 'ఏఁబది, ఏఁబంద్రు' అని యుదాహరించెను. (ప్రౌఢ. సమా ౨౮ సూ.) ఇచట ద్రుతత్వాంగీకారము లేక సరళాదేశ మెట్లువచ్చునని తలంచెనో తెలియకున్నది.

ప్రౌఢవ్యాకరణకర్త ప్రకృతిసిద్ధ నకారమునకు ద్రుతత్వ ము నంగీకరింపఁజాలనివాఁ డగుటచేతనే యచ్చు పరమగు నపుడు వచ్చుచున్న ద్రుతద్విత్వమును సూత్రించుటలో ద్రుతము నకు ద్విత్వమువచ్చునని యొకచోటను నవయవ నకారమునకు ద్విత్వము వచ్చునని యొకచోటను నిట్లు రెండుసూత్రములను జెప్పవలసినవాఁ డయ్యెను.

"కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుంతబున కచ్చుపరం బగునపుడు ద్విత్వము చూపట్టెడి" ఉ. సర్వము న్నతని..."

(ప్రౌఢ. సంధి. 3 సూ.)

"తెలుఁగుఁ గర్మధారయ సమాసంబునం బెన్వాదుల కడహల్లున కచ్చు పరం బగునపుడు ద్విత్వంబు గానంబడియెడి" ఉ. పెన్నుద్ది (పెన్ + ఉద్ది)

(ప్రౌఢ. సంధి. ౯ సూ.)

మఱియు నిట్లనయవ నకారమునకే గాక యుకారేతర స్వరవిశిష్టప్రత్యయాది నకారమునకును వీరు ద్రుతత్వము నంగీ కరింపని కారణమున 'కమ్మఁగాదేనె, చక్కఁ-ంబెట్టు' మొదలగు చోట్లులందలి 'ని' అను నాగమమునందును 'న' అను ప్రత్య యమునందును స్వరలోపము గలునపుడు మిగిలిన నకారము నకు ద్రుతత్వము దుర్లభము కావలసివచ్చుచున్నది. కాని యచటి నకారములు ద్రుతము లగుచు బిందువులై పరపదాది స్థ పరుషములకు సరళాదేశము నొదవించు ప్రయోగములనే కములు గలవు. అట్టివానిని సాధించుట కుపాయాంతరము

గానక యద్యతనవైయాకరణు లచటి నకారమును ద్రుతమని వ్యవహరింపకయే ద్రుతకార్యములను సూత్రింపసాగిరి.

"గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుం బరుషములు పరంబు లగునపుడు బిందువగు"

"మరువాలారు శరంబులం దొరఁగు కమ్మందేనె"

(ప్రౌఢ. సమాస. ౧౩ సూ.)

"గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ నకారంబున వర్ణం బునకు బిందువు గానంబడియెడి" నని చక్కంగఁ బ్రయుండు వర్తిలుటకై."

(ప్రౌఢ. సమా. ౧౪ సూ.)

పై స్థలములందు నకారమునకు ద్రుతత్వము నంగీకరింపక బిందువిధానము చేసినంతమాత్రమున సరళాదేశ మెట్లు సిద్ధించునని గ్రంథకర్త తలంచెనో తెలియరాకున్నది.

అపిశబ్దార్థకమగు 'ఏని' శబ్దపుసంధి విషయమున నాధునికులు త్రొక్కుచున్న కృత్రకమార్గ మన్నిటికన్నను వింతగా నున్నది. 'ఏని' శబ్ద మవ్యయమే యయ్యును నది యుకారాంతము కామిం జేసి యందలి 'ని' అనుదానికి పిరిమతమున ద్రుతత్వము దుర్లభ మగుచున్నది. అట్లయినను 'ఒక్కఁడేనిఁ, ఒక్కఁడేఁ బోవఁడయ్యె' మొదలగు ప్రయోగములందలి ద్రుతకార్యముల నంగీకరించుచునే యున్నారు. మఱియు 'ఎందేడెందము...' మొదలగు చోటులందు 'ఏని' శబ్దనకారమునకు ద్రుతత్వము నంగీకరింపనిచో నచట సరళ స్థిరపరక ద్రుతలోప శాస్త్రము ప్రవర్తింపనేరదుగదా. పై కారణములచేతఁ బ్రౌఢ

వ్యాకరణకర్త 'ఏనిఁ' అనునది 'ఏనియుఁ' అనుదానిలోని యువర్ణము లోపించినపక్షములోని రూపమనియు, 'ఏఁ' అనునది 'ఏనిఁ' అనుదానిలోని నివర్ణము లోపింపఁగా మిగిలిన రూపమనియు నిట్లు వానితుది నున్న నకారము సముచ్చయార్థక 'ను' శబ్దసంబంధి యగుటచేత ద్రుతము కానోపు ననియు నొకవింతయగు కృతకమార్గమును గల్పించెను. 'ఏని- దే- అవ్య- పక్షాంతరమును తెలిపెడిని..................(ఏనియు నని ప్రయోగింపఁబడుటచే దీనిని ద్రుతప్రకృతికముగా గ్రహింపఁగూడదు. 'ఏనిఁ, ఏఁ' అనురూపములు యువర్ణమును నివర్ణమును లోపింపఁగా నైనవని యెఱుఁగునది............)' (శబ్దరత్నాకరము. ౧౧౭ పుట. ఏనిశబ్దము) ఏనిశబ్దములోని 'ఇ' కారము లోపింపఁగా 'ఏఁ' అనునది సిద్ధించునన్నచో నచటి నకారమందుఁ దాము చెప్పిన ద్రుతలక్షణము ప్రవర్తింపనందునఁ బైరీతి నచటి ని వర్ణమునకు లోపము నంగీకరించి సముచ్చయ ను శబ్దమును గూర్పఁజొచ్చిరి. ఇట్టిపద్ధతి కేవలము నసహజమగుటయే గాక యీప్రక్రిందిరీతిని నన్నయచింతామణికి విరుద్ధమును నగుచున్నది.

(౧౭౯) 'అపిశబ్దార్ధస్యైతః' అను సూత్రముచేత నేని శబ్దములోని 'ఇ' కారము వికల్పముగా లోపింపఁగా 'ఏఁ' అను రూప మేర్పడుచున్నదని నన్నయభట్టారకుఁడు చింతామణిలో స్పష్టముగా సూత్రించియున్నాఁడు. ఇందలి వాశబ్దము వ్యాస్తావాచి గాన నీలోపము మిక్కిలి యరుదుగ నగును.

గద్య. "ఎందే నిట్టి యపూర్వంబైన..." (భార. సభా. ౧ ఆ. ౫౭ ప.)

మత్తకోకిలము. "వేఁడు పెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనుల్
వేఁడికో లుచితంబ కావున వేడ్కతోఁ జని సోమకుల్
వేఁడినన్ ధన మొపఁడేనియు వీనిమాత్రకు నాలుగేన్
బాఁడికుఱ్ఱుల నీఁడె వీనికిఁ బాలు ద్రావుచు నుండఁగాన్."
(భార. ఆది. ౫ ఆ. ౨౧౮ ప.)

అను నీపద్యమున 'నాలుగేన్ = నాలుగు + ఏన్ = నాలుగైనను' అని యిట్లుగ నేని శబ్దేకారలోపరూపమును బ్రయోగించి యున్నాఁడు.

పయిసందర్భమునుబట్టి 'ఏన్' శబ్దము 'ఏనిన్' శబ్దము లోని 'ని' వర్ణలోపమునఁ గల్గలేదనియు, నేనిశబ్దములోని తుది యికారము లోపించుటచేతనే గల్గినదనియు, నన్నయ భట్టు తలంచినవిషయము విమర్శకులకుఁ దోఁచకపోదు గదా.

అహోబలపతియు నీసందర్భమున నేనిశబ్దములోని లుప్త స్వరక నకారము ద్రుతమనిపించుకొను నన్న యభిప్రాయమున కనుకూలముగనే వ్యాఖ్యానము చేసియున్నాఁడు.

"అత్రేయంచింతా — 'రాముఁనే సీతనేఁ గొల్తు' నిత్యాద్యర్థ మిదంసూత్రమ్. అన్యథా కిమాదిత్వేసై వాచిపకే రూపసిద్ధే సూత్రం ముధా స్యాదితి" (అహో. ౧౮౫ పుట.)

పైని వ్రాసిన యహోబలపతివాక్యములలో నొక్కవిషయము విమర్శింపఁదగియున్నది. 'ప్రాయ స్తు స్యా త్కిమాదికే'

స్యేతః' అనుసూత్రముచేతనే 'అమ్మయే నయ్యయేని=(అమ్మ యేని+అయ్యయేని)' 'హరినే నబ్ధిజనేని=(హరినేని+అబ్ధిజనేని)' మొదలగుసంధికార్యములు సిద్ధించుచుండుటచేత 'రామునే సీతనేఁ గొల్తు=(రామునేని+సీతనేని+కొల్తు) మొదలగుస్థలములయందలి నకారలోప సరళాదేశాది సంధికార్యముల సిద్ధికై యిట్లు నన్నయభట్టు 'ఇ' కారలోపమును వేఱుగ సూత్రించెనని పై యహోబలపతి వాక్యములకుఁ దాత్పర్యమై యున్నది. కాని 'ఏని' శబ్దమును గిమాదులలోఁ బఠించుట నన్నయభట్టారకహృదయము కాదు. 'ప్రాయ స్తు స్యాత్కిమాదికస్యేతః'అను సూత్రములోని ప్రాయశ్శబ్దస్వారస్యమునఁ గిమాది సంధిప్రాయఃకార్యమనియు సంధ్యభావము కాదాచిత్కమనియు నన్నయభట్టారకుఁడు తలంచెనని యంగీకరింపక తీరదు. అట్లేకానిచోఁ దదాదులను గిమాదులలోఁ బఠించినచో 'తద్వత్తదాదిజస్య' అను చింతామణిసూత్రము ప్రత్యాఖ్యానయోగ్యమే కావలసివచ్చును గదా. అట్లుగాక తదాదిసంధి పాక్షికమనియుఁ గిమాదిసంధి ప్రాయః కార్యమనియు నంగీకరించునపుడే యీ చింతామణిసూత్రములు నిరుపప్లవముగ సమన్వయించును గదా. నన్నయభట్టభారతభాగములోఁ దదాదిసంధి పాక్షికత్వమును గిమాదిసంధి ప్రాయస్త్వమును సుప్రసిద్ధములై యున్నవి. కిమాదిసంధి ప్రాయస్త్వ మీవలఁ కుదాహరించియున్నాను (వి. ౧౦౭).

ఆ. వె. శప్తుఁడై యదేల సంభవించె. (భా ఆది. ౪ ఆ. ౨౬౧ ప.)
మ. ఇవియేనుఁ గ్గ సతతంబు నాయెడ. (భా. ఆది. ౧ ఆ. ౧౨ ప.)

ఇఁక నేని శబ్ద సంధియన్ననో నన్నయభట్టభారత భాగమున మిక్కిలి యరుదై యున్నది. మిక్కిలి యరుదననేల? వెనుక నుదాహరించిన రెండుప్రయోగములుమాత్రమే యున్నవి- (వి. ౧౨౯) సంధ్యభావప్రయోగము లన్ననో యతిప్రచురము గా నగపడుచున్నవి.

క. భూసురు లాదిఁగ గలజను, లీసుర సేవించిరేని యిది మొదలుగ...
(భార. ఆది. 3 ఆ. ౧౨౧ ప.)

(౧౩౦) ఇఁక ద్రుతము 'ను' స్వరూపమా? నకార వ్యంజనరూపమా? యనువిషయము విమర్శింపవలసియున్నది.

బాలసరస్వతి ద్రుతము 'ను' స్వరూపమని తలంచిన ట్లగపడదు. సరళాదేశసంధిలో ద్రుతమునకు బిందువు రానిపక్షమున 'అంబ న్గొలిచెద, శుభము న్బడసెద' అని మూఁడు బాలసరస్వతీయపు మాతృకలలో నకారవ్యంజనరూపమే యుదాహరింపఁబడియున్నది. ఒక్కమాతృకలోమాత్రము 'అంబను గొలిచెద, శుభమును బడసెద' అని యుదాహరింపఁబడి యున్నది. కాఁగా నిచట మూఁడుమాతృకలలో నేకరీతినే యున్న నకారవ్యంజనరూపమే సరస్వత్యుదాహృతరూపమని యెన్నఁ దగును.

అప్పకవి సరళాదేశవిధానసందర్భమున ద్రుతము బిందు రూపవికారమును బొందనపుడు 'ను' స్వరూపముతోనే యుండునని స్పష్టముగా నుదాహరించియున్నాఁడు.

సీ. "......,తండ్రి పంపునను గాంతారంబునకు నేగి..."(అప్ప. ౫ ఆ.౨౯౧)

(౧౩౧) ఆంధ్రశబ్దచింతామణి వికృతివివేకములలోని హల్పరకద్రుత సంధిసందర్భమును బరిశీలించునపుడు ద్రుతము నకారవ్యంజన రూపమాత్రమేయని విశదముకాక మానదు. ద్రుతమునకుఁ బరుషములు పరమగునపు డవి సరళములుగా మాఱుననియు నాద్రుతమునకు వికల్పముగా బింద్వాదేశమగుననియు నట్లు బింద్వాదేశము రాక స్వస్వరూపముతో నా ద్రుతము నిల్చియున్నను నచట సరళాదేశము వచ్చుననియు నింకఁ దక్కినహల్లు లనఁగా సహజసరళస్థిరములు పరమగునపుడు ద్రుతమునకు లోపము వికల్పముగా వచ్చుననియు లోపాభావపక్షమున సంశ్లేషమునైతము రావచ్చుననియు నట్లనుట చేత స్వస్వరూపావస్థితి యెట్లును వచ్చుననియుఁ జింతామణిలోఁ జెప్పఁబడెను.

శ్లో. పరుషా ద్రుతప్రకృతికా, త్సరళాః స్యు స్తద్ద్రుతం చ బిందు స్స్యాత్।
అవికారగతే తస్మి, న్నపి సరళా ఏవ సన్తి తే పరతః" ... ...
లుగ్వా ద్రుత ప్రకృతికా। త్పరతః సరళే స్థిరేచ నస్య స్యాత్ । అలుకిచ సంశ్లేషః స్యాత్...... (ఆంధ్రశబ్దచిం-సంధిప)

నాదభూత నకారసంయోగమునను సున్నతాకునను శ్వాసములగు పరుషములు నాదభూతసరళములుగా మాఱు

ననియు నట్టియెడల సున్న రానపుడు పరస్వరమున కంగమగుచుఁ బరహల్లుతో ద్రుతము సంయోగించియే యుండుననియు నన్నయభట్టభిప్రాయపడినట్లు పయిశ్లోకములనుబట్టి విశదమగుచున్నది. పొల్లు హల్లు పూర్వస్వరమునకుఁగాని పరస్వరమునకుఁగాని యంగమైయుండునని ప్రాతిశాఖ్యములు చెప్పుచున్నవి. అందు ద్రుతము పూర్వస్వరమున కంగమగుట సంశ్లేషముగా నన్నయభట్టు వ్యవహరించుచుండును. పరుషపరకత్వమున నట్టి సంశ్లేషమువచ్చినచో ద్రుతసంయోగము పరస్థపరుషములకు సంభవింపనేరదు గాన నవి సరళములగుట తటస్థింపనేరదు. ఆకారణముచేతనే పరుషపరకత్వమున సంశ్లేషమును విధింపక పరిశిష్టమగు పరస్వరాంగతారూప స్వరూపావస్థితినే నన్నయ యంగీకరించిన వాఁడయ్యెను. ఇంకఁ దక్కిన సహజ సరళ స్థిరములు పరమగునపుడన్నచో పైరీతిని బరవర్ణమును మార్పవలసిన యావశ్యకత లేమింజేసి యచట ద్రుతమునకు శబ్దశాస్త్రవిత్తముఁడగు నన్నయ సంశ్లేషమును సైతము విధించినవాఁడయ్యెను.

"సంయోగాదిర్వా" (ఋగ్వేద ప్రా. ౧ పటలము) దీని పొర్షద వ్యాఖ్య;—"సంయోగాది భూతోవర్ణః స్వరాన్తరే వర్తమానః పూర్వస్య వా స్వరస్యాంగం భవతి. పరస్యవా......"

ద్రుతము 'న' స్వరూప మనువారిపక్షమున నద్దాని కిట్టి సంశ్లేషముగాని పరహల్ సంయోగముగాని తన్మూలకసరళా

దనెడి చింతామణ్యాశయమును నథర్వణుఁడు స్పష్టపఱిచెనని గ్రహింపవలయును. పయిరీతి నాదేశసరళపరకత్వమున సంశ్లేషమనఁగా ద్రుతము పూర్వస్వరము నత్తియుండుట వలనుపడదు. ఇంక సహజసరళస్థిరపరకత్వమునందు సైతము ద్రుతమును బూర్వాచ్చు నత్తించి పలికెడి యుచ్చారణమునకన్నఁ బరహల్లుతో సంయోగింపఁజేసి పలికెడి యుచ్చారణమె పద్యమధ్యములం దింపుగానుండును. కావుననే సంశ్లేషరూపము క్వాచిత్కమని యథర్వణుఁడు వచించినవాఁడయ్యెను. పయిసందర్భములో నథర్వణుఁడు చెప్పిన "పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్యకథ్యతే" అను కారికచే నకారరూపద్రుతము పూర్వాచ్చు నత్తియుండుటయే సంశ్లేష మనిపించుకొనునని సిద్ధాంతిత మగుచున్నది. వెనుక నుదాహరించిన ప్రాతిశాఖ్యసూత్రమునుబట్టి పొల్లు హల్లునకుఁగల ద్వివిధస్థితులలో ద్రుతము పూర్వాచ్చు నత్తియుండెడిస్థితి పైరీతిని సంశ్లేష మనిపించుకొన్నపు డింక రెండవదగు పరహల్లుతో సంయోగించి పరస్వరాంగమగుచు నుండెడి స్థితియేగదా పయియథర్వణకారికలోని "స్వతా" అనుదానిచే గ్రహింపవలసియుండును. ఇట్లు ద్రుతము నకారవ్యంజనరూప మగునపుడును నదియే దాని స్వత్వరూప మగునపుడును "పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతామ్"అను కారిక యెట్లుపొసఁగునని శంకింపరాదు. పద్యావసానమున నున్న నకారపుపొల్లునకుఁ బరమున హల్లుగాని హల్లుతోనున్న స్వర

ముగాని లేమింజేసి (పరపద్యముతో సంహితయుండదు గాన) యట్టియెడలఁ బరహల్లుతో సంయోగించి పరస్వరాంగమగుట లక్షణముగాఁగల స్వాత్వావస్థ కర్తృతలేదనఁగా నప్రసక్తమని తాత్పర్య మెన్న నగునుగదా.

ఇఁక సంధిస్వభావమును బరిశీలించినచో వెనుక వ్రాసిన రీతిని బూర్వపదాంత స్థానునాసికరూప నకారవ్యంజనమగు నాదాక్షరము సంబంధమున నవ్యవహితోత్తరపదాది నున్న శ్వాసములును నాదరూపమునందుట సహజముగాని ను స్వరూపసంబంధమున నట్లు శ్వాసములు నాదములగుట సహజము కాదు. ఈవిషయమునే తరువాతి యాంధ్రవైయాకరణులును సూచించియున్నారు.

తే. తద్ద్వితీయావిభక్తి పొంతలఁ జరించు
ఋద్ధిగల సున్న పోకునఁ గ చ ట త ప లు
గ జ డ ద బలగు నూఁదుట గలుగుఁ గవుల
యనుమతంబున నొక్కొక్క యవసరమున. (కావ్యాలం. ౯ ఉల్లా.)

క. నాంతంబైనపదంబుల
పొంతంబై నున్న శబ్దముల క చ ట త పల్
దొంతి గ జ డ ద బ లగు న
య్యంత నకార మగు సున్న యభినవదండీ. (ఆంధ్రభాషాభూ. ౫౩ ప.)

ఇట్లు సరళాదేశమున కసాధారణకారణ మనఁదగియున్న నకారవ్యంజనము మరల ను స్వరూప మెట్లు పొందఁగలదని యాధునికులు తలంతురో తెలియకున్నది.

వేయేల! చింతామణికర్త ద్రుతము నకారస్వరూపమే యని 'అలుకి చ సంశ్లేష స్స్యాత్.' 'లుక్ సంశ్లేషౌ నాచి' అనుసూత్రద్వయమున విశదపఱిచియే యున్నాఁడు. మఱియు 'ద్రుతాఖ్యో నః' అనుసూత్రముచేఁ గంఠోక్తముగను జెప్పియున్నాఁడు. ఇంతియకాక ద్రుతము ను స్వరూపమనియే యాతఁడు తలంచియున్నయెడల ద్రుతస్వరలోపవిధానమును దక్కినవారి వలెఁ బ్రత్యేకించి చేసియుండఁడా?

"అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబున కేని
లోపంబు బహుళంబుగా నగు." (బాలవ్యా. సంధి. ౨౦ సూ.)

అని యిట్లు ను స్వరూపవాదుల లోనివాఁడగు బాలవ్యాకరణకర్త యవసానద్రుతస్వరలోపవిధానముచు బ్రత్యేకించి చేసియుండలేదా? చింతామణికర్తయన్ననో ద్రుతము పొల్లు నకారమే యని తలంచువాఁ డగుటంజేసి 'వాక్యాంతగత పదానాం చ' అను (ఆంధ్రశబ్ద. సంధి. ౩౧ శ్లో.) సూత్రముచే నవసానమునఁ బాక్షికమగు ద్రుతలోపమునుమాత్రమే సూత్రించియున్నాఁడు. ద్రుతము ను స్వరూపమనుతలంపు చింతామణికర్తకు లేదని నిర్ణయించుటకీ యొక్క నిదర్శనమే చాలునుగదా.

ఇఁక బాలవ్యాకరణకర్తసూత్రము హల్లు పరమగునపుడు ద్రుతస్వరలోపవిధానమును జేసియుండెనా యని శంకింపఁ బనిలేదు. ఆతఁడు ద్రుతమునకు హల్లుపరమగునపుడు సంశ్లేషమును విధించినవాఁడును, (బాల. సంధి. ౧౭. ౧౮ సూ.) 'సంశ్లేష

మనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట' అని యిట్లు సంశ్లేష స్వరూపమును నిరూపించినవాఁడును నగుటచేత నాతని మతమున సంశ్లేషవిధానసామర్థ్యముచేత ద్రుతస్వరలోపమును గల్పించుకొనక తీరదుగదా.

(౧౩.౩) ఆంధ్రశబ్దచింతామణిమతమున ద్రుతము పొల్లు నకారమే యగుటచేత నచటి సంశ్లేషమునకు బాలవ్యాకరణమునఁ గల్గిన యనుపపత్తియే సంభవింపనేరదు. ద్రుతము పూర్వస్వరాంగమై పూర్వస్వరము నత్తియుండుటయే దాని సంశ్లేషమని చింతామణి తాత్పర్యమగుటంజేసి యట్టిసంశ్లేషము గుర్వవసాయిపద్యావసానములందు నియతముగను బరుషేతరహల్పరకత్వమునఁ బద్యమధ్యములం దైచ్ఛికముగను వెలయుచుండును. స్వరము పరమగునపు డెంతమాత్రమును ద్రుతమునకు సంశ్లేషమురాదని "లుక్సంశ్లేషౌనాచి" అనుచింతామణిసూత్రము వక్కాణించుచున్నది. ఇట్లు రాకుండుటయు శబ్దతత్త్వశాస్త్ర సంప్రదాయసిద్ధమె యగుచున్నది.

"స్వరాంతరే వ్యంజనా న్యుత్తరస్య" (ఋగ్వేద ప్రాతిశాఖ్యము. ౧ పటలము) దీని పార్షదవ్యాఖ్య:—"యాని వ్యంజనాని స్వరయో ర్మధ్యగతాని తాని ఉత్తర స్యైవాంగం భవన్తి. న పూర్వస్య."

స్వరపూర్వకమును స్వరపరకమును నగు నేకవ్యంజనము (అసంయుక్తవ్యంజనము) పరస్వరమునకె యంగమగునుగాని పూర్వస్వరమున కంగము కానేరదని పైప్రాతిశాఖ్యసందర్భ

మున కాశయము. కావునఁ బ్రత్యేకావస్థలోఁ బదావసానమున
నిల్చిన ద్రుతము పూర్వస్వరాంగమై పూర్వస్వరము నత్తి యు
న్నను నట్టిపదము స్వరాదిశబ్దపరకము గునపు డట్టిపూర్వస్వరాం
గమైన పొల్లు నకారమే పరస్వరాంగమగు ననఁగా నట్టిస్వర
ముతోఁ గూడినదగునని తాత్పర్యము. ఈసందర్భము సైతము
(లుక్సంశ్లేషౌనాచి) ద్రుతము నకారవ్యంజనరూపము గలదే
యని సిద్ధాంతీకరించుచున్నదిగదా.

(౧౩౩) పయిసందర్భమునుబట్టి పదాంతమందు నిల్చియుండు
పొల్లునకార మెల్లయెడలను ద్రుతసంజ్ఞగలదియే యని చింతా
మణికర్త తలంచినట్లు సిద్ధాంతిత మగుచున్నది. 'ను'స్వరూపము
ద్రుతము కాకుండుటం జేసి యద్దానికిఁ బరముగనుండెడిపరుషము
లకు గ జ డ ద బాదేశము రానేరదనియును, 'నేను జది
వితిని' అనురీతిగలచోటులందు సైతము సరళాదేశము నన్నయ
భారతభాగమున లేదనియును, నట్టిచోట గ జ డ ద బాదేశ
మున్నచో నది లేఖకులయు ముద్రణసంస్కర్తలయుఁ బ్రమాద
మేయనియును, నిశ్చితమగుచున్నది. అట్లే చింతామణిలోని
'తిజ్మధ్యే' త్యాదిసూత్రముచే సంభవించెడి ద్రుతము పొల్లు
నకారమే యనియు, నక్కారణమున నయ్యది 'రాములను,
రామునిచేతను, రక్షించెను, రక్షించును' అనురీతిని ను స్వరూప
ముతో నన్నయభారతభాగమున నుండ నేరదనియు, నట్లున్నచో
నది లేఖకాదిప్రమాదకృతమే యనియు, నిశ్చితమగుచున్నది.

ఇఁక నట్టిచోటులందు సముచ్చయాద్యర్థక 'చ'శబ్దపర్యాయము లగు 'ఉను,' 'ను' అనుశబ్దములు మాత్రముండిన నుండవచ్చు ననియు గ్రహింపవలయును. పై విషయములు విశదపడుటకై యిట నన్నయభట్టారకప్రయోగముల పరిశీలనము ప్రదర్శింపఁ బడుచున్నది.

(౧౩౮) (౧)చ. "అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను బుద్ధిబాహు
విక్రమమున దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ సము
ద్రము దరియంగ నీఁదను విధాత్రునకైనను నేరఁబోలునే."
(భార. ఆది. ౧ ఆ. ౧౯ ప.)

ఇందు 'ఎన్నను, పొందను, ఈఁదను, ఐనను' అనుస్థలములలోని నుశబ్దము లుపద్రుతకమగు చార్థకశబ్దమే యని గ్రహింపనగును.

(౨) చ. "అనిన......నాకు మనోరథంబు లె
ల్లను సమకూరె నిప్డు సఫలత్వముఁ బొందె ధనాగమంబు లం
చును నెడ నిశ్చయించె......" (భార. సభా. ౧ ఆ. ౨౪౧ ప.)

ఇందు 'ఎల్లను=(అన్నియు)' అనెడి ప్రాసస్థలమునందలి 'ను,' శబ్దము సాకల్యాతిశయార్థకమనుటకు సందియము లేదు గదా. ఇఁక నిందలి 'అంచునున్' అను ప్రయోగములోనున్న 'చార్థక' శబ్దము, వ్యవహారములో 'అంటూ' అను వాడుకలోని దీర్ఘముచే వ్యక్తమగుచున్న వర్తమానార్థ విశేషము

ననఁగాఁ బ్రారబ్ధాపరిసమాప్తతాతిశయమును బోధించుచున్న దని తెలియుచున్నది. ఇట్లే శతృర్థకచువర్ణకమునకుఁ దర్వాత నర్థవిశేష బోధకావ్యయమగు 'ఉను' శబ్దపుఁ బ్రయోగము స్థలాంతరమునందును స్పష్టముగా నీక్రిందిరీతిని నన్నయ ప్రయోగించెను.

చ. .........కురుసింహవరూథము నిట్లు క్రమ్మరిం
చునె యితఁ డంచునుందగిలి—పొగడుచుండిరి—

(భార. ఆది. ౪ ఆ. ౨౦౭ప.)

(3) తరళ... । వినత...కొరె...సుపుత్త్రిలన్...వారికం ।
బెనుబలాధిపు లైనవారి......

(భార. ఆది. ౨ ఆ. 3 ప.)

ఇందలి 'వారికంబెను' అనుచోటి చార్థకశబ్దము 'అపి' శబ్దార్థవిశేషముచేఁ దచ్ఛబ్దవాచ్యు లగు నాగుల బలాతిశయము ను బోధించుచున్నదనుట నిర్వివాదము గదా. ఇట్లే స్థలాంతరములందు సైతము నన్నయభట్టు ప్రయోగించి యుండఁగా లేఖకాదుల ప్రమాదమున వేఱువిధమున ముద్రితమయ్యెను. అట్టివాని నిటఁ గొన్నిటిఁ జూపెదను.

ఉ. యాదవ వృష్ణిభోజవరు లందఱు పాండవపక్షపాతు ల
చ్చేదివరుండు వారలన చేకొనువాఁడగు వీరలెల్ల నా
త్మోదయ వృద్ధిపొంబెను దదున్నతి కోరుదురు......

(ముద్రితభార. ఆది. ౮ ఆ. ౧౩ ప.)

ఉ. ......ఆత్మోదయవృద్ధికంబెను.........
(తాళపత్రమాతృక ౨౧౪ తాళపత్రము. వేఱొకమాతృక ౨౩౪ తాళ.)

ఇటఁ దాళపత్రమాతృకాపాఠమే నన్నయాభిప్రేత మనఁ దగునని విస్తరించి వ్రాయనక్కఱ లేదుగదా.

(౪) ఆ-వె. ......, ఎంతబలియుఁడయ్యు నెంతగర్వితుఁడయ్యుఁ
దనకఠోర దుష్ప్రతాపమునను, విగతవిభవుఁ డగు...

(ముద్రితభార. సభా. ౧ ఆ. ౧౨౧ ప.)

ఆ-వె. తాపమునన...... (తాళపత్రమా. ౧౯ తాళపత్రము.)

(౫) క. ధృతిమంతుల భుజవిక్రమ
జితశత్రులఁ బాండవేయ సింహులను మదో
ద్ధతిమై...... (ముద్రితభార. సభా. ౨ ఆ. ౧౮౬ ప.)

క. ......, జితశత్రులబాండవేయ సింహములు మదో
ద్ధతిమై...... (తాళపత్రమా. ౬౧ తాళపత్రము.)

(౬) తే-గీ. ...తలఁచిరాత్రులెల్లఁ దాపమునను......

(ముద్రితభారత. అరణ్య. ౨ ఆ ౧౩౩ ప.)

తే-గీ. ...తలచిరాత్రులెల్ల దల్లడమున...

(తాళపత్రమాతృక. ౬౦ తాళ.)

పై ౪. ౫. ౬. పాఠములలోఁ దాళపత్రమాతృకాపాఠములే నన్నయాభిప్రేతము లనందగును.

(౭) సీ. ......, మెఱపునుంబోలెను వఱలు నుత్పలగంధి
బంధుర తను సౌరభంబుగలుగ

(ముద్రితభారత. ఆది. ౭ ఆ. ౧౬౦ ప.)

సీ. ......, బఱపుమైగోలెను వఱలు నుత్పలగంధి......

(తాళపత్రమాతృక. ౧౯౩ తాటాకు...
వేటూకమా. ౨౧౨ తా.)

ఈ తాళపత్రమాతృకాపాఠమునకు 'బఱపు=సుందరమైన, మైఁగోలెను=తనులతతో, వఱలు=ఒప్పునట్టి' అని యిట్టరము చేయనగును. ఈపక్షమున 'కోలెను' అనుచోట ద్రుతప్రకృతికమగు తృతీయార్థక ద్వితీయా ను ప్రత్యయముండుట నిర్బాధమని గ్రహింపనగుటం జేసి తాళపత్రమాతృకాపాఠమే నన్నయాభిప్రేత మనఁదగియున్నది.

(౮) పృథ్వీ......క్రమంబునను భూసురేశులకగణ్యపుణ్యార్థియై...
(ముద్రితభార. ఆది. ౫ ఆ. ౬౨ ప.)

పృథ్వీ......క్రమంబునన... (తాళమా. ౧౨౮ తా.)
(వేఱొకమా. ౧౩౩ తా.)

ఇందును నబాధితమగు తాళపత్రమాతృకాపాఠమే నన్నయప్రోక్తము కానోపును.

(౯) తే-గీ....విశేషవ్రతంబులు ధీరవృత్తి జరపువారుగాను...
(ముద్రితభార. ఆది. ౮ ఆ. ౧౧౫ ప.)

తే-గీ. ...చలుపువారుగాఁ... (తాళ. మా. ౨౨౯ తా.)
(వేఱొక. ౨౪౬ తాటాకు.)

ఇందును నబాధితమగు తాళపత్రమాతృకాపాఠమే నన్నయప్రోక్తమై యుండు ననఁదగును.

(౧౦) సీ. కొనుమని నాకుఁజెప్పినను నేపురు నుపయోగింపుఁ డంటి...
(ముద్రితభారతము. ఆది. ౭ ఆ. ౨౧౧ ప.)

సీ. కొనుమని నాకుజెప్పిన నేపురును నుపయోగింపు డంటి...
(తాళ. మా. ౨౦౦ తా.) (వేఱొక. మా. ౨౨౦ తా.)

ఇచట సముచ్చయార్థకావ్యయమగు చార్థకశబ్దము ద్రుతప్రకృతికము గాన 'ఏవురును' అను తాళపత్రమాతృకా పాఠము నిర్బాధమై యున్నది. ఇందలి 'చార్థక' శబ్ద మైదుగుర లోను నొకరయినఁ గొఱఁతగాకుండ ననెడి యర్థవిశేషమును బోధించుచున్నది. ఇట్టిచోట్ల వాడుకభాషలో సయితము "ఐదుగురూ, (లేక) ఐదుగురున్నూ' అనియే వాడఁబడును. ఈసందర్భమునుబట్టి

"ఇవియేనుఁ సతతంబునాయెడఁ గరం బిష్టంబు లైయుండు..."

(భార. ఆది. ౧ ఆ. ౧౨ ప.)

అనుచోట 'చార్థక' శబ్దము పాదపూరణార్థకమని శబ్దరత్నాకరములో 'ను' శబ్దమునొద్ద వ్రాయఁబడినది సరికాదని గ్రహింపవలయును. ఇట్టి యర్థవిశేషములలో స్థలాంతరములందును "చార్థక'శబ్దము ప్రయుక్తము కాకపోలేదు.

(i) క. "శరనికరసహస్రంబులఁ, బరువడి నందఱను గప్పె..."

ఇందును నొక్కరినైనను విడువక యందఱను గప్పె ననెడి సాకల్యాతిశయము 'చార్థక' శబ్దముచే బోధిత మగుచున్నది.

(ii) మత్త. " ఆదిఁ గోలెను కృష్ణునిచే దయనావృతుండయి..."

ఇందును 'ఆదిఁగోలెను' అనుచోటి నుశబ్దముచే 'ఇప్పుడును అప్పుడును గాదు. మొదటినుండియు' అనునది మొదలగు వాడుకలలో నుండెడి యర్థవిశేషను బోధితమగుచున్నది.

26736

 నన్నయ భారతమున ప్రయుక్తమగు ఈ స్వరూపము లేదు. (౧౩౪-వి.)

(iii) క. "పితృసంకల్పము సేయఁగ, సుతుల కవశ్యమును వలయు..."

(భార. సభా. ౧ ఆ. ౯౪ ప.)

ఇందును 'అవశ్యమును' అనుచోటి చార్థకశబ్ద మెంత మాత్రమును దప్పిపోరా దనెడి యావశ్యకతాతిశయమును బోధించుచున్నది.

(iv) క. "...శిశుపాలుఁడు సం, తతమును నాతనిన కొలుచుఁ దద్దయు భక్తిన్." (భార. సభా. ౧ ఆ. ౧౧౧ ప.)

ఇందును 'సంతతమును' అనుచోటి చార్థకశబ్దము 'ఒకప్పుడైనను దప్పిపోవక' అనెడి నైరంతర్యార్థాతిశయమును బోధించుచున్నది.

(v) సీ. "సురుచిరహారినీల కిరణజలంబులఁ

బద్మరాగారుణపద్మములను

......కూర్మములను ......

ఫేనములను,.........విలసిల్ల......"

ఇందు సైతము తృతీయార్థమునవచ్చిన ద్వితీయా లు ప్రత్యయములకుఁ బరముగ నిల్పిన చార్థకశబ్దములు 'కిరణముల చేతనున్నూ, పద్మములచేతనున్నూ, మొదలగు వాడుకలలో నున్న సముచ్చయార్థమునే బోధించుచున్నవి.

(vi) ఉ. ".........వానిముక్కునన్

వాతను గర్ణరంధ్రముల వారకశోణిత ధారలొల్కఁగాన్."

(భార. సభా. ౧ ఆ. ౨౧౦ ప.)

దీనియందును 'వాతను' అనుచో నున్న చార్థకశబ్దము "ముక్కులోనుంచిన్నీ, నోటిలోనుంచిన్నీ, అనెడివాడుకలోను న్న సముచ్చయార్థమును దెల్పుచున్నది.

(vii) క. తనరిరి తద్దేశంబున
నసవరతము యజన యాజ నాధ్యయ నాధ్యా
పన దానములు ప్రతిగ్రహ
మును నను షట్కర్మములను భూసురవంశ్యుల్.

(భార. ఆది. ౧ ఆ. ౧౪ ప.)

దీనియందును 'ప్రతిగ్రహమునున్' అనుచోట నున్న ద్రుతప్రకృతికమగు చార్థక శబ్దము 'యజన యాజ నాధ్యయ నాధ్యాపన దానములున్నూ ప్రతిగ్రహమున్నూ' అనెడి వాడుకలోనున్న సముచ్చయార్థమును బోధించుచున్నది. మఱి యు నిందలి 'షట్కర్మములను' అనుచోఁ దృతీయార్థక ద్వితీయాప్రత్యయమునకుఁ దర్వాతనున్న చార్థక శబ్దము ఆఱు కర్మములలోను నొక్కటిచేతనైనఁ గొఱఁతవడకుండ 'తనరిరి' అను నర్థవిశేషమును బోధించుచున్నది.

గ్రంథవిస్తరభీతిచే విరమించితిని గాని నన్నయభట్టారక ప్రయోగములలో విరుద్ధములని స్థూలబుద్ధికిఁదోఁచెడి చోట లోనున్న 'ను' స్వరూపములకెల్ల నిట్టి యర్థవిశేషములు ? వని నిరూపింపవచ్చును. అట్టియర్థవిశేషములులేని ను, ని స్వ పములు చింతామణికి విరుద్ధములయియే యుండుననియు ?

నన్నయ తనభారతభాగమునం బ్రయోగింపలేదనియు గ్రహింపవలెను.

౧. ఉ. "నన్నును గౌఁగిలించుకొని..." (భార. అర. 3 ఆ. ౧౦౭ ప.)

దీనిలోనున్న 'నున్' అనునది ద్రుతప్రకృతికమగు ద్వితీయా ను ప్రత్యయము గాన నచటి 'ను' స్వరూపము విరుద్ధము కానేరదు.

౨. మ. "...తో, డ్కొని తెచ్చెం దనతల్లి సత్యవతినిన్...."
(భార. ఆది. ౪ ఆ. ౧౯౨ ప.)

దీనియందలి 'సత్యవతినిన్' అనునది ద్రుతప్రకృతికమగు ద్వితీయా 'ని' ప్రత్యయము గాన నచటి ని స్వరూపము శంకాస్పదము కానేరదు.

3. తే-గీ. "...ఎఱుఁగ నంటిని నిందఱ కిప్పు డెఱుఁగఁ జెప్పె..."
(భార. ఆది. ౪ ఆ. ౧౦౮ ప.)

దీనిలో సైతము 'అంటినిన్' అనుచోట 'నిన్' అనునది ద్రుతప్రకృతికమగు భూతార్థకోత్తమ పురుషైకవచన ప్రత్యయము గాన నచటి ని స్వరూపము శంకాస్పదము కాదు.

(౧౩౫) 'తిఙ్ఘ్యే'త్యాది సూత్రముచేత భూత తద్ధర్మార్థకముల ప్రథమపురుషైకవచనములకు ద్రుతప్రకృతికత్వము సిద్ధించుచుండుటచేత వానితుదిని 'రక్షించెన్' 'రక్షించున్' అని యిట్లు పొల్లు నకారములె యుండును. శార్దూలాది వృత్తముల తుది నెవ్వరిమతమునందైన నుండని 'ను' స్వరూప

ముతో దీర్ఘమును జేర్చి 'శా. సారాచార విశారదా......
ప్రాప్తిచే( జెల్వగునూ' అని యిట్లు వ్రాయుట తాళపత్ర
మాతృకా లేఖకుల యలవాటై యుండుటచేతను, దరువాతి
వైయాకరణులు ద్రుతమునకు 'ను' స్వరూపమును నంగీక
రించియుండుటచే ముద్రణసంస్కర్తలు కొన్ని ప్రమాదపతిత
'ను' స్వరూపములచోట్ల నకారవ్యంజనరూపమును నిల్పకయే
ముద్రింపించుటచేతను, నన్నయభట్టభారతభాగపు ముద్రిత పు
స్తకములలో ననేకస్థలములందు 'అయ్యెను, అగును' అనురీతిని
'ను' స్వరూపముతో ద్రుత మగపడుచున్నది. కాని యట్టి
చోటులందెల్ల వ్యంజన నకారముండుటయే నన్నయాభిప్రేత
మని పై సందర్భమునుబట్టి యంగీకరింపక తీరదు. ఛందోయతి
ప్రాసాది నియమబద్ధములగు మార్పరాని స్థలములలో విరుద్ధ
ప్రయోగములు నన్నయభట్టభారతభాగములో లేవనియే
గ్రహింపనగును.

క. ......అసురశక్తిఁ దాల్చి యొప్పెను...దినకర......

(భార. ఆది. ౨ ఆ. ౧౫౭ ప.)

క. అనిన విని నగుచు వాఁడి
ట్లనియెను దక్షుకుఁడ నేన......... (భార. ఆది. ౨ ఆ. ౧౯౦ ప.)

ఈయిరీతి నున్నస్థలములందెల్ల 'ఒప్పెన్, అనియెన్' అని
పఠించినను ఛందోభంగ ముండనేరదు గావున నట్టియెడల
వ్యంజన నకారపాఠమే నన్నయభట్టప్రయుక్తమై యుండు నని
గ్రహింపఁదగును.

చ. ...యువతి పరిగ్రహించు ననియుం దలఁచెఁ

హృదయంబులోపలన్ (భార. ఆది. ౭ ఆ. ౧౭౪ ప.)

చ. ...యువతి పరిగ్రహించు నని యుండెను దా

హృదయంబులోపలన్. (పాఠాంతరము.)

ఈపాఠద్వయములోను ముద్రణసంస్కర్త లెన్నుకొన్న మీఁదిపాఠమే నన్నయభట్టాభిప్రేతమని యెన్నఁదగును.

సీ. ... ... ... ...

ఒక్కొకయింటఁ దా నొక్కయేఁడు

క్రమమున నుండును గమలాక్షి యెవ్వరి

యింటఁ దానుండె నయ్యింటివలనఁ

బెఱవార లనకుండ నెఱుఁగక చనిరేని

వెలయఁగఁ బండ్రెండు నెలలు తీర్థ

ఆ-వె. సేవసేయుచును విశేషవ్రతంబులు

ధీరవృత్తి జరపువారుగాను

సన్మునీంద్రునొద్ద సమయంబు సేసిరి

రాజ సుతులు పాండురాజ సుతులు. (భార. ఆది. ౮ ఆ. ౧౧౫.)

పైపద్యములో 'ఉండును' అనునది ముద్రణప్రమాదమనియు, నచట 'ఉండను' అని యుండియుండుననియుఁ, జెప్పుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరుగదా. మఱియుఁ బైపద్యమున 'క్రమమున నుండఁగానున్ను, జరపువారుగానున్ను, సమయముచేసిరి' అను వ్యావహారికవాక్యమును

బోధించెడి యీ రెండుస్థలములందును గల 'ను' స్వరూప ములు సముచ్చయార్థకములనుటకు సందియము లేదుగదా. అట్లే 'చేయుచును' అనుచోటి 'ను' స్వరూపము ప్రారబ్ధాపరి సమాప్తతాతిశయమును బోధింపఁజాలునని యీవలకు విమ ర్శించి చూపియేయున్నాను.(వి.౧౩౮.౨.)'క్రమమున నుండను, అను పైస్థలమునందుఁ దాళపత్రమాతృకలలో 'క్రమమున నుం డంగ' అని మఱింతస్పష్టముగను నిర్బాధముగను నున్నది. (౨౮౦ తాళపత్రము.)

చ. ...పాత్రున కిద్దియిచ్చినన్
ఘనముగ నక్షయంబగును గావున......

(ముద్రితభారత. ఆది. ౨ ఆ. ౨౩౨ ప)

చ. ......, ఘనముగ నక్షయంబునగు గావున......

(తాళపత్రమాతృక. ౫౦ తా.)

ఈపాఠద్వయమునందును దాళపత్రమాతృకాగతపాఠ మే చింతామ ణ్యవిరుద్ధమగుటచే నన్నయభట్టప్రోక్తమైయుండు ననఁదగును. మఱియు 'దానఫల మక్షయమును నగు'ననెడి స్వారసికార్థ మిందు వెలయుచున్నది.

క. ఘనభుజ నీకారణమునఁ
జనఁ గాంతురు పుణ్యగతికి సాగరులు ముదం
బున సగరునకును దొరకును
నొనరఁగ సుతవంతులైన యుత్తములగతుల్.

(ముద్రితభార. అరణ్య. 3 ఆ, ౭౦ప.)

క. ......సగరునకును దొరకొను, నొనరగ......

(తాళపత్రమాతృక ౮౭ తా. వేటలోకమా. ౯౧ ?

వీనిలోఁ దాళపత్రమాతృకాగతపాఠమే చింతామణ్య
కూలమై యుండుటచే నదియె నన్నయప్రయుక్తమయియుం
ననఁదగియున్నది. మఱియు నిందు 'సాగరులనఁగా సగరపు
లుత్తమగతిని గాంచుటయే గాక సగరునకును బుత్త్రివం
యుత్తమగతులు సంభవించును' అను నర్థవిశేషము బోధిం
బడుటకై 'సగరునకును' అనుచోటి చార్థకశబ్దము ప్రయు
య్యెనని గ్రహింపనగును.

ఉ. నీవును జూచి తట్టిసభ నేని వినంబడ దే యుగంబులన్
భూవలయంబులో నది యపూర్వము సర్వమనోజ్ఞ మిట్టి భో
గావహ మేఁ క్రియం బడసె నయ్య మహాత్ముఁడు దాన నేమి సం
భావిత భాగ్యుఁడయ్యెను బ్రభాకరతేజుఁడు ధర్మజుండిలన్.

(భార. సభా. ౨ ఆ. ౯౫

ఇందు 'నీవును' అనుచో 'నీవు సైతము' అను
విశేషము నచటి చార్థకశబ్దము బోధించుచున్నదనుట
వివాదము లేదు. ఇఁక 'అయ్యెను' అనుచోట 'దానివ
నెంతటిభాగ్యశాలి యయ్యెనూ, అనువాడుకలోఁ దోఁచు
విశేష మచటి చార్థకశబ్దము చేఁ (అయ్యెన్ + నున్) జె
బడుచున్నదని యెన్నఁనగును. 'ను' శబ్దమునకిట్టి యర్థవిశేష
వింతకాదు.

క. తనపలుకు లోకమెల్లను
గొనియాడఁగఁ దగిన లోకగురుఁ డీయమ నం
దనుఁ డే మేవురమును నీ
తనుమధ్య వివాహమయ్యెదము నని పలికెన్.

(భార. ఆది, ౭ ఆ. ౨౪౮ ప.)

'మే మైదుగురము నీద్రౌపదిని వివాహమయ్యెదము 'ను' అని యిట్లు లోకవిలక్షణతాతిశయ రూపార్థవిశేషమును బోధించుటకై 'అయ్యెదము' అను కళయగు క్రియ చార్థక శబ్దయుక్తముగ నన్నయభట్టారకునిచేతనే వేఱొకచోటఁ బ్రయోగింపఁబడి యున్నది.

(౧౩౬) చ. ...నిదాఘవా, సరములు సర్వజీవుల క
సహ్యములయ్యెను దారుణంబులై. (భార ఆది. ౭ ఆ. ౨౩౦ప.)

ఇందలి 'అయ్యెను దారుణంబులై' అనుచోట 'అయ్యె సుదారుణంబులై' (అత్యంత దారుణములై) అని నన్నయభట్టుచేఁ బ్రయుక్తమై యుండుననిి యాలోచింపవలసి యున్నది. 'సు = పూజాయామ్ అతిశయే, సమృద్ధౌ' అని సుశబ్దమున కర్థములు గలవు. (సర్వశబ్దసంబోధిని.) సుతీక్ష్ణ సుదూరాది శబ్దములు సుప్రసిద్ధములే గదా. ఆంధ్రలిపిలో 'ను, సు' అను రెండిటియాకారములును మిక్కిలి సాదృశ్యము నంది యుండు టం జేసియు, నీస్థలము తప్పఁ దక్కిన నన్నయభారతభాగమం దంతటను నీవిషయమువంకను జింతామణి కవినుద్ధముగనే పై

నుదాహరించినరీతిని బ్రయోగము లుండుటంజేసియు, 'సు, 
అనునవి మొదలగు ప్రాపుల నీక్రిందిరీతిని గొన్నియెడల నన్న
యభట్టారకుఁడును బ్రయోగించియుండుటంజేసియు, నిట్టియు
హ సత్యవిదూరము కానేరదు.

"సుపౌరాణికుండు" (భార. ఆది. ౧ ఆ. ౨౮
'సుస్థిర' 'విబాధలు' (భార. ఆది. ౮ ఆ. ౮౩
"సుస్వయంవరము" (భార. అరణ్య. ౨ ఆ ౩౧
"సుక్రతువు" (భార. అరణ్య. ౩ ఆ. ౧౮౭

పైరీతి నీవిషయమున యుక్తమగుసమాధానము లుం
టంజేసి యిది దేశ్యక్రియ యగుటచేత నీయొక్క-చోటను వ్య
క్రమమున్నను క్షతిలేదనెడి యగతికగతిరూప సమాధానము
జెప్పవలసినప్రసక్తి లేదు.

(౧౩౭) శా. ఆదుర్యోధనుఁ డుష్కవిల్లుడును గ్రవ్యాదార
వంబుల్...చెలంగ...... (భార. ఆది. ౫ ఆ ౧౦

సీ. జలమపేక్షించుచు సంభవిల్లి... (భార. అరణ్య. ౨ ఆ. ౧౯౭

నన్నయభట్టభారతభాగమున 'ఎత్తుడును' 'పుట్టుడు
మున్నగు సముచ్చయార్థక నుశబ్దపరక భావార్థక డు ప్ర
యాంత దేశ్యశబ్దము లానంతర్యార్థకములై యనేకస్థలములం
'ఎత్తుటయున్, పుట్టుటయున్' మున్నగువానితో పాటుగ వా
బడియున్నవి. పైపద్యములం దట్టిసముచ్చయార్థక నుశబ్ద
ను ప్రత్యయము తత్సమధాతువులకును జేర్పఁబడినది. ఆ

శబ్దచింతామణిలోని 'పునరాగమః క్రియాణామ్' అనుసూత్ర ముచే (వి. ౧౧౧.) నిట్టిరూపము నన్నయప్రయుక్తము లగు 'తేజరిల్లమి, పరిగ్రహింతము, విచారింపకుము' అనువానితో పాటుగ సాధించుకొనవలయునని యీవఱకు వ్రాయఁబడియే యున్నది. (వి. ౧౧౧.)

బాలవ్యాకరణంబునం దీవిషయమున 'ఆనంతర్యంబున డు వర్ణకంబు ద్రుతాంతంబగు' (బాలవ్యా. క్రియా. ౭౨ సూ) అని యిట్లు వింతగ సూత్రింపఁబడియున్నది. ఇఁక 'ట' ప్రత్యయంబన్ననో 'టవర్ణకంబు భావార్థంబునందగు' (బాలవ్యా. క్రియా. ౩౫ సూ.) అని యిట్లు భావార్థమున విధింపఁబడెను. అద్దాని నంగీకరించుచు సముచ్చయార్థక నుశబ్దపరకభావార్థక ట ప్రత్యయ మానంతర్యార్థక మగునని ప్రౌఢవ్యాకరణకర్త యీక్రిందిరీతిని సూత్రించెను "కొన్నియెడల భావార్థకరూపము 'ను' శబ్దపరకంబై యానంతర్యార్థకం బయ్యెడి" (ప్రౌఢ. క్రియా. ౧౨ సూ.) పరిశీలింపఁగా నిట్లే భావార్థక డు ప్రత్యయవిషయమునందును సూత్రింపవలసియుండఁగాఁ బైరీతిని సూరిగారు సూత్రించుట కేవలము ప్రామాదికమై యున్నదనుటకు సందేహము లేదుగదా. చింతామణిలో భావార్థక ట ప్రత్యయము కంఠోక్తముగఁ జెప్పఁబడియుండుటచేతను, 'డు' ప్రత్యయ మట్లు చెప్పఁబడక 'పునరాగమః క్రియాణామ్మ'నుసూత్రముచే సంగ్రహింపఁబడి యుండుటచేతను జింతామణి నిగూఢాశయములను

సరిగాఁ బరిశీలింపని యాధునిక వైయాకరణు లిట్టిప్రమాదము
నకు లోనైరని గ్రహింపనగును. బాగుగఁ బరిశీంచినచో భావా
ర్థక టుప్రత్యయవిధాయకసూత్రములో నన్నయభట్టారకుఁడె తన
యీ నిగూఢాశయమును గొంత వెల్లడించెనని తోఁచకపోదు:

"భావే టువర్ణకోంతే సర్వేషాం చ క్రియాపదానాం స్యాత్."

అను సూత్రమునందలి 'సర్వేషాం చ' అనుదాని స్వారస్యము
నాలోచింపఁగాఁ దత్సమధాతువులందు భావార్థక టు ప్రత్యయ
మమాత్రమే తఱచుగాఁ బ్రయుక్తమగుచుండుననియు, నక్కార
ణమున నయ్యదిమాత్రమే సర్వక్రియా సామాన్యముగా వచ్చు
ప్రత్యయములతోఁపాటుగ నాసందర్భమునఁ జెప్పఁబడెననియు
నట్లు ప్రచురప్రయోగములేని భావార్థక డు ప్రత్యయము ము
న్నగునవి 'పునరాగమః క్రియాణామ్న'ను సూత్రముచేత నే
సంగ్రహింపనగుననియు విశదము కాకమానదుగదా.

నుశబ్దపరకమగు డు ప్రత్యయము నానంతర్యార్థమునఁ
బయిరీతిని బ్రయోగించుటయేగాక కేవల భావార్థమునందు
నైత మీ డు ప్రత్యయము నీక్రిందిరీతిని మార్పగాని ప్రాస్థల
మున నన్నయభట్టు ప్రయోగించియున్నాఁడు.

క. పడరత్ని ధనుర్ధరుఁడె
వ్వ్యోడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ జే
యుడు నాకుఁ జతుర్వర్గము
వడయుట యని పృథతసుతుఁడు ప్రార్థించె మునిన్.

(భార. ఆది. ౭ ఆ. ౧౬

పయిసందర్భమునుబట్టి 'ఉద్భవిల్లుదును' అనునది మొదలగువానిలోని 'దున్' అను చోటిద్రుతము 'ను' స్వరూపముతో నున్నదని శంకించుట కవకాశము లేదనియు, నచటి ను స్వరూపము చార్థకమగు ను శబ్దమే యనియు విశదమగుచున్నదిగదా.

(౧౩౭) పయి నుదాహరించిన నన్నయభట్టారకుని ప్రయోగములనుబట్టియు నాతని చింతామణిసూత్రార్థములను బట్టియు నాతనిమతమున ద్రుతము పొల్లునకారమే కాని 'ను' స్వరూప మెంతమాత్రమును గాదని సిద్ధాంతమగుచున్నదిగదా.

విచక్షణులారా, పైవిషయములనుబట్టి యాంధ్రశబ్దచింతామణి నన్నయభట్టవిరచితమే యనియు నం దనేక గంభీరాశయము లర్వాచీనవ్యాఖ్యలయందుఁ బ్రదర్శింపఁబడక నిగూఢములై యుండిపోయినవనియు నన్నయభట్టారకుని భారతభాగమునకును నాంధ్రశబ్దచింతామణికిని నత్యధికమగు నాంతరంగిక సంబంధ మున్నదనియు విశదమగుచున్నదిగదా.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారకరచిత మను సిద్ధాంతము నంగీకరించు నాంధ్రమహాశయు లాతని భారతభాగములోనుండి లేఖకపాఠకాదికృతములును ముద్రణ సంస్కర్తృకృతములును నగు నపపాఠములను దొలఁగించు మహాకార్యమునకుఁ గడంగుదురుగాక.

10.11-1936,
విశాఖపట్టనము.

వఝల చినసీతారామస్వామిశాస్త్రి
ఆంధ్రవిశ్వకళాపరిషత్వండితుఁడు.